

సంపు. ౧౨    భావసంవత్సరము, ఫాల్గునమాసము (మార్చి ౧౯౩౫)    సంఖ్య 3

## ఖయ్యాము ప్రశంస

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

ఓయీ ఉమ్రఖయామ, నీవు చని యెన్నోయేండ్లుపూండ్లాయె; లే
బ్రాయంపుంజెలి సాఖియుఁ ధరణిగర్భంబందు నిద్రించె; గు
ర్తే యాఁపట్టక నీ నిషాపురము జీర్ణించెంగదా! నీదిగో
రీ యైనన్ సడలుఁ; రుబాయతొకటే స్మృత్యంకమై నిల్చెడున్.

పంచాంగంబును సంస్కరించు గణితప్రావీణ్యమున్నన్, సలా
ముంచుఁ సంజరుషాహి ప్రీతిమెయి నీకర్ధాసనం బిచ్చి మ
న్నించంగల్గియు, గ్రీకుశాస్త్రములపాండిత్యంబు నార్జించియుం
గాంచంగల్గుదె నేటికీర్తి కవివేషాకుండినన్ ఖయ్యామా?

ఎందఱు [illegible] జ్యోస్యులు? మరెందఱు నీవలె [illegible]
[illegible]

నందనవాటికన్ గతిశనట్టులఁ బూఁబొదరిండ్లనీడ మా
కందఱకున్ రసార్ద్రకవితాసవ మిచ్చితి వాసదీఱఁగన్.

నీతత్త్వంబులు మాకుఁ బూజ్యములు కానీ, కాకపోనీ, మతే
మీ, తత్త్వాలకు నేమిగాని, మధురస్మేరాస్యయౌ సాఖి దృ
క్పాతం బైహికజీవితార్తిపరితప్తస్వాంతులౌవారికిం
జేతఃప్రీతి నొసంగు; మా కదియె యాశీర్వాద మిప్పట్టునన్.

బ్రతుకుటెడారిలో నిసుకబాటలఁ ద్రిమ్మరి నీరువట్టి దుః
స్థితి మరణింపనున్న యొకజీవి కదృష్టపువాఁగువోలె సం
తతము త్వదీయదివ్యకవితారసనిర్ఝరిణీప్రపాత మ
ద్భుతముగఁ జిత్తతాపమును బోనడచున్ శిశిరాంబుసేచనన్.

తెలుఁగుందోఁటలఁ బచ్చబీళ్ల ననురక్తిం బానశాలాప్రతి
ష్ఠలు గావించి త్వదీయకావ్యరసభాండంబుల్ గులాబీలు బు
ల్బులిపిట్టల్ మధుపానపాత్రికలు సొంపుల్ గుల్కు సాఖియు భూ
తలనాకం బొనరింప నిల్పి రసికాంధ్రప్రీతి గావించితిన్.

పారసికన్న శ్రావ్యమయి పల్లవకోమలమై సుధారసం
బూరెడుమా తెనుంగునుడి నొప్పి దమూనటు నీదుభావముల్
పరిచి చేర్చి కూరిచితి నింపగుకావ్యము నోఖయామ, నీ
పే రిఁక యావదాంధ్రపృథివీస్థలి శాశ్వతమై తనర్చుతన్.

తెలతెలవాఱ, సంజకడఁ, దెమ్మెర కమ్మగవిచ్చు పూలతా
వులఁ బువుఁ జేకులన్ విసరిపోయుత నీదుసమాధిపైని; బు
ల్బులులు గులాబిపూఁబొదలలోఁ జిరకాలము నీదుకీర్తి నిం
పొలయ నుతింతుఁగాక! సెలవోయి ఖయామ, సలాము, వచ్చెదన్.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

నాటకములు తెలుఁగులో వ్రాయుటకు పునాదివేసిన యగ్రేసరులలో కీర్తిశేషులగు ధర్మవరము రామకృష్ణమాచార్యులును, కోలాచలము శ్రీనివాసరాయలును గణనీయులు. తెలుఁగురూపకముల చరిత్ర వ్రాయువారు వీరి పేరులు మఱచుటకు వీలులేదు. కృష్ణమాచార్యులే మొదట తెనుఁగు నాటకము రచింప నుపక్రమించిన ధీరుఁ డని కొందఱి నమ్మిక. కాదనియు, ఆ మర్యాద వీరేశలింగముపంతులకో, మఱియెవరికో చెల్లవలయుననియు మఱియొక వాదము. దీనిని నిర్ణయించు నాధారములు ప్రకృతము నావద్ద లేవు. 'ఈసభ (సరసవినోదిని సభ) యుద్భవించి చిత్రనళీయము రచించువఱకు నీభాషయందు స్వతంత్రనాటకము లుండలేదు' అని కృష్ణమాచార్యుఁడే యొకానొక కరపత్రమునఁ బ్రకటించెను. అనఁగా అదివఱకున్నవి వీరేశలింగము పంతులు మొదలగువారి సంస్కృతాంగ్లనాటకముల పరివర్తనములేనా? చెప్పలేను. మఱియు ఒకవేళ కృష్ణమాచార్యుఁడే ఆంధ్రమున ఆదినాటకకర్తగా ఏర్పఱుపఁగలిగినను అది యంతగా గర్వపడవలసిన విషయముగాని, దుఃఖపడవలసిన విషయముగాని కాదని నాతలంపు. ఎందుకనఁగా ౧౮౮౩-వ సంవత్సరమునకు కొంత ముందుగానో వెనుకనో ఆయన జనింపకపోవుట ఆకస్మికమే తప్ప అతని తప్పొప్పులుగావు. మఱియెవరివియుఁ గావు. కాఁబట్టి కేవలము కాలమునుబట్టి కార్యమునకువిలువగట్టుట ప్రాయశః కృత్రిమమైన దురభిమానములను బెంచునేకాని హార్దమగు గౌరవప్రీతులను బెంపదు. ఇఁక శ్రీనివాసరాయల విషయమున ఈ వివాదమున్నట్లు లేదు. కృష్ణమాచార్యులకన్న కొన్ని నెలలుమాత్రము వీరు చిన్నవారై యుండి బ్రతికియున్నన్నినాళ్లును నాటకరచన ప్రధాన కార్యముగా ఇంచుమించు వారు వ్రాసినన్నియే నాటకములు రచించిరి. కాని వీరు నాటకరచన నికరముగా ఎప్పు డుపక్రమించిరను తేది నా కింకను తెలియరాలేదు. ప్రకృతము నాపనికి అక్కఱయులేదు.

నాలుగునాళ్లు వెనుకముందుగా ఎవరు వ్రాసినను వ్రాయకున్నను ౧౯-వ శతాబ్ది ముప్పాలు కడచువఱకును మనలో నాటకము లెవరును రచింపకపోవుటకు సంకోచింపవలసియున్నదే కాని వ్రాసినవారిలో నెవఁడు మొనగాఁ డను చర్చకుఁగాని, అహంకారమునకుఁగాని యర్థ మెక్కువలేదు. అప్పటికి రెండువేలయేండ్లక్రిందనే సంస్కృత ప్రాకృత భాషలలో అపూర్వమైన నాటకరత్నము లెన్నో పుట్టియుండి, నాటక మనఁగా నేమి

యని తెలియనివారు గూడ లక్షణగ్రంథము లనుజూచి రచించునంతటియధోగతికి ఆవిద్య దిగియుండెను. సంస్కృతభాషలో నున్న వానివంటి యుత్తమనాటకములుగాని, అధమ నాటకములుగాని యేభాషలోనైనను ఇప్పటికైనను గలవా యను సందేహము నాకున్నది. తెలుఁగుసాహిత్యములో పనిచేసిన వారందఱును సంస్కృత సాహిత్యమందు కొంచెమో గొప్పయో పరిచయముగలవారే. అట్లున్నను మొన్న మొన్నటివఱకు తెలుఁగు రూపకములు యక్షగానముల యంతస్తును దాఁటి పెరుగకపోవుట తెలుఁగువారి యధైర్యమును చాదస్తమును—సోమరితనమును—దెలుపునేకాని వేఱగునా? లక్షణదృష్టితో చూచితిమేని తెలుఁగులో నాటకములు వ్రాయఁదలఁచినవారు చేయవలసిన పని మెల్ల ఆభాషలోనుండి యీభాషకు అర్థభావములు మార్చుటయే. తక్కిన సామాన్య లక్షణమగు గద్యపద్యరచన మనవారికి క్రొత్తగాదు. ఐనను పందొమ్మిదవ శతకపు తుదలో ఆంగ్లసాహిత్య వ్యాసంగము స్థిరముగానిలిచి స్వతంత్రబుద్ధిని ప్రేరేచి నరముల నల్లాడించు వఱకును మనవారు మేలుకోలేదు. మన వారినిమాత్రము దూరనేల? భరతఖండములోని యన్నిభాషలవారిగతియు నట్లేయున్నట్లున్నది. అట్లు మేలుకొలుపులకు చిక్కిలేచి నాలుగుదిక్కుల పరువులెత్తిన కార్యశూరులలో మన కవిద్వయమును జేరి పనిచేసిరి. అది పందెమువేసికొని యెత్తిన పరువుగాదు. ప్రవాహమునకు చిక్కి కొట్టిన పరవశమైన యీఁత. నాలుగుగడియలు నాలుగడుగులు ఎవరు వెనుకముందైనను దానికి విలువలేదు.

వారామార్గమున ఎంత దూరము పోయిరి? ఏమేమి సాధించిరి? ఏమేమి వదలిరి? వారిమార్గము ప్రకృతము మన మెంత వఱకు ననుసరించవచ్చును? అనునదే సింహావలోకనన్యాయమున ప్రకృతము మనము చేయవలసినచర్చ. ఇది వారియందలి గౌరవముచేఁగాని, యీర్ష్యచేఁగాని చేయు గుణదోషవిమర్శకాదు. ఆదృష్టిచే కీర్తిశేషులగు ఆయిరువురు మహనీయులకు ఎట్టి లాభనష్టములును గలుగఁజాలవు. మఱి వారుచూపిన మార్గముననే పోవుచు, వారివలె యథాశక్తిగా ఆంధ్రసాహిత్యమందుపనిచేయుచునో, చేసిన చేయుచున్నవారి పనులఫలము ననుభవించుచునో యున్న మనకు ఆంధ్ర నాటక రచనా శిల్పము నింకను పెంచి పెద్దచేయ వలయునని కోరిక కలదు. దాని పరమావధిని దాఁకు పేరాస కలదు. కావున ఇప్పుడు మన యనుకూలమునకై ఆత్మసాక్షికముగా వారి పను లొక్కమాఱు కలయఁజూచుట తప్పని పని.

ఆంగ్లసామ్రాజ్యము మన దేశమున తేజోవంతమై వేఱూఁది చోటు చేసికొనుచుండిన కాలములో వీ రిరువురును, జనించినవారు; దానిఫలమగు స్వస్థతను శాంతిని పూర్ణముగా ననుభవించినవారు; ఆంధ్ర సంస్కృత సాహి-

త్యములకు తోడు ఆంగ్ల సాహిత్యమును చక్కఁగా చదువుకొన్నవారు; ఆసామ్రాజ్యమున కెదురుతిరిగిన దేశీయశక్తులు ప్రబలమై అల్లకల్లోలము చేయుటకు మునుపే దేశయాత్ర చాలించుకొన్న యదృష్టవంతులు; ఆసెమ్మదికి ఫలముగా తమకుఁగలిగిన ప్రాచ్య పాశ్చాత్త్యసారస్వత పరిచయముమూలమున తమ మాతృభాషను, తన్మూలమున దేశీయులను వృద్ధికిఁ దేవలయునని యుద్దేశముతో ప్రవర్తించినారు. కాని వీరేశలింగముపంతులు మొదలగు కొందఱవలె అన్ని త్రోవలలోను నడవఁబోయి అవకతవకపనిచేయలేదు. నాటకములు తెలుఁగులోలేని కొఱతను దీర్చుటకును, నట్టువలలోను, దాసర్లలోను నిలిచి యపభ్రష్టముగామన్న యభినయ విద్యకు మంచిగతిఁ గల్పించుటకును పూనినారు. దానికితోడు ఇందు మూలమున దేశమండలి దుర్నీతిని బోఁగొట్టఁగలమను గట్టి నమ్మకమును వారి కుండెడిది. కావున ఇరువురును చెఱి సుమారు ముప్పదింటికి మించి వివిధ రూపకములను రచించుటయే కాక ప్రత్యేకముగా 'సరసవినోదిని', 'సుమనోరమ' యను రెండు నాటకసంఘములను స్థాపించి, విద్యావంతులగు నటులను జేర్చుకొని యానాటకముల నభినయింపఁ జేసిరి. ఆజీవమానము ఇదే ప్రధానకార్యముగా, తక్కిన పనులన్నియు గౌణముగా నేర్పఱుచుకొని వర్తించిరి.

ఇట్లు వీరి నాటకములకు స్వరూపము నిచ్చిన ముఖ్యతత్త్వములు మూఁడు : (౧) ప్రాచ్యపాశ్చాత్త్యనాటకపద్ధతులు, (౨) తమ నాటకములను తామే యాడింపవలసిన భారము, (౩) జనులకు నీతిని బోధింపవలయునను నుద్దేశము.

(౧) ప్రాచ్యులకును, పాశ్చాత్త్యులకును నాటకరచనలో తత్త్వమునం దంతగాభేదము లేదు. ఇరువురును ముఖ్యముగా రసోపాసకులే. కాని పరిభాషయందు కొంత భేదము గలదు. మనలో రూపకములు మొదటినుండియు గద్యపద్యమిశ్రములు. సామాన్య సల్లాపమునకు గద్యము నుపయోగించి భావము తీక్ష్ణమైనచోట పద్యముల నుపయోగించుట సంస్కృతనాటకకర్తల పద్ధతి. కేవల గద్యరూపకములుగాని, పద్యరూపకములు గాని నే నెఱిఁగినంతలో వారిలో లేవు. పాశ్చాత్త్యులందును ఇట్టి మిశ్రరచనలు లేకపోలేదుగాని మొత్తముమీఁద వారిరచనలు వట్టి పద్యముననో గద్యముననో రచింపఁబడి యుండును. ఇటీవలవారిలో పద్యరూపకములు వాడుక తప్పిపోయినవి. ఇప్పు డట్టివి వ్రాయువారే యరుదు. మనలో అంకములను 'రంగములు'గా చీల్చు వాడుక లేదు. వారిలోఁ గలదు. భగవత్ప్రార్థనారూప మగు నాందితోఁ గూడిన ప్రస్తావన మన నాటకముల కెల్ల మొట్టమొదట నుండును. వారు కేవలము కథాభాగముతోనే మొదలుపెట్టుదురు. యుద్ధము, చావు మొదలగువానిని వారు

ప్రత్యక్షముగా చూపుదురు. మనవారు చూపరు; సూచింతురు. ప్రతి ప్రధానపాత్ర మును క్రొత్తగా రంగస్థలమునకు వచ్చుటకు ముందో, వచ్చిన యుత్తరక్షణముననో దానిని గూర్చిన పరిచయము సభ్యులకుఁ గల్గునట్లు సూచించుట ప్రాచీనపద్ధతి. పాశ్చాత్త్యులలో ఇది యంతగా పాటింపఁబడదు. మనవారు కేవల శోకపర్యవసానముగల కథల గ్రహింపరు. వారిలో నట్టి వెక్కువ. ప్రధాన పాత్ర ములను కేవలము ఉత్తమములుగానో నీచ ములుగానో తయారుచేయుట సంస్కృతము వారి దారి. ఉత్తమపాత్రములందు దుర్గుణము లను, నీచపాత్రములందు సుగుణములను కొంచెముగానైనను కలిపి సృజించుట పడ మటికవులమార్గము. ఇంకను కొన్ని చిల్లర సంకేతభేదములు గలవు. *

రెండుపద్ధతులను చక్కఁగా నెఱిఁగిన వారు గావున మనకవులు పై రెంటినుండియు కొంత గ్రహించి కొంత వదలి నూతన మార్గము ద్రొక్కు స్వాతంత్ర్యమునువహింపఁ గల్గిరి. ప్రాచ్యపద్ధతి వట్టిచాదస్తమని తిరస్క రించు నవివేకముగాని, పాశ్చాత్త్య పద్ధతి యశాస్త్రీయ మని యనహ్యపడు మొఱకుఁ దనముగాని వారి కుండలేదు. కాని వట్టి స్వాతంత్ర్య సాహసమునే మెచ్చుకొని వీర పూజ చేయుట ప్రకృతము మనపని కాదు. మనము స్వార్థపరులమని మొదలే చెప్పితిని. ఆ స్వాతంత్ర్యమును వా రెట్లు ఎంత యుప యోగించిరి? దాని ఫలము మన కెంత? అనునదియే యిప్పటి మన చింత.

వారికాలమున కప్పుడే ఆంగ్లవాఙ్మయ ములో పద్యనాటకములు మూలఁబడి గద్య నాటకములే యెక్కువగా వ్యాప్తియం దుండెను. అట్టిచో 'వారిలో కేవల పద్య రూపకములును, గద్యరూపకములును ఉన్నవే మనలో లేవే!' యని మాత్రము చింతించి మనకవు లిరువురును అట్టి రచనలకు పూను కొనకపోవుట నాకుఁజూడఁగా మనభాగ్యమే. వట్టి పద్యములేకాక ఆద్యంతముపాటలతోనే నిర్వహింపఁబడు 'ఆపేరా' లనఁబడు వింత రూపకములు వారిలోఁ గలవు! అవి వారి చాదస్తములకుఁ జేరినవి. ఆవాతలేపెట్టుకొని మనవా రొకరిద్దఱు పద్యనాటకములు వ్రాసిన వా రున్నారుగాని ఆవెఱ్ఱి యంతటితో నిలిచి పోయినట్లు తోఁచుచున్నది. 'ఆపేరా'ల ప్రతి బింబములను తయారుచేయుటకు మనలో నెవ రును చేయివేసినట్లు కానరాలేదు. తీవ్రభావ ములను వివరించుటకు గద్యముచేతఁ గాన ప్పుడు పద్యమును, పాటయు పనికివచ్చునే కాని ఆద్యంతము దానినే కలిపికొట్టుట నాట కమునందు ప్రధానమైన వాచికాంగికాభినయ ములకు తిలోదక మిచ్చినట్లే. ఆంగికాభినయ మునకు వేషభూషణాదు లెట్టివో వాచికాభి నయమునకు పద్యమును, పాటయు; గద్యమును

* ఇక్కడ ప్రాచ్య పాశ్చాత్త్య శబ్దములచే ఆంగ్లసంస్కృతనాటకములు మాత్రము గ్రాహ్యములు. అందును నే నెఱిఁగినవి. పైవి సామాన్య లక్షణములు. అపవాదములు ప్రకృతము గ్రహింపలేదు.

అట్టివి. పాత్రములను సమయసందర్భములను తెలిసి తగినట్లు మార్చుకొనవలసినవి. అట్లుగాక వినుటకు చదువుటకును ఇంపుగానుండునని పద్యమో పాటయో మొదటినుండి తుదవఱకు ప్రయోగించుట ధర్మావరము సరిగంచుచీర మాచుట కందమని పాత్రములందఱును ధరించినట్లగునుగాని వేఱుకాదు. మన కవులిద్దఱును పైమూఁటిని యథాయోగముగా నుపయోగించి తమరూపకములను చాల రసికజనాహ్లాదకములుగా నొనరించిరి. ఐనను ఇద్దఱకును పాటలయందలి యభిమానము కొంత దాక్షిణ్యగర్భముగానే కానవచ్చుచున్నదిగాని వానిని ప్రయోగించుటలో తగినంత ధైర్యము వారి కుండినట్లు తోఁపదు. 'పామర' జనతృప్తికై పాటలు వ్రాయవలసివచ్చినట్లే యిరువురును చెప్పుకొన్నారు. కాని కృష్ణమాచార్యులు ఒక 'అజామిళచరిత్రము'నఁ దప్ప నే నెఱిఁగిన యన్నినాటకములందును పాటలు వ్రాయక మానలేదు. మఱియు 'ప్రహ్లాద' లో ప్రహ్లాదునినోటిపాటలను 'ఆ గేయముల రచనావిశేషమును అద్భుతముగా నున్నది. నూతనశక్తి విలసిల్లుచున్నది' (ప్రహ్లాద. పు. ౨౮) అని హిరణ్యకశిపునినోట పొగడించుచు కవి తన పాటలరుచిని తానే పరోక్షముగా ప్రశంసించినట్లు తోఁచుచున్నది. శ్రీనివాసరాయలనాటకములలో నైదాఱుమాత్రము పాటలు లేకున్నవి. వారు వ్రాయనేలేదో, లేక యచ్చువేయలేదో తెలియదు. ఇరువురును వ్రాసిన పాటలనుగూడ గ్రంథమధ్యమందు అచ్చులో వానివానిచోటులఁ జేర్పక, కులముచెడినవారికి కూడుపెట్టినట్లు, మడుగు గ్రంథమంతయు ముగిసినతరువాత తుదలో నతికించి పొమ్మన్నారు! ఏమిప్రాయశ్చిత్తము పెట్టుకొన్నవో కాని యొకటిరెండు పాటలీ బహిష్కారమునకుఁ దప్పినవి. (చిత్రనళీయము. అం. 3. రం. ౮.) కొన్నిపాటలు పద్యముల వేషమునకును పనికివచ్చునవియై పంక్తికి నర్హము లైనవి. పాటలయందు వీ రిద్దఱికిని ఈసవతితల్లి మక్కువ యేలకలిగినది? సంగీతమునం దిరువురును మంచి పరిచయము గల రసజ్ఞులు. కాని వారికిని దెలియకయే గాయకులు మనుష్యజాతిలో నొకమెట్టు తక్కువ యను ప్రాచీనభావము వారిని వదలక యంటియుండెనేమో! లేక పాటయందుకొన్న వెంటనే నటులు తమనటత్వమును మఱచి సంగీతగాండ్రైపోయి నాటకమును కచ్చేరీక్రిందికి దింతురను భయము వారి కుండెనో! శ్రీనివాసరాయుల నాటకపు పాటలు నే విని యుండలేదు. కృష్ణమాచార్యులవి కొన్ని విన్నాను. వారికీర్తికిని, వ్యాప్తికిని పద్యము లెంతో అంతే పాటలును గారణము లగునని మాత్రము చెప్పక తప్పదు. ఇదిగాక కృష్ణమాచార్యులకు పద్యములుగూడ లేని గద్యనాటకమందే అభిమాన మెక్కువ యుండెననియు, దాని కుదాహరణముగా ఒకపద్యమైనను లేని 'అజామిళచరిత్రము' వారు రచించిరనియు, వారు ఇతర నాటకములలో

పద్యములు వ్రాయుటకు తత్కాలపు జనుల యభిరుచియే కారణమనియు ఒకానొక విమర్శకులు వ్రాసిరి. (శోపనా రా. పీఠిక.) ఏమో! చెప్పలేను. కాని యజామిళ చరిత్రమున పోతన్న భాగవతమునుండి యెన్నియో పద్యము లెత్తి కడపటి యంకమందు చేర్పఁబడినవి. కృష్ణమాచార్యులు సొంతముగా రంగముమీఁద నభినయించుటను జూడఁబడసిన పుణ్యాత్ములు, పద్యములను రసానుగుణముగాఁ జెప్పటలో వారివంటి నటులు లేరని చెప్పఁగా విన్నాను. ఎట్లును శ్రీనివాసరాయల నాటకములకంటె కృష్ణమాచార్యులవానిలో పద్యములు తక్కువ. మనస్సులలో నెట్టి యభిప్రాయ మున్నను ఇరువురు కవులును పద్యములను, పాటలను యథేచ్ఛముగా వాడినారనుట ప్రకృతము మనకుఁ గావలసినది.

అట్లు వాడునప్పుడు అనేకస్థలములందు చాల అపురూపముగా పాటపద్యముల రచన అతుకుకొని యందమైయున్నను ఎన్నో స్థలములందు వానియావశ్యకత లేకున్నను అవి కూర్చఁబడినవని చెప్పవలసియున్నది. భావములకు తీవ్రతలేనిచోట అవి యక్కఱ లేదని మొదలే విన్నవించితిని. ఇంతేకాదు. సామాన్యభావములకు వాని నుపయోగించి నచో హాస్యముగా పరిణమించునుగూడ. సారంగధరునిమీఁది వలపు తప్పని తెలిసి యున్నను దుర్బలమగు మనస్సు నాఁపుకో లేని చిత్రాంగి ఒంటరిగాఁ గూర్చుండి 'కోరకుమా కోరకుమా కూడనివాని' యని సురటిరాగమార్దవములో తన హృదయవేదనను వెడలించుట యెంతో మధురముగ నున్నది. అట్లే పినతల్లియింటికి పోవలదని సుబుద్ధి బలవంతము చేసినపుడు నిష్కల్మష హృదయుఁడగు సారంగధరునికి కోపము వచ్చి 'ఇఁక వినఁగఁజాల నీగాథ, నను గనలఁజేసె నీవేథ' యని కన్నడరాగముతో కసరి చెప్పటలో నెంతో యౌచిత్యమున్నది. కాని వేఁటకు పోయివచ్చెద నని రాజరాజనరేంద్రుఁడును, పోవలదని చిత్రాంగియు చెప్పకొనుచున్నాడు,

రాజ— ...

వరధరోద్యదురోజ సరోజవిలోచనా
కడుబిరాన నేవత్తునే...

చిత్రాం—

వరధరావరరాజ పరాజితమన్మథా
కనికరింపఁగ భారమాయెనే... *

ఇత్యాదిగా 'దయలాగు' పాటలలోనికి దిగుట విపరీతముగాదా! ఇట్లే యిరువురి నాటకములందును కొన్ని పద్యములు అనావశ్యకముగా అస్థానపతితములుగా రచింపఁబడినవి. పద్యములందలి భావములు మాట

* పైపాఁటను కృష్ణమాచార్యుల 'విషాదసారంగధరము' లోనిది. దండలివి. నేను వీని పాఠభేదములను, అసలువరుసలను చాలభేద మున్నదని యొకానొక మిత్రులు వచించిరి. యుక్తమే. కాని బళ్లారి పౌరమహాశయులు వానిని ప్రామాణికముగా సస్వరముగా ప్రకటించువఱకును, ఎవరెవరి నోటనుండియో విని గ్రహింపవలసిన నావంటివారికీపొరపాట్లుతప్పవు.

లందును, మాటలందెలివి పద్యము లొకటియను పెక్కుచోట్ల పునరుక్తము చేయఁబడియున్నవి. నటులలో సంగీత మెఱుఁగి పాడఁగలవారికిని, లేనివారికిని అనుకూలముగా నుండవలయునని యిట్లు చేసిరేమో! పద్యములందును సీసములు కొన్ని రాగమాలికగా పాడుట కనుకూలముగా ఆయా రాగముల పేళ్లుగూడ మెలకువగాఁ జేర్చి రచించుట వీరు త్రొక్కిన క్రొత్తత్రోవలలో నొకటి. సీసమువంటి పెద్దపద్యములలో వివిధము లగు భావములకు చోటుగలదుగాన అట్టిభిన్నభావములను వెలయించుటకు భిన్నరాగములు చాలసహాయముగా నుండఁగలవు. నటించువానికి వదలకుండ రాగములు గూడ తామే యేర్పఱిచి యిచ్చుటయు మంచిదే. కాని ఆ రాగముల పేళ్లుగూడ ముద్రాలంకారరీతిగా పద్యభాషలో నిమిడింపవలయునను నియమమును వీరుంచుకొనుటచే ఎన్నోచోట్ల రాగమును, భావమును పరస్పరమిశ్రితములుగా నుండవీలులేక పెరుగును వడ్లును గలిపినట్లుండుట తటస్థించినది. అర్జునుఁడు యుద్ధభూమియందు దుర్యోధనునితో నాడు వీరాలాపము సీసమున నుపయోగింపవలసిన రాగములలో 'నీలాంబరి' యొకటి! (కృ. బృహన్నల, అం. ౫, రం. ౧.) శ్రీనివాసరాయల 'హరిశ్చంద్ర'లో మాలకన్నెలు తమ గానకళా ప్రావీణ్యముఁ జూపు సందర్భమునఁ గూర్చిన ముప్పదియేడురాగాల ద్విపద యించుక దీర్ఘమైనను చాల సుచితమైనచోట పడినది. కాని వారి 'మైసూరురాజ్యము'లో వీరవర్మ జగన్మోహినుల సల్లాపమందలి నాట, గౌళ, వరాళి మొదలగు 'ఘన'రాగములమాలిక నిష్ఫలమైన కూర్పు. మఱియు వీరిద్దఱి పద్యకవిత ప్రబంధశయ్యకుఁ జేరినది. అందందు రసోచితముగా స్పష్టమై ధారాళమైన యర్థభావములును, భాషయుఁ గల పద్యములు రచించియున్నారుగాని, భావమును మఱుఁగుపెట్టు ప్రాసములతో నిండిన మొగుడుదిగుడు కూర్పుగల వెన్నియో అందందుఁ గలవు. సారంగధరుని శిక్షకు పరితపించు తల్లి రత్నాంగినోట,

శా. ఈకార్పణ్యము నీకుఁ గల్గఁజను నే!
　　యెగ్గేమి నేఁ జేసితిన్?
　నాకయ్యో సుతుఁడొక్కఁడేయగుఁగదా!
　　నన్నైన దండించి మా
　రాకారుణ్యసుతుఁగావవే!—యఘము పు
　　ణ్యంబెంచి నన్ బ్రోచువా
　రీకాలంబునఁ గల్గరే! తనయు నీ
　　రే నాకు! హా దైవమా!"

అని రాతిగుండెలు కరఁగున ట్లేడిపించిన కృష్ణమాచార్యుఁడే, అదే సన్నివేశమందు తిరుగా

క. దినయామినుల నయారే
　ఘనయాతన లనుభవింపఁగనయాయె న
　　　　　　　　　　　　　　యా!
　వినయార్యనయాసున్నయా
　తనయా మనయార్తి కేదియు ధారుణి
　　　　　　　　　　　　[నెనయా!

అను పనికిరానిపద్యమునుగూడ పాడించి తైతక్కలాడించినాఁడు! సీసము మొదలగు సామాన్యవృత్తములను ఎంతోముద్దుగా వ్రాయఁగలిగిన వీరిద్దఱును, ఉన్న దున్నట్లుగా, స్త్రీపర్వములో తిక్కన చేసినట్లు, ఎవరును వినని కనని వింతవృత్తములలో రచనను మొదలిడి రసధారను తెంచివేయుదురు. ఇద్దఱును నాటకములందు మాటలు మొదలు వ్రాసి, పద్యములు పాటలు తరువాత నిదానముగా రచించి నడుమ నడుమ చేర్చువాడుక కలిగినట్లున్నారు. కృష్ణమాచార్యులయముద్రితనాటకముల వ్రాఁతప్రతులను జూచిన నేమొ ఈవిషయమందు సందేహముండదు. పూర్వోత్తరసందర్భములు, ఆయాపాత్రముల పరస్పరసంబంధము, రసభావముల ధార—ఇత్యాదులు మనస్సులో జీవంతములై యున్నప్పుడు వ్రాసినపద్యములకును తరువాత నెపుడో యభిప్రాయము మనస్సులోనుంచుకొని కూర్చినపద్యములకును భేదముండదా? మొదటివి కథాప్రవాహముతోఁ జేరిన ట్లుండును. రెండవవి అందదుకులుగా నుండును. తెలుఁగు కవులలో నన్నయతిక్కనాదిపురాణకవులకంటె తరువాతి ప్రబంధకవుల రచనలయందు మనకవిద్వయమున కభిమాన మెక్కువ. కావుననే వారినిబోలిన శబ్దార్థరచనలు గల పద్యములెన్నో వీరియందుఁ గలవు. ఈవిషయమున కృష్ణమాచార్యులకంటె శ్రీనివాసరాయలు ఒకచేయి మీఁటినవారు. వారి 'శిలాదిత్య' నాటకమున కథానాయిక యగు నితంతువు సూర్యోపాసన చేసి గర్భము ధరించి లోకాపవాదమునకు చింతించుచోట తనగర్భమును తానే యిట్లు వర్ణించుకొనుచున్నది.—

మిన్నయి సన్నగా నున్న నా లేఁగౌను
 గరువంపు గరిమమైఁ బరఁగె నేఁడు,
రాగోరురుచులచే రాజిల్లు చనుమొనల్
 నీలకాంతివహించి నెగడె నేఁడు,
చిగురులజిగికాంతిఁ జెలువుగాంచిన మోము
 వెల్వెలఁబాఱుచు వెలసె నేఁడు,
మించె నిట్టూర్పు జనించె మరుత్కాంతి
 కొంచెపుటారు కప్పించె నేఁడు,
నడలకును మందభావంబు లడరె నేఁడు,
ఒడలికాంతికి జిగిహెచ్చి యొప్పె నేఁడు,
కడుపు బరువయి కాన్పించె ఘనతగాంచి
దై[illegible] ఎటుతెల్పుదుఁ దండ్రి కిపుడు!

(శిలాదిత్య. అం ౧. రం ౩)

ఇట్టిశబ్దార్థరచనలు ఇరువురనాటకములందును పద్యములందేకాక మాటలందును చూడవచ్చును. శ్రీనివాసరాయలయర్జునుఁడు అభిమన్యుని చావున శేడ్చుచున్న సుభద్రను,

'సుభద్రా! విపన్నదైన్యవిటపవిపాటనమానసభద్రా!.... మందగమనవిలాసవిజితభద్రా! క్షుద్రజన వాక్సంజనిత పాపవార్తాకర్ణనగాఢనిద్రా! ...... ఈమానముద్ర నేల వహించితివి?'

(శిరోమణి. అం. ౨. రం. ౧)

అని పలుకరించినప్పుడును, కృష్ణమాచార్యుల భరతుఁడు కౌసల్యతో తన నిర్దోషత్వము నత్యద్భుతముగా స్థాపింప నుపక్రమించి

'అట్టియాచకకల్పధామునకా, సుందర తను ప్రభాకామునకా, దుర్గ్రిహ ప్రథనభీమునకా, తరణికులాంబుధిసోమునకా……… రామునకా నేనెగ్గులెంచుట!'
(పాదుకాపట్టాభిషేకము. అం. ౮. రం. ౨.)

అని మకారాంతశబ్దములు పండ్రెండు వెదకి వేయునప్పుడును, మన కదివఱకును వరదలుగా కాఱిన కన్నీటిసూట తటాలున నెండిపోక, మన రెూర్పు సుతిమించక, యెట్లుండఁగలదో యెఱుఁగను!

ఇఁక అంకములను రంగములుగా విభజించుట, నాందీప్రస్తావనలు వదలుట, మరణము మొదలగువానిని ప్రత్యక్షముగా చూపుట—ఇత్యాదులలో పాశ్చాత్యపద్ధతి ననుసరించి మనకవులు నాటకరచనకు చాల మేలిమి తెచ్చిరనుటలో సందేహము లేదు. రంగములుగా అంకములను విఱుచుటచే కథలోని యనేకసన్నివేశములను మనము సాక్షాత్తుగాఁ జూడ వీలుండును. ఇతరులమాటలచే నూహింపవలసిన తొందఱయుండదు. ఈ విభజనకు ముఖ్యసూత్రము కాలదేశముల సామీప్యము. ఒకనాఁటికథ యొకయంకములోనుండవలయునని ప్రాచీనలాక్షణికు లనిరి. కాని రంగవిభాగమునకు చేయివేసిన తరువాత ఆనియమము సాధ్యముగాదు. ఆవశ్యకమునుగాదు. దేశమును, కాలమునుబట్టి కథాభాగమును ముఖ్యముగా నాలుగైదు భాగములుగా పంచుకొని యంకముల నేర్పఱుపవలయును. ఒక యంకమునకును మఱొకటికిని దేశకాలముల భేద మెంతయున్నను అంతగా నష్టము లేదు. సభ్యులకు విరామ ముండును గనుక. కాని రంగములందలి కథాసన్నివేశములకు దేశకాలము లెంతసమీపముగా నున్న నంత మేలు. ఒకరంగములోని పాత్రములే తరువాతి రంగమునకు వచ్చినప్పుడు రెంటికి నడుమ నెలలకొలఁది కాలముగాని, యామడల కొలఁది దూరముగాని కడచినట్లు చూపుట రంగరచనాదౌర్బల్యము. ఇట్టివి మన కవుల నాటకములం దపురూపముగా అందందు కానవచ్చును. వరూధిని మాయాప్రవరుని వరించుట మొదటిరంగము. తరువాతిదానిలో వారే వత్తురు. కాని యప్పటికే వరూధిని పూర్ణగర్భిణి. (కృష్ణ. వరూధిని. అం ౨. రం ౨-3) అనఁగా ఎనిమిదినెలలైనను దాఁటిన నన్నమాట! ఒకరంగమునందు ద్వారకాపురమున నుండిన యదురాయఁడు కృష్ణరాయఁడును మఱురంగమందే మైసూరుదేశమున నిలిచియుందురు! (శ్రీని. మైసూరు రాజ్యము. అం ౨. రం ౨-3.)

సంకల్పములో 'శుక్లాంబరధరం' ఉన్నట్లు మన సంస్కృతనాటకములలో నాంది పట్టి శాస్త్రముగా పరిణమించినది. భగవత్ప్రార్థనయే నాందియుద్దేశము. విఘ్ననివారణాదులు ఫలములు. కాని దాని నిట్లు అందఱు మెదురను పన్నెలు, వేషములు ధరించి చేయవలసిన పనియేమి? సంస్కృతనాటకములలోని నాంది యిప్పటిస్థితికి వచ్చుటకు ముం

దెన్నియవతారము లెత్తినదో, ఎందఱి భ్రాంతి కారణమో యనుచర్చ ప్రకృతము పనిలేదు. సూత్రధారుఁడు నటియు చేరి చక్కఁదాలాడుచు నడపు ప్రస్తావనయు నిట్టిదే. వికారము. దానిని కొంత నిపుణముగా నిర్వహించినవా రెవరో యొక రిద్దఱే తప్ప మిగిలినవా రందఱును పాచిపండ్ల దాసరిపాటను పాడినవారే. ఆచార్యులును రాయలును పైరెంటిని వదలుదమా వలదాయని యోచించి యోచించి, కొన్ని నాటకములలో పూర్తిగా శాస్త్రప్రకారము రచించి, మఱికొన్నిటియం దున్నట్లును లేనట్లునుగాక శాస్త్రమునకు వ్రాసి, తుదకు ధైర్యముతో ఆతంటా వదలించుకొన్నారు. కృష్ణమాచార్యులకంటె శ్రీనివాసరాయలకు ఇంకను కొంతచపలము మిగిలియుండె నని తోఁచెడిని. కాని యింత శుష్కములైనను నాందీప్రస్తావనలకు ప్రయోజనములు లేకపోలేదు. మొదటిది గ్రంథకర్త యొక్కయు, నాటకకథయొక్కయు పరిచయము గల్గించి రాఁబోవు పాత్రముల స్వరూపమును సభ్యులకుఁ దెల్పుట. ఈ పని యిప్పుడు ప్రత్యేకముగా 'కరపత్రముల 'మూలమునను, 'కథాసారాంశముల ' మూలమునను కొంత జరుగుచున్నది. ఇంతకంటె ముఖ్యమగు ఫల మేమనఁగా, వచ్చి కూర్చున్న సభ్యుల మనోధర్మములకు కొంత నెమ్మదిగలిగించి కుదురుగా నుండఁజేయుట. నాటకమును జూడవచ్చిన వారి చిత్తవృత్తి యొక్కొక్కరి దొక్కొక్క విధముగా నుండును. అప్పుడే భుజించి దిగుచెమటలతో వచ్చువారు కొందఱు; ఆలుబిడ్డలకై డబ్బుఖర్చుపెట్టి పిలుచుకొని రాలేక వారితో కలహించి వచ్చువారు కొందఱు; ఇంటిపెద్దలను మోసగించి కృతావస్థతో తప్పించుకొనివచ్చువారు కొందఱు; ఎవరెవరినో ప్రార్థించి అప్పుదెచ్చుకొని కడపటి నిమిషమున కాత్రపడి వచ్చువారు కొందఱు; దాక్షిణ్యమున వచ్చువారుకొందఱు; దొంగతనమున లోపలికిఁ జొచ్చువారు కొందఱు; వచ్చినవారిలో ఇరుగుపొరుగువారి వేషభూషలను విమర్శించువారు కొందఱు; కుర్చీలు వెనుకముందుల కీడ్చి మార్చి రగడచేయువారు కొందఱు; స్థలములకై తగవులాడువారు కొందఱు. ఇట్టి వివిధమనోవృత్తులుగల సభ్యులు నిర్ణీతమైనకాలమునకు సరిగా గంట వాగి తెరయెత్తఁగానే నాటకమందలి కథాప్రవాహమును గ్రహించి తన్మయులై చప్పుడు చేయక గంభీరముగా నుండుట సాధ్యము కాదనుట నాటకము లాడినవారికిని, చూచినవారికిని తెలియనివిషయము గాదు. ఇట్టి స్థితిలో కొన్ని పద్యములు, పాటలు, మాటలుఁగల్గి కాలుగంటప్రొద్దు కాలక్షేపము చేయుటకు పనికివచ్చు ప్రస్తావన సభ్యులను కొంత స్వాధీనమునకుఁ దెచ్చుకొని వారి చిత్తవృత్తులను నాటకాభిముఖముగాఁ జేయఁగలదు. మనకవులు ప్రస్తావనము వదలిరికాని పై ప్రస్తావనకార్యము నిర్వహించు మఱి యేమార్గముగాని యాశ్రయించినట్లు తోఁపదు.

రంగస్థలముపై చూపరానివని ప్రాచీనులు విధించినవానిలో కొన్ని అసహ్యములు. భోజనము, స్నానము, మితిమీఱిన శృంగారము—ఇత్యాదులు. ఇవి యెప్పుడును వర్జ్యములే. ప్రాచీననాటకములలో స్త్రీపురుషుల ముద్దులాటలుగాని, కౌఁగిలింతలుగాని నేనెఱిఁగినంతవఱకును రంగమందు చూపఁబడవు. మనకవు లిద్దఱిలో శ్రీనివాసకవి శృంగారపుమాటలు ధారాళముగా ప్రయోగించినను వానియభినయమున కవకాశమియ్య లేదని సంతసించుచున్నాను. కృష్ణమాచార్యకవి పరిరంభచుంబనములు ప్రయోగించినను పరవాలేదని తలఁచి అవకాశము కలిగినప్పుడెల్ల అనుమతి యిచ్చెను. ఈకాలపు సినిమాలను, కొన్ని అరవవారినాటకములను చూచినవారి కీకౌఁగిలింతలు, ముద్దులును చాల పవిత్రమైనసభ్యమైన శృంగారచేష్టలుగాఁ దోఁచును. కాని నామట్టుకేమో కృష్ణమాచార్యులు ఆ యింత చాపల్యమునుగూడ అణఁచుకొని యుండిన బాగుగా నుండెడిది. రంగస్థలమున మరణము చూపరాదని విధించుటకు మనవారియమంగళభయమే కారణముగాఁబోలు. కాని అమంగళము చూపినను అమంగళమే, నోటఁ జెప్పినను అమంగళమే. కనుక కథానుసారముగా మరణమునుగూడఁ జూపి మన కవులు అనావశ్యకమైనయీవిధిని దిరస్కరించిరి. మఱికొన్ని చూపరాదన్నవి రంగము మీఁద నసాధ్యములు. దూరప్రయాణము, యుద్ధము ఇత్యాదులు. ఎన్నివిధములగు పట్టి తెరలు, కత్తరితెరలును గలిగియున్నను ఇప్పటికిని దూరప్రయాణాదులు చక్కఁగఁ జూపలేము. యుద్ధమన్ననో యెంతవదలిన నంతమేలు. ఎట్లుచేసినను, ఎంతచక్కఁగ నభినయించినను నేను రంగమునఁ జూచినయుద్ధములన్నియు నగుఁబాటుగానున్న వేకాని వేఱు కాదు. అందును మన పురాణచరిత్రలలోని యుద్ధములు పట్టి తుపాకులయుద్ధములుగావు గుండ్లుగాక మందుపెట్టి ఢమ్మనిపించి క్రిందపడి నిద్రపోయినఁ జాలుననుటకు. కత్తులు, బల్లెములు, బాణములు మొదలగు వివిధాయుధములతో అంగాంగములు పొడిచి, నఱికి, చించి పొడిచేసి చేయవలసిన పోట్లాటలవి. కాఁబట్టి నాటకములలో యుద్ధములు తెరమఱుఁగులో ముగింపక రచ్చకుఁదెచ్చిన పోట్లనెల్ల సభ్యులకు రసభంగము గలుగునే కాని వేఱు కాదు. మనకవు లిరువురును యుద్ధప్రదర్శనమును పూర్తిగా వదలియున్న బాగుగా నుండెను.

రంగస్థలముమీఁదికి వచ్చిన పాత్రము లిట్టిట్టివారని సభ్యులకు తెలుపుటె యెట్లనుట నాటకకర్తలకెల్లఁ గలుగు గొప్పచిక్కు. పాశ్చాత్త్యనాటకములలో ఈచిక్కును విడఁదీయు నియమము లేవియు నున్నట్లు గానరాదు. నాటకమును చదువునప్పుడు నటుల కొఱకై వ్రాయఁబడిన కుండలీకరణమందలి సూచనలు, నాటకీయపాత్రముల పట్టీ మొదలగు సాహాయ్య ముండును. మఱియు చదివినభాగము మొద లర్థముగా దేని రెండవ

మాటలు చదివి తెలిసికొనుట కవకాశ ముండును. కాన అంతతొందర లేదు. కాని నాటకము ముఖ్యముగా దృశ్యకావ్యము. చూచునప్పుడు పైని యనుకూలము లేవియు నుండవు. కావున గ్రంథకర్తయే నిపుణముగా పాత్రములనోటనే ఆయావాని స్వరూపమును వెలువరుచుట ముఖ్యమైనపని. ఆనైపుణ్యము లేమిచేతనే యెన్నియో పాశ్చాత్త్యనాటకములందును, ఆధునికాంధ్రనాటకములందును ప్రవేశించినపాత్రముల స్వరూపము సభ్యులకు తెలియవచ్చులోపల వారాడినమాటలు, చేసిన చేష్టలును నిరర్థకములై పోవును. ప్రాచీనులు ఈ లోపమును సవరించుటకై విష్కంభము, ప్రవేశకము అనఁబడు చిన్న అవాంతరరంగములను గల్పించి కథయందంతగా ప్రాముఖ్యములేని పాత్రములను దెచ్చి మాటాడించి నాటకమందలి భూతభవిష్యదర్థములను, రాఁబోవు ప్రధానపాత్రములను సభ్యులకు తెలియఁజేయుదురు. అట్టివి కొన్నిచోట్ల చాలకృత్రిమములుగాఁదోఁచి కొంత వికారముగా నున్నను, నాటకము చూచువారు కృత్రిమములు, వికారములు నైన యెన్నింటినో చూచి యోర్చుకొని సరిపుచ్చుకొనవలసియుందురు గావున, పైని విష్కంభాదులనుగూడ వానిప్రయోజనము గమనించి సహింపవలయును. ఈ విషయమున మనకవు లింకను శ్రద్ధయెక్కువగా వహింపవలసి యుండెనని చెప్పక తప్పదు.

(సశేషము)

# ఆధునికాంధ్ర వాఙ్మయము—స్త్రీలు

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు

'తేనెసోక నోరు తియ్యనయినరీతి
తోడ నర్థమెల్ల దోపకున్న
గూఢశబ్దములను గూర్చిన కావ్యంబు
మూగచెవిటివారి ముచ్చటగును.

కందువమాటల సామెత
లందముగా గూర్చిచెప్ప నది తెలుగునకున్
బొందై, రుచియై, వీనుల
విందై మఱి కానుపించు విబుధులమతికిన్.'

ఇట్లు కవితారీతుల నెఱింగి రసముచిప్పిలు పద్యములు వెలయించి, ఆంధ్రవాణికి వలయు నలంకారముల గావించిన విదుషీమణుల చరిత్రల నెఱింగియు, 'స్త్రీలు విద్యనభ్యసింప నర్హులుగా' రనెడి వింతయభిప్రాయముల వెలువరించు బుద్ధిమంతు లింకను గలరు. వలయు సామర్థ్యమును స్త్రీలకు సహితము పరాత్పరుడు ప్రసాదించియున్నాడు. ఆసామర్థ్యమును గుర్తింపనేరక పురుషు డీరీతి వారలను మఱుగుపరచెనని తలంచుట సమంజసము కానేరదు — సముద్రగర్భమునం దంతులేని చీకటి లోయలమఱుగున దాగియున్న రత్నముల వెలువరించి విలువనిర్ణయించి వేనవేలు గడింపగల్గిన మానవుడు, వంటయింటి, పొగతెరలమాటున, వాఙ్మయలక్ష్మికి వెలుగు గూర్చు కొన్ని విలువగల మణులు గలవని యెఱుగడా? స్వార్థపరుడగు పురుషుడే అబల కన్యాయమొనరించినాడు. అందులకే అర్థాంకమైన ఉత్తమపథము నంద వలసిన స్త్రీ పతనము నొందినది. అవకాశముగూర్చినచో పురుషులకువలెనే స్త్రీలును పెక్కు విలువగల గ్రంథములను లోకమునకు సమర్పించియుండెడివారు. ఆంగ్ల వాఙ్మయమున ప్రతిభావంతుడని పేర్వడసిన రస్కిన్ మహాశయుడు: "You bring up your girls as if they were meant for sideboard ornaments and then complain of their frivolity." (అలంకారార్థమై గృహమునందుంచుకొను వస్తువులవలె మీరు మీబాలికలను తయారుచేసి తుదిని వారియల్పత్వమును గాంచి యాక్రోశింతురు.) అని నుడివియున్నాడు. ఒక ఆధునికాంధ్ర కవిపుంగవు డీవిషయమునుగూర్చి:

"చదువన్నేర్తురు పూరుషుల్ బలెనె శా
స్త్రంబుల్ పఠింపించుచో
నదమన్నేర్తురు శత్రుసేనల ధను
ర్వ్యాపారముల్ నేర్పుచో
నుదితోత్సాహముతోడ నేలగల రీ
యుర్విన్ బ్రతిష్ఠించుచో
ముదితల్ నేరగరాని విద్యగలదే
ముద్దార నేర్పించినన్."

అని హెచ్చరించుచున్నాడు.

భరతఖండమున వేదకాలమునందుగూడ స్త్రీలయందు విద్యగలిగి వేదాంతగోష్ఠిలో దిగిన బ్రహ్మవాదినులున్నట్లు గార్గి, మైత్రేయి మొదలగువారి జీవితచరిత్రలు తెలుపుచున్నవి. మొల్ల, ముద్దుపళని మొదలగు విదుషీమణులే గాక, ఆంధ్రవాఙ్మయమునందు తుక్కాదేవి మరీచిపరిణయమును రచియించిన మోహనాంగి, వేంకటాచల మాహాత్మ్యమును వెలయించిన తరిగొండ వెంకమాంబ మొదలగు విద్యావతులగు నారీమణులు గలరు. ఆంధ్రవాణికి వీరు బంగరుపళ్లెరములతో నివాళి యొసగి శాశ్వతయశస్సును బడసియున్నారు. ఆకప్పురపుతావి యాంధ్రమాగాణములం దింకను ఆవరించియున్నది. ఆహారతివెలుగున వాఙ్మయలక్ష్మియొక్క ప్రాక్తనవైభవమును కన్నులార గాంచి ఆంధ్రాక్షరాస్యు లింకను ఆనందించుచున్నారు.

ఈ మధ్యకాలమున వాఙ్మయరంగమునుండి స్త్రీలు మఱుగుపడిరి. వలయుప్రోత్సాహము లేకుండుటవలన

కాబోలు, ఉద్గమనీయమైన వారి కళా ప్రతిభలు క్రుంగి పోయినవి. గ్రంథములను ప్రకటించుటకే వారలనో వెను కాడిరి. పరాత్పరుని యనుగ్రహమువలన కొలదివత్సరములనుండి మరల కొన్ని మంగళకరమగు చిహ్నములు ద్యోతకమగుచున్నవి. తెనుగు పేరటాండ్రు కమ్మతావుల గుబాళించు కావ్యకుసుమముల నంజలిఘటించి, మందగమనముతో, అధికభక్తితో, చరునగవుతో, సరస్వతీ మంటపసోపానపంక్తిని అధిరోహించుచున్నారు. నవ్వు వెన్నెలల వెలయించుచు, కలుముల పైదలికోడలు వారల నాహ్వానించుచున్నది. కొలదికాలములో వారు తుది సోపానము నధిష్ఠించి, వాణికి వలయు పరిచర్య లొనరించి నివాళించి, అమృతమయమగు ప్రసాదము నాంధ్రులకు పంచిపెట్టెదరు.

మొల్ల మొదలగు విదుషీమణుల చరిత్రలు మన కిపు డలభ్యమై, మీదుమిక్కిలి వారిచరిత్రలు, నడవడులు, కులములు తారుమారై అపోహల కాలవాలములై యుండుటచే, నేటి ఆంధ్రవిదుషీలోకమున కట్టివి భావికాలమున ఆపాదింపబడకుండుటకును, వారి కావ్యకుసుమములందలి మకరందమాధుర్యమును అక్షరాస్యులగు తెనుగువారికి చవిచూపించుటకును ఈవ్యాసముద్దిష్టమైనది.

ఆధునికయుగమున నాంధ్రగద్య వాఙ్మయము సర్వతోముఖముగ నభివృద్ధిని గాంచుచున్నది. ఈయుగారంభమున నాంధ్రవాఙ్మయమునందు గన్పట్టుచున్న ముఖ్యమైన పరివర్తనములలో నిదియొకటి. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు గద్యవాఙ్మయవికాసమునకు తమయొకనకొలని ప్రయత్నించినవారిలో నొకరు. ఈ విదుషీమణి కాపురస్థలము గుంటూరుమండలమునందలి బాపట్ల. బ్రాహ్మణులును, ఆర్వేలవారును, భారద్వాజసగోత్రులును అగు పాలపర్తివారింటి యాడుపడుచు. అత్తవారు కనుపర్తివారు, ఆర్వేలవారు, కాశ్యపసగోత్రులు. ఈమె ౬-౧౦-౧౮౯౬ తేదీని జన్మించెను. ౧౯౦౯-వ సంవత్సరమున కనుపర్తి హనుమంతరావుగారిని వివాహమాడెను. చిన్ననాటనుండియు కాలమును వమ్ముసేయక ప్రతిభావంతులగు సోదరుల సాయమున వలయువిజ్ఞానము నార్జించుకొనెను. అందులకే

"బ్రాహ్మధర్మప్రవిష్టుండు బ్రహ్మవిదుండు
సత్యమార్గానువర్తి సుసౌమ్యమూర్తి
యాంధ్రసాహితి ననుజాతసైన నాకు
సాదరంబున నేర్పిన సజ్జనుండు
పరమపావనమైనట్టి పాలపర్తి
యన్వయసుధాబ్ధిసోముండై యవతరించి
ధరను నరసింహమను పేర బరగినాండు
సోదరుండును గురుండునై సారిదినొప్పు
మాన్యచరితుం డాతనికి నమస్కరింతు."

అని యగ్రజన్మునియెడ కృతజ్ఞతను వెలువరించి, బరువుచేటగు సొమ్ముల కాసింపక, తళుకుబెళుకు సింగారముల గోరక, అమూల్యమను డాదరమమీర నొసగిన శబ్దార్థచంద్రికయను నిఘంటువునే సారెకట్నముగ గ్రహించి, గృహిణీపదము జొచ్చెను. అత్తవారింట కాలమును వ్యర్థమొనరింపక, పెక్కువ్యాసములను, కథలను విరచించి పత్రికల కంపెను. "ఈవిషయమున వారి ఋణము నే నేవిధముగను తీర్చుకొనజాలను. చదువుటయందును, వ్రాయుటయందును నా కెంతయుత్సాహము లుండిననేమి! వా రొక్కమాటతో నిరోధించిన నాగిపోవలసిన దేకదా!" అని యొకచో బలికి, ఈవిదుషీమణి తనభర్తయొక్క విశాలహృదయమును విశదపరచెను.

తెనుగుబాసయందలి యొకవింత యొయ్యారమును శ్రీవరలక్ష్మమ్మగారు తమశైలియందు దలపరచుకొనిరి; పూసలలోని దారమువలె, మెల్లగా చల్లగా వీచు పిల్లగాలిలోని కమ్మనితావివలె, కనుపించియు కనుపింపని విధమున, స్ఫురించియు స్ఫురింపనిరీతి అది యలరుచుండును. అందులకే వారెంతదీర్ఘమగు వ్యాసమును ప్రకటించినను, దానిని చదువునపుడు విసుగు జనింపదు.

శారదాలేఖలయందు శ్రీవరలక్ష్మమ్మగారు గణనీయమగు పెక్కువిషయములను పరామర్శించియున్నారు. అపారమగు లోకజ్ఞానము, ప్రవిమలమగు దేశభక్తి, అకుంఠితమగు కార్యదీక్ష ఈలేఖలయందు ప్రతిబింబించుచున్నవి. సమర్థురాలగు కవయిత్రి యిట్టిపనికి

పూనుకొనుట మిగుల సంతసింపవలసిన విషయము. శారదా శాసనమును నిరసించు సనాతను లాలకింపవలసిన పలుకులు, విడాకులచట్టమునకై పాటుపడు నవీను లాలోచింపవలసిన విషయములు, అవినీతికరము లగు కథల ప్రచురించి సంఘాభ్యుదయమునకు దోహద మొనరించుచున్నామని పొంగిపోవు పత్రికాధిపతులు చెవియొగ్గవలసిన సలహాలు, గౌరవవిహీనములకై ప్రయాసపడు పెద్దమనుష్యు లాలింపవలసిన మాటలు ఈ గ్రంథమున విరివిగా గలవు. సుకుమారమగు మందలింపులతో (Gentle-sarcasm) శ్రీ వరలక్ష్మమ్మగారు ప్రతిలేఖయందును అనుసరణీయము లగు నభిప్రాయములను వెలువరించియున్నారు.

బాల్యవివాహముల కాలమునను, వృద్ధులకు గొందఱు ప్రాయమునందున్న బాలికల నొసగి ధనమునపేక్షించు క్రూరులగు తల్లిదండ్రుల కాలమునను అమాయకులగు అబలల కెంతటియన్యాయము జరుగుచున్నదో, కఠినాత్ముల హృదయమును సహితము కరగింపజాలు వాగ్జాలంబుతో నెంతచక్కగా వివరించుచున్నారో తిలకింపుడు: "కాసీ పెట్టి కొనిన కాయగూరకైన ఉపయోగయోగ్యముగా నున్నంతవరకు విసిరివేయము గదా! అట్టిచో అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్య నావిద్యాధికు డెంతసులువుగా పరిత్యజించెనో చూడుడు. ఆకాయగూరలపాటి గౌరవమున కర్హ గాదా? అగ్నిసాక్షిగా వివాహమాడిన కళత్రము! ఇట్టివాడు పెద్దమనిషి, చదువరి, పైన న్యాయవాది. స్త్రీలకు ధర్మశాసనముల సాయములేదు; లోకసానుభూతి లేదు. వైవాహికస్వాతంత్ర్యము లేదు; బంధువర్గపు తోడ్పాటు లేదు; సంఘసహకారము లేదు. ఇక నేమిచేయును? పురుషుని స్వార్థమునకు బలియైపోవును." మఱియు "ఒకస్త్రీప్రాణము దీసిననేరముకంటె నొకస్త్రీ సుఖమును, సంతోషమును, ఉత్సాహోల్లాసములను నాశము చేసి, జీవన్మృతురాలినిగా జేసిననేరము బలవత్తరమైనది. కాని ప్రథమనేరమున కురిశిక్ష వేయుదురు. కాని ద్వితీయనేరమునకు పరిశీలనయే లేదు" ఈపలుకు లొకవిద్యావతియగు స్త్రీనుండి వెలువడినవని పాఠకులు జ్ఞప్తియం దుంచుకొందురుగాక. ఈ కడగండ్లను వర్ణించుటకు పురుషునకు శక్యముగాదు; అవి స్త్రీ హృదయమునకే యెఱుక. ఈ గ్రంథమునందలి మొదటి ౮, ౫ లేఖలను సంపూర్ణముగ పఠించి, ధనమునకై కడుపారగన్న కూతుండ్రను బలిపెట్టు తల్లిదండ్రులు తమ ప్రవర్తనమును సవరించుకొనుట లెస్స.

బాల్యవివాహముల నిరసించి, సంఘసంస్కరణమునకు ఆమోదమును వెల్లడించిన శ్రీ వరలక్ష్మమ్మగారు విడాకులచట్టమును ఆమోదించి, కనులుమూసికొని ముందడుగువేయలేదు. ఈవిదుషీమణియందు గన్పట్టుచున్న ప్రశంసనీయమైన గుణవిశేష మేమన: ఏవిషయము నైనను నిర్మలమగు హృదయముతో పరికించి, యుచితమగుదానిని ఆమోదించి, అనుచితమగువానిని నిరసించుటయే. కేవలము ఆవేశమునే అధారపరచుకొని ఈమె తన లేఖినిని నడిపింపనేలేదు. మూరెడొక్క బారెడు శ్రుంగువిధ మీమెన్యాసవిధియందు గన్పట్టదు. విడాకుల చట్టమునుగూర్చి వ్రాయవలసివచ్చినపుడు "దీని నామోదించినచో భారతమహిళల నిరుపమానశీలముచే సముపార్జితమైన జగద్వందితకీర్తికి కళంకమొదవెడు పరిస్థితు లేర్పడవచ్చును. మఱియు అవమానము, క్లేశము, చింత మున్నగు కష్టములకు స్త్రీ గుఱికావలసివచ్చును. కాదంటిమా? నిర్హేతుకముగా భర్తృపరిత్యాగినులైన స్త్రీల దుర్గతికి తరణోపాయము దోచకున్నది." అని కళవళపాటును వెల్లడించిరి. మఱియు, "ఒకపురుషుని యదుపాజ్ఞలకు లోబడియున్న స్త్రీయొక్క మాతృత్వమే సవతిబిడ్డలయెడ నధికతమమై యుండగా స్వతంత్రుడగు మగవాడు సవతిసంతానమునెడల నింతకంటె నిర్దాక్షిణ్యుడగుటకు నవకాశము కలదుగదా. కావున విడాకులచట్టముచే బిడ్డల సుఖస్థితి కష్టభూయిష్ఠమగును. మఱి, ఆలుమగల సంసారమో, నూతిబడ్డబిడ్డచందమున నెప్పటికప్పుడు ప్రమాదకరమై యుండును." అని వెచ్చనూర్చిరి తుదిని "ప్రత్యేకపరిస్థితులలో అనగా బాలిక గర్భాధానము కానట్టిదియు, లేదా సంతానములేనట్టిదియు నైయుండి భర్త మందుడు, పిచ్చివాడు, కుష్ఠురోగి, దేశాంతరగతుడు నైనచో నట్టిబాలికలకు పున

ర్వివాహ మొనర్పనగును. ఇదియే యాజ్ఞవల్క్యస్మృతి యం దుదాహృతమైన ధర్మసూత్రము. ఇట్టిస్థితియందే స్త్రీకి పునర్వివాహార్హత నొసంగవలెనని నాయభిప్రాయము. దీని కొప్పదేని జీవత్పతికస్త్రీలకు వివాహాధికారము శాసనరీత్యా నిషేధింపబడవలెను; కాని యెట్టి మినహాయింపులు లేక విడాకులచట్టము నామోదించుట మాత్రము ఉచితమార్గము కాదు." అని తమయుద్దేశ్యమును వెలువరించిరి. ఈగ్రంథమునందు వర్ణింపబడిన విషయములు కల్పితములుగావు, "కన్నులార చూడని దియు, చెవులార వినని దియు అగు విషయము లేవియు నిందు లిఖింపబడలే"దని గ్రంథకర్త్రి ప్రథమముననే తెల్పియున్నందున, వీని యుత్కృష్టతను పాఠకులు గమనించి యామోదించుట యుచితము.

ఎన్నియో కథలు నేటి పత్రికలయందు ప్రకటింపబడుచున్నవి. అనుచితములగు విషయముల కాలవాలము లగు కొన్నికథ లీకవయిత్రిహృదయమును కంపింపజేసినవి. అందువలననే "మగవాడు తన తల్లికి, కొమార్తెకు, తోబుట్టువుకు, భార్యకును, ఆడుది తనతండ్రికి, సోదరునకు, పెనిమిటికి, పుత్రునకును చదివి వినిపించుటకు అర్హమైనదిగా కథ యుండవలయునని మాసోదరుడనిన పలుకులు, గురుమంత్రమువలె నామనస్సున శాశ్వతముగా నాటిపోయిన" వని నుడివియున్నారు. నేటి కథకులు, పత్రికాధిపతులును ఈవాక్యములను గమనించి తమకర్తవ్యమును గుర్తించుట యుక్తము.

ఆధునికాంధ్రవాఙ్మయమునందు కథానకములు మిగుల యున్నతస్థానము నాక్రమించుచున్నవి. శ్రీవరలక్ష్మమ్మగారిందును కొంతపరిశ్రమ గావించియున్నారు. వీరింతదనుక రచియించిన కథానకములం దంతులేని చక్కదన మూటలూరుచున్నది. ఏదియో యొకవిషయము లోకమున వెలుకవరుపదలచినపుడే వీరీప్రయత్నమునకు గడంగుచువచ్చిరి.

గజపతిమాతురగు రుచీదేవి జనకుని ప్రోత్సాహమువలన భర్తయగు కృష్ణరాయని కేళికాగారమునందు జంప బ్రయత్నించి విఫలయైనతరువాత కృష్ణరాయ డామెను పుట్టినింటికి బంపగా నామె దారియందొక పల్లెయందు నిలచి యచ్చట పెద్దతటాకము త్రవ్వించి ఒకధర్మశాల నిర్మించి, తుదిని వేటకై వచ్చి అలసి తమ కుటీరమునకు వచ్చిన ప్రాణనాథునకు సపర్యలొనరించి ఆతని యనుగ్రహమును తిరిగి సంపాదించినవిషయమే వీరు రచియించిన 'వరదరాజేశ్వరి' అనుకథానకమున కాధారము. ఈకథానకమునందు శైలియొకింత సంస్కృతశబ్దముల కాలవాలమైయున్నను, కథావస్తువును నడుపుట యందు వీరు ప్రదర్శించిన కౌశలము అప్రతిమానము. రుచీదేవియందలి ప్రశంసార్హములగు గుణవిశేషములను లోకమున కెఱిగించి, ఆమె నిర్దోషియని నిరూపించుటకే యీకథానక ముద్దేశింపబడినది.

అంధుడగు భర్తను ఎడమచేత బట్టుకొని, కన్నులు తెరువని పసిపాపను కుడిచంక నెత్తుకొని, ఎఱ్ఱయెండలో సంపన్నులగువారి గృహముల కేగి పరాభవింపబడి, తుదకొక రౌతుకలవానిచే నోదార్పబడిన నిర్భాగ్యురాలి జీవితచరిత్రమే "దరిద్రనారాయణునకు ఐశ్వర్యవంతుడికి బిరుదైతే" అను కథానకమున కాధారము.

విద్య నభ్యసించుచున్న బాలికల కట్టికష్టములున్నవో, ఎట్లు వారు భర్తలచే తృణీకరింపబడి, వారి కోపానలమున కాహుతియగుచున్నారో మొదలగువిషయములే 'అయితే లలితగతియేమిటి' అను కథయందు పరామర్శింపబడినవి. ఇట్లే పెక్కు కథానకముల నీ విదుషీమణి రచియించెను. ఇందు చాలభాగము 'భారతి' యందు ప్రచురింపబడినవి. ప్రస్తుతము వీరు 'అపరాధి' యను నవల వ్రాయుచున్నారు.

శ్రీ వరలక్ష్మమ్మగారి పద్యము లంతగా పత్రికలయందు ప్రకటింపబడియుండలేదు. 'లక్ష్మి' అను మకుటములో వీరు దాదాపు నూరు గీతపద్యములను వ్రాసియున్నారు. ఇందును పెక్కువిషయములు చర్చింపబడినవి.

"నీతిలేని విద్య నిందనీయం బెందు
నీతిలేని భక్తి నిష్ఫలంబు

నీతిలేని బోధ నిరుపయోగము గాన
నీతియందు బుద్ధి నిలుపు లక్ష్మి!"

అని ప్రబోధించుచున్నారు. స్త్రీలు నాటకరంగమున ప్రవేశించుట కీకవయిత్రి సమ్మతించియుండలేదు. అందులకే

"నెలత యగ్గియంట, నేయి పూరుషుడంట
కదిసిరేని మనులు కరుగునంట
యువతియువకు లొకట నుండెడి నటనలో
నింపవలయునా నెలత లక్ష్మి!"

అని పలుకుచున్నారు. బాలవితంతువుల దౌర్భాగ్యస్థితికి కోమలమగు నీమెహృదయము కరగిపోయినది. వారి కడగండ్లు కన్నులార గాంచియుండుటచేగాబోలు,

"విద్య చెప్పరాదొ క్షౌరవు మాపగరాదొ
మరల పెండ్లి చేసి మనుపరాదొ
పతిగతించినంత బాధింపగా నేల
తెలివిమాపకుండ తెలుపు లక్ష్మి!"

అని దీనముగ ప్రశ్నించుచున్నారు. ఇందులకు బాలవితంతువుల భావియభివృద్ధి నిచ్ఛగింపనివా రేమని జవాబొసంగెదరో?—వారి జీవితము లట్లు నిరర్థకములై, నిస్సారములై, నామరూపములు లేక కాలవాహినియందు కలసి పోవలసినదేయని శాస్త్రములు విధించెనని వారు ప్రత్యుత్తరమిత్తురు—అందులకే శ్రీ వరలక్ష్మమ్మగారు,

"తిరమే దాస్యతమంబునన్ మునిగి
దీప్తంబైన విజ్ఞానమే
యరుదొటన్ గనలేము గాని మఱి
నాలోచింప శాస్త్రిలహో
తరుణిన్ కేవలశత్రువుగా దలచి
ధర్మాధర్మ మూహింపకే
పురుషుల్ స్వార్థత నల్లినట్టి
యుక్తిపోగుల్ గావె భావింపగన్."

అని నుడివియున్నారు.

ఈవిదుషీమణి 'ద్రౌపది వస్త్రసంరక్షణము' 'సత్యాద్రౌపదిసంవాదము' అను ద్విపదకావ్యములను రచియించియున్నారు. ఇవి మిగుల సులభముగా నుండుటచే స్త్రీలును, బాలికలును, బాలురును పఠించి, ఈ గ్రంథముల నాదరింపవలసియున్నది.

తాను గీచిన గీటు దాటకుండునట్లు, పతిని వశము చేసికొనవలయునని యుబలాటపడు సత్యభామ ద్రౌపదిని సవిూపించి

"వనితా నాకొక శంక మదియందు గలిగె
అదియేమియంటేని అతివగో వినుము
నీప్రియభర్తల నిప్పాండుసుతుల
వదలక కొల్తువు నదియె నీవెట్లు
ఒకరికంటె నొకరు ఉవిద నీయందు
అనురక్తులై యుంట అక్కజంబగును
మంత్రాలవల్లనా మందులవలన
వ్రతములవల్లనా వరవిలాసమున
పలుకులవల్ల నా పాండిత్యమునన
ఏవిధి నీకబ్బె యింతభాగ్యంబు"

అని ప్రశ్నింప

"మంత్రతంత్రంబుల మగలను సతులు
వశము చేసుకొనుట వట్టిదేసుమ్మీ
సతి యిట్టి దుష్కార్య సల్పినయెడల
కలనైన నయిందు కాంతుని మదిని
మగనను నమ్మక మదిరాక్షి పొత్తు
పాముతో పొత్తుగా ప్రాణేశుడెంచు
మందులకు మగలు మనవశమైన
పతిభక్తి ధర్మంబు పడతి కింకేల."

అని భామ నీతినేర్పినది. చక్కని శైలికిని, విలువగల నీతులకును ఈగ్రంథములు నిలయములని నిరూపించుటకే ఈపైభాగము లుద్ధరింపబడినవి. మొత్తముమీద, శ్రీ వరలక్ష్మమ్మగారి లేఖిని గద్యవాఙ్మయమునందే నిరంకుశముగ విహరించిన దనవచ్చును. వీరిభావము లత్యున్నతములు కాని ఆభావములను వ్యక్తపరచుపదముల బింకము వీరి పద్యములయందు కొఱతవడియున్నది. అధికప్రతిభా సమన్వితయగు నీవిద్యావతి కొలదికాల

ములో విలువగల పద్యమణిహారములనుగూడ తెనుగుతల్లికి ఉపాయనముగ నొసగవచ్చునని ఆశించుచున్నాడను.

ఆధునికాంధ్రవిదుషీలోకమునందు, శ్రీ వరలక్ష్మమ్మగారొక పవిత్రస్థానము నలంకరించుచున్నారు. ఈ గద్యకవిని తన పాండిత్య ప్రకర్షమువలన

" పరిశీలించిరి నీ మొవ్యాసమును మున్
ప్రాజ్ఞత్రయిం జేరి; వా
రిరి దల్కల్పితగాథలన్ జదివిరీ
వే పత్రికాశ్రేణిలో
నరసీ! చక్కని తర్కశక్తి! మధుర
త్వావాప్తియున్ తత్తద
ర్థారసస్ఫూర్తియు భూషణంబులు తదీ
యాఖర్వ్యదాగ్రీతికిన్."

అని పండితులనే తలలూపించిరి.

వీనుమిగిలిన ఆధునికకవయిత్రులలో నొకరగు సీతాంబగారు

" శ్రీకల్యాణయుతంబులౌ సుగుణముల్
చెన్నొందు విజ్ఞానముల్
లోకంబుల్ వినుతించు కీర్తి, విదుషీ
లోకంబు లగ్గింపఁగా
సాకల్యంబగునట్టి గ్రంథరచనా
శక్తు ల్విశుద్ధాత్మయున్
మీకు న్గల్గె మరెందు గాన వరల
క్ష్మీదేవి కాంతాళిలోన్."

అని శ్రీ వరలక్ష్మమ్మగారిని ప్రశంసించియున్నారు.

ఇట్లే శ్రీ వరలక్ష్మమ్మగారు విసుగెరుగని హృదయముతో గ్రంథముల నెలయించి ఇతోధిక సుప్రతిష్ఠ నార్జింతురని ఆశింతును. (సశేషము)

# తుంగభద్ర*

దీపాల పిచ్చయ్యశాస్త్రి
(సంపాదకుఁడు)

శంకంబుల్ మకరీంద్రముల్ కమఠముల్ భీతిల్లి దూర్యమార్గముల్
దాఁకన్ పెల్లు గుభల్‌గుభల్‌రవళి చెందఁగన్ నిమజ్జజ్జనా
నీకాఘౌఘసమీరడింభకుల నిర్నిద్రాహిరూపైన నీ
రాకన్ గంటిని, కావుమంటిని, సుభద్రా, తుంగభద్రానదీ!

పొంగన్ ఫేనము లుప్పతిల్ల ఝురముల్ పుష్పాళ్లు తేలాడఁగాఁ
దుంగత్క్ష్మాధరముల్ వకావకలుగా, తుంపుర్లు మిన్నంటఁగన్
రంగద్భీమఘుమంఘుమార్భటులు మీఱన్ ధాటిగావత్తు వౌ
రంగద్భక్తతరంగరక్షణసముద్రా, తుంగభద్రానదీ!

* నే నీచాటువులను సేకరించి చిరకాలమయినది. రచయిత పేరును, సాధుతరపాఠమును నాకింతవఱకును లభింపలేదు. ఎఱుకగలవా రెఱిఁగింతురుగదా యని యిట్లు ప్రకటించితిని.—సంపాదకుఁడు.

కమనీయంబగు తావకీనఘనజాగ్రత్తుంగకల్లోలసం
భ్రమముల్ చూచినయంతఁ బాపములు దూరంబయ్యె, మజ్ఝారె! మే
లమరెన్, మంజులకంజపుంజమకరందాస్వాదమాద్యన్నట
ద్భ్రమదిందిందిరబృందఝాంకరణముద్రా, తుంగభద్రానదీ!

రకపుంధాటికి గుండ్లుపెల్లగిలి పార్లన్ దేలి తూగాడి పో
టికి నొండొండు వడిన్ దగర్లగతి డీడీకొంచు తద్ఘాంకృతుల్
నికృతిం గూర్చు భవత్ప్రజంబునకు మేలే! తల్లి! భాస్వచ్ఛసాం
ద్రకనత్కంకణవారితార్థిభవనిద్రా, తుంగభద్రానదీ!

నిండార్లై భవదీయచండతరనిర్నిద్రప్రవాహంబు పె
న్గొండల్ క్రిందునుమీఁదు చేసికొని రాఁ గుప్పించి, పొంగించి యు
ద్దండాభంగతరంగసంచయము లుద్యత్కాంతి నుప్పొంగి మా
ర్తాండుం దాఁకు నదేమిచోద్యమొ సుభద్రా, తుంగభద్రానదీ!

ఘట్టా లుట్టిపడన్ బెడాబెడలు వక్కాణింపఁ బైపైఁ గర
ఘట్టిల్లై దుముకన్, పతద్గిరిశిలానోన్యాతిసంఘట్టనో
ద్య..................పటువిధ్వానంబునన్ వత్తు వౌ
దట్టంబై; ప్రతి నీకు లేదు గుణభద్రా, తుంగభద్రానదీ!

కొండల్ బెంపువడన్ గుదుంగములు నుగ్గునూచమై కూల బ్ర
హ్మాండం బల్లలనాడ బోరున సముద్యద్ధాటికాఘోటికా
చండోచ్చైర్గతి వచ్చు నీ కిదె నమస్కారంబు, కాండస్థవే
దండోత్తుండసముజ్ఝితాంబుసదనిద్రా, తుంగభద్రానదీ!

# కౌంతేయులు

దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

( భావ. సం. ప్రారంభసంచిక తరువాయి )

భీముడు కర్ణార్జునుల ద్వంద్వయుద్ధములో కర్ణుని సూతకులసంభవునిగా నెంచి నగుచు తూలనాడగ దుర్యోధనుడు కడునలిగి భీమునికిచ్చిన ప్రత్యుత్తరము :

సూతకులజన్మంబు సురేంద్రజన్మంబును,
 నేలుంజన్మంబు నెఱుగవనున ?

......ఘటసంభవుడుగాడె కీర్తిపరుడు
వరుస ద్రోణుండు, విప్రులవలన బుట్టె
క్షత్రియుల్ ఘనులవనిగాన ?
కడగి మీజన్మములు నిట్లగావె వినగ ?

ఆది ౬-౫౮.

ఈనిందలోగూడ ఆచార్యుల పుట్టుకవరకు పూజ్య భావమె కాన్పించుచున్నది. వీరు సురజన్ములుకాబోలు! సూతులగు యుధిష్ఠిరభీమార్జునుల విషయమున "కడగి", "వినగ", "మీజన్మములు నిట్లగావె" అని ముభావముగ (వివరణరహితముగ) చెప్పుటలో నేదోరహస్యమున్నటుల కాన్పించుచున్నది ఇతడు ధూర్తుడు, మఱియు కోపములో బలికినాడు, కావున దీనికేమి లెమ్మని త్రోసిపుచ్చక సత్యాన్వేషణమునకై ప్రయత్నింతము. ఈజిజ్ఞాసలో తప్పేమికలదు ?

## దూర్వాసమంత్రము

దూర్వాసమంత్రప్రభావమును మనము సవిమర్శముగ పరిశీలనజేసినగాని పైసత్యాసత్యములు స్ఫురించవు.

## కర్ణ చరిత్రము

'సూర్యుండును నీకు దుర్వాసుండిచ్చిన వరంబును మంత్రంబు శక్తియు నెఱుంగుదు. మదీయదర్శనంబు వృథ కాదు. నీయభిమతంబు సేయుదుననినం, గుంతియిట్లనియె.

ఏను మంత్రశక్తి యెఱుంగక వేడితి,
గన్యకనియు గోరగాను నాక,
నాకు గర్భమైన నాతలిదండ్రులు
జుట్టములును నన్ను జూచి నగరె ?

అనినవిని సూర్యుండు దానికి గరుణించి, నీకు సద్యోగర్భంబున బుత్త్రుడుద్భవిల్లు నీకన్యాత్వంబును దూషితంబుగా దోషదుండుమని వరంబిచ్చిన దక్షణంబ యక్కన్యకకు నంశుమంతునంశంబున గానీనుండై,'

ఆది. ౫.౨౩-౨౫

కర్ణుండను జన్మించె.

## ఆరణ్యపర్వ కర్ణ చరిత్రము

'........ప్రభాకరుండును నిజయోగబలంబున మూర్త్యంతరంబు ధరియించి, కుంతిపాలికిం జనుదెంచి మధురస్వరంబున. ఆర. ౭,౩౨౬.

నీవాడనైతి, ననుం బ్రియంబు
నీకు నెయ్యది! యొనరింతు? నిజము సెప్పుమ
యనిన బడతి యిట్లను గమలాప్తుతోడ. ౩౨౭

కార్యమొక్కటియును లేదు కౌతుకమున
నేనుమంత్రంబు నొడివితి నింతమాత్ర
జేసి నీ విచ్చటికిని విచ్చేయనేల ?
దివికి నరుగుము క్రమ్మఱ దేవనీవు. ౩౨౮

అనిన దానికి సూర్యుం డిట్లనియె. ౩౨౯

ఇప్పుడు మదీయసమాగమంబున కొడుకు బడయుము, నీకోరినయట్ల తనయుండు జనియించు. నిట్లు చేయుని నాడు భవజ్జననీజనకులను భస్మంబుసేయుదు. మఱియు నీదైన శీలవృత్తంబు లెఱుంగక వంత్రంబు గర్వంబునం జేసి నీకుపదేశించిన తాపసు నీక్షణంబ నిర్దహింతు. నిది యంబరంబుననుండి యింద్రాదిసురులు నీకతమ్మున

జిక్కువడియున్న నన్ను నవ్వుచున్నవారు. వీరింజూడుమని దివ్యదృష్టియిచ్చినం జూచి, కుంతిభోజరాజనందన అమందలజ్జావివశయగుచు దినేశ్వరుని కిట్లనియె. ౩౩౧

* * *

మఱియు ననేకప్రకారంబుల దివాకరు ననునయించి, యెట్లునుం గ్రమ్మరింపనేరక, తనకారణంబున కులంబునకు, గుణజంబులకు నపాయంబగునని తలపోసి భయంబు మిగుల దెసవసేసి యాతనికిట్లనియె. ౩౩౪

బంధనుమతినైన నను, ని
ర్బంధముమెయి ధర్మబాహ్యపథమున నలిసి
బొందిన, యిటు సేయుటయును
బంధురభాగీయకీర్తి పతితముగాదే? ౩౩౬

అయ్యిందుముఖిం జూచి యిట్లనియె.

* * *

తలిదండ్రులును బాంధవజనములు
గాను నీయోగికి కర్తలు, కాను నీవ
యొడయము కాలపు నీకు నుజ్వలాంగి,
కామంబులెల్లను గామించి పొందుట
నయ్యె గన్యాశబ్ద మట్లుగాన
నాత్మస్వతంత్రత్వంబునందు నీకెగ్గులే
దే, నేలనడతు ధర్మేతరంబు,
మత్సమాగమమున మదిరాక్షి, నీదుక
న్యావ్రతంబు జెడదు, నందనుండు
నధికతేజుండుపుట్టుమగు, నిన్ను నొక్కనిం
దయును బొందకుండు తథ్యముబల. ౩౩౭

అని యొడంబఱిచి, సూర్యుండు తత్సమాగమంబునం బ్రీతుండై, దానికి గర్భాధానంబు సేసి, గగనంబున కరిగె నంత............గర్భం బభివ్యక్తం బయ్యును, బ్రభాకరు మహిమంజేసి లోకవిదితంబు గాకుండెం. తత్ప్రకారంబు దాదికూతురొక్కతియ యెఱుంగు, నిట్లు వర్ధిల్లుచుం బదియవమాసంబున నొక్క నాటి నిశాసమయంబునం గన్యాంతఃపురంబునందు ౩౩౯

కర్ణుడు జన్మించెను.

ఇట్లు జన్మించిన యర్భకుం జూచి, లోకాపవాదభయమువకుం దలరి, యాకుణంబ యొక్కమంజసలోన నబ్బాలకుం బదిలంబుగా నిడి, దాని నతివృఢంబుగా దెప్పబంధించి, సఖియును, దానును గొనిచని పురసమీపగతంబైన యశ్వనదీప్రవాహంబున విడిచి, కుంతి యెంతయు సంతాపంబున నిట్లని విలాపంబు సేసె. ౩౪౧

పాఠకులు దీర్ఘభాగము నుల్లేఖించితినని విసిగికొనక ఇందలి స్వారస్యమును గ్రహింపుడు. పురాణమే కాకపోయిన ఇదియొక ప్రబంధఘట్టము. ద్విప్రకారమగు కర్ణజననమును చూపితిని (ఇది అందఱెరిగినది). మొదటిది దైవికము. కాని, "మదీయానుగ్రహంబు వృథ కాదు నీయభిమతంబు సేయుము" అనుటలో దాంపత్యము (సమాగమము) సూచింపబడినది. రెండవకథ పైవిషయమును వ్యాఖ్యానము చేయుచున్నది. కాని దీనిలో దైవికమానుషిక క్రియలు మిశ్రముగ గాన్పించును.

సూర్యాసుమంత్రోపదేశ స్మృత్యంతము నాకర్షించి కుంతిని మోహించిన ఒకానొక సత్ప్రభాకరుడు, ఈ నాటకమాడినా డని తలంపవచ్చును. దాదికూతురు సహాయముపడియుండును. లేకపోయిన, "మదీయ సమాగమంబున గొమరుంబడయుము, నీకోరినయట్లు తనయుండు జనియించు. నిట్లుసేయని నాడు భవజ్జననీజనకులను భస్మంబు సేయుదును. మఱియు......నీకుపదేశించిన తాపసు నీక్షణంబ నిగ్రహింతు" అని బెదిరించుట, "తల్లిదండ్రులును బాంధవజనములు గాదు నీయోగికి కర్తలు" అని స్వాతంత్ర్యము ప్రేరేపించుట, "ఏనేల నడతు ధర్మేతరంబు" అని ధర్మాచరణపరాయణునిగా తన్ను నిరూపించుట, "మత్సమాగమమున మదిరాక్షి నీదు కన్యావ్రతంబు జెడదు." అని నమ్మించుట, "నిన్ను నొక్కనిందయును బొందకుండు తథ్యముబల" "అని యొడంబఱిచి సమాగమమున బ్రీతుండై" గుట ఇవియన్నియు విశ్వాససాధనములు కావు; వశీకరణతంత్రవాదములు; స్వీకృతప్రభాకరపాత్రాభినయములు.

ఇంతేకాక "గర్భం బభివ్యక్తంబయ్యును బ్రభాకరుమహిమంజేసి లోకవిదితముగాకుండెం" ఈ మహిమయే నిజమైన "తత్ప్రకారంబు దాదికూతురొక్కతియె యెఱుంగు" అనుటలో ప్రభాకరుమహిమ తగ్గ

చున్నది. ఏ యన, ఈదాదికూతురు పైసమాగమమప్పుడు వెంబడియున్నదైనను దానికి తెలియకుండ నుండవలెను. ఇట్లనే కుంతికి కర్ణుడు పుట్టినపుడుగూడ ఇతరులతో పాటు దాదికూతునకు తెలియకనె కుంతియొక్కతియె పుత్త్రుని అశ్వనదీప్రవాహమున విడచియుండవచ్చును. లేదా ఒకానొకదాసీకన్య బిడ్డనిచట కని దిగవిడిచి పోయినదని ఇతరులకు, దాదికూతునకు చూపి బిడ్డను పెంచియుండవచ్చును గదా! పై కారణములచే దాదికూతురును "ఇచ్ఛం గృతస్నాతయై"న కుంతియు ఆ బలాత్కార ప్రభాకరునిపాలబడిరి. కావున గర్భము దాచి, పుత్రుని నదిలో విడచుకృత్యములలో దాదికూతురు బాసటయైనది. కపటప్రభాకరుడు కుంతిని నమ్మించుటకు ఒక ఐంద్రజాలికమునుమాత్రము చేసెను. కాని ఇది బాధకముగాదు. నమ్మికకు కారణము ప్రభావమైన బాధకమెయగును. "ఇంద్రాదిసురులు నీకతమ్మున జిక్కువడియున్న నన్ను నవ్వుచున్నారు వీరింజూడుమని దివ్యదృష్టియిచ్చినం జూచి" నమ్మినది. ఇందరు సురులు జూచుచుండ "కుంతి భోజరాజనందన అమంద లజ్జావివశయగుచు"న్నదాని నెటుల కపటప్రభాకరుడు కలసెను? ఐంద్రజాలికమును ప్రభావముగ నమ్మిన కుంతికి, తనవారి వంశహానితప్ప మరేమియు తోచలేదు. ఇక కపటికో? ఐంద్రజాలికసురులు వీరిసమాగమమును జూడజాలరని నమ్మిక. కథనడచుటకు ఇబ్బంది లేదు. లేదా కుంతివిషయమున పంతము వైచుకొనిన బృందమునవచ్చును.

## ధర్మరాజు జననము

విరోధముల పరికింపుడు.

నీ నేవేల్పు నారాధింతు నానతిమ్మనిన సంతసిల్లి కుంతీదేవికిం బాండురాజిట్లనియె. ఆది. ౫-౯౧

(ధర్ముని) నియోగించిన గుంతియుం బతికి ప్రదక్షిణముచేసి, సమాహితచిత్తయై మహాముని యిచ్చిన మంత్రంబు విధివంతంబుచేసి, ధర్ముని నారాధించిన, నాధర్ముండును యోగమూర్తిధరుండై వచ్చి వరంబిచ్చినం, గుంతియు తత్ప్రసాదంబున గర్భంబుదాల్చి సంవత్సరంబు పరిపూర్ణంబగుటయు. ఆది. ౫-౯౩

ధర్మజుడు పుట్టెను.

ఇచట "యోగమూర్తిధరుండై వచ్చి వరంబిచ్చెను." కర్ణజననమున "(యోగమూర్తిధరుండై) "సూర్యుడు తత్సమాగమంబున ప్రీతుండై దానికి గర్భాధానంబునేసె" ఒకే దూర్వాసమంత్ర ప్రభావ ఫలితములు పరస్పరవిరుద్ధములుగ నున్నవి. ఒకచో సంగమసంతానము, అన్యత్ర సమాగమరహితము. ఒకచోట పదిమాసములప్రసవము, మరియొకచో సంవత్సరము.

ఒకవేళ ధర్ముడుగూడ సంగమము గావించినాడనుకొందమనినను, పాండురాజ సమక్షము. అయినను అతనికి తెలియకయే, యోగమహిమచే జరిగియుండవచ్చుననిన, కర్ణజననమున దాదికూతునకు సమాగమ గర్భరహస్యములు తెలియవలసిన యావశ్యకము లేదు. ఫలితమేమన, కుంతి యాయా దేవతలను దూర్వాసమంత్ర ప్రకారము ఉపాసించుచు, రహస్యసమాగమమును జరుపుట లోకాచారమై యున్నది.

## అర్జున జననము

దూర్వాసమంత్రమునకు మరియొక విరోధము కలదు, చిత్తగింపుడు.

ఇట్లతినిష్ఠ నేకపాదస్థితుండై తపంబు సేయుచు, గుంతి నొక్కసంవత్సరంబు వ్రతంబు సేయంబంచియున్న నప్పాండురాజున కింద్రుండు ప్రత్యక్షుడై (పుత్రవరమిచ్చెను). ఆది. ౫-౧౧౪

పాండురాజు "నియోగించిన గుంతియు దొల్లింటియట్ల దూర్వాసుండిచ్చిన మంత్రంబున నింద్రు నారాధించిన దత్ప్రసాదంబున గుంతికి, ౫-౧౨౧

అర్జునుండు పుట్టె.

దూర్వాసుమంత్రప్రభావమునకు ఇంద్రుడు ప్రత్యక్షుడై సంతానమునిచ్చియుండగ, పాండురాజు ఏకపాద

స్థితుండై, పుత్రసంతానార్థమై ఇంద్రు నారాధింపనేల? త్రిలోకవిజయుం బడయుటకుకాబోలు! ఈత్రిలోకవిజయునకు దూర్వాసమంత్రజనిత కర్ణుడు ప్రతియోధ. ఈ శ్రీకృష్ణుని వాక్యముచే కర్ణార్జునుల బలాబలములు తెలియును:

నీచేతను నాచేతను
వరమడిగిన కుంతిచేత వాసవుచేతన్
ధరచేత భార్గవుచేతను
అరయంగా కర్ణు డీల్గె నార్గురిచేతన్.

అప్పటికి పాండురాజ ధృతరాష్ట్రులకు విరోధములు లేవు. త్రిలోకవిజయుఁ డెందులకు కావలసివచ్చినది? ఏతపంబులేక కలిగిన భీముడు బలహీనుడా? ఇంద్రవరముండగ దూర్వాసమంత్రప్రసక్తి మరల నేల కలిగినది? దీనిచే నేర్పడునదేమన, భీముని తదనంతరము ఒకసంవత్సరము పిండకోశదోషమువలన కుంతి సంతానము బడయజాలకపోయినదిగ నూహింపవచ్చును. ఇంద్రవరముకంటె దూర్వాసమంత్రప్రభావమే ఉత్కృష్టమైనది. కాని చివరకు దానికిని సమాగమ మావశ్యకము. మన్యుతపస్సు వ్యర్థము. కాని "పాండురాజవియోగదుఃఖితలై యున్నవారి వారించి యమ్మునులయందొక్క వృద్ధతపస్వి మునిసహస్రానుమతంబున నిట్లనియె. ఆది. ౫-౧౫౧

భానునిభుండు పాండుజన
పాలుడు ఘోరతపంబుజేసి ధ
ర్మానిలవాసవాశ్వినుల
దైన వరంబున శక్తిపేర్మితో
నీ వరనాథనందనుల
నేవుర వంశవివృద్ధిపొంటె బం
చాననసత్త్వులం బడసె
నాశతశృంగమహానగంబునన్. ౫-౧౫౨

ఈ మునివాక్యములో దూర్వాసమంత్రప్రసక్తియే లేదు. పాండురాజు ఘోరతపమే కారణముగ చెప్పబడినది. ఇంతకుపూర్వము సూచించిన ఇంద్రతపస్సు తప్ప పాండురాజు సంతానముకొఱకు మరేమియు గావింపలేదు. ఇందుకు ప్రమాణము. బ్రహ్మలోకంబునకు బోయెడు మునులుచెప్పిన వాక్యము—

"......మునులు గరుణించి యోగదృష్టి నవాగతంబెరిగి నీవపుత్రకుండవుగావు. దైవాధిష్ఠితంబైన సంతానంబు నీకు ధర్మానిలశక్రాశ్వినులవరంబున నగు, నక్షయలోకంబులు బడయుదువు గావున సంతానార్థంబు యత్నంబుసేయుము. ఆది. ౫-౨౦

దాని క్రిందిప్రయత్నము గావించెను—

పితృవరుల ఋణముదీరదు అని దుఃఖించి మృగశాపముదలంచి తనవలన సంతానంబయ్యెడువిధంబు లేమి యెరింగి యొక్కనాఁ డేకాంతంబున కుంతి కిట్లనియె. ౫-౨౨

......నొందుడక్క సం
తానము నాకు నయ్యెడు వి
ధంబొనరింపుము ధర్మసంస్థితిన్.... ౫-౨౩

ఇతఃపూర్వము వానప్రస్థాశ్రమమున తపస్సుగావించినాడు కాని సంతానముకొఱకు కాదు. మునులవాక్యములోని "దేవాధిష్ఠితంబైన సంతానము" నకు ఈక్రిందివ్యాఖ్యానము గమనించినచాలును. ఇది శతశృంగమునిది—

కురుకులవిస్తారకులు దేవపుత్రులు యుధిష్ఠిరభీమార్జున నకులసహదేవులనంగా దేవాధిష్ఠితనామంబులు దాల్చిన(౫-౧౫౫)వారేకాని దేవతలకు కలిగియుండలేదని దృఢపడుచున్నది. ఇంతేకాక కర్ణుడు తన జన్మవృత్తాంతమును కుంతికి చెప్పుటలో:—దూర్వాసు గ్రహంబునంజేసి నింద్యంబుగాక తక్కనేనియు, నాజన్మంబు పరమరహస్యంబైయున్నది దీని బ్రకాశంబుసేయుట మన కెంతమేలదియునుంగాక. (ఉద్యో. ౮-౬౩.)

ఈపరమరహస్యమును మరియొకవిధముగా దలచెదరేమో. కుంతి కర్ణునకు రాజ్యకాంక్ష పురికొల్పునప్పుడు "దీని బ్రకాశంబుచేయుట మన కెంతమేలు" అనుటలో గూఢార్థమిమిడియున్నది. అది సత్యవతి వేదవ్యాసుని విచిత్రవీర్యక్షేత్రములందు పుత్రార్థమై

నియోగించిన సారాంశమైయుండును. కర్ణుడు తనపరాభవమును స్పష్టముగ చెప్పజాలకపోయెను.

ఇక్ష్వాకురాజసంహితల యందు ధర్మస్థితిం బుత్రోత్పత్తిగావించెద వీరలు నాచెప్పిన వ్రతం బొక వత్సరంబు సేసి శుద్ధాత్ములగుదురేని సత్పుత్రులుపుట్టుదు రనిన సత్యవతి యిట్లనియె. ఆది. ౪-౨౪౬

ప్రకటముగ వంశవిస్తా
రకులగు పుత్రకులఁ జెచ్చెరం బడయుము"

ఈపద్యాలు ప్తభాగమున అరాజ (ఆది. ౪-౨౪౭) కము నొకకారణముగ జూపినదిగాని భీష్ముఁడుండగ అరాజక మెట్లగును. ఈయన ధృతరాష్ట్ర పాండు రాజుల యుక్తవయస్కులవరకు అరాజకములేక పాలించ లేదా? కావున రహస్యవృత్తిలేక మంత్రతంత్రములతో పాటు కారణసిద్ధమగు దాంపత్యమును సూచించినది. కర్ణాభిప్రాయ మిదియేయని స్పష్టముగ కాన్పించుచున్నది.

(వృద్ధతాపసుడు చెప్పిన పాండురాజు ఘోరతపస్సు)—కుంతి దూర్వాసమంత్రమును చెప్పిన కారవులకు ఏమైన దుహూహలు కలిగి పాండుపుత్రులకు రాజ్యార్హత లేకపోవునేమో యని తలంచి సుస్పష్టముగాని, (కుంతీ ఉపాసనా దేవతలను, లేదా పాండురాజు పేర్కొనిన దేవతలును) సత్యమును ఘోరతపస్సుగా చెప్పియుండెను. కావున కుంతీరహస్యసమాగమ పురుషు డెవ్వడో మరియొకమారు విచారింతము. ఇంకను మంత్రప్రతిపాదకములను ఆయాసందర్భముల సూచింతును.



చట్టికోన జలపాతము-జయపురము M. V.

# శ్రీ భగవద్గీత

## (సంస్కృతము— తెలుగులిపి)

శ్రీ చెల్లంకొండ రామారావుగారి భాష్యార్కప్రకాశవ్యాఖ్యానముతో, నాలుగుసంపుటములు, దాదాపు 1420 పుటలు, రాయలుసైజు, చక్కని కాగితములు, ముచ్చటలుహార్పు అచ్చు, అందమైన అట్టబైండు. వెల సంపుటము ౧-కి రు. ౧-౮-౦.

గుంటూరుమండలములోని బమిడిపాడు గ్రామవాసులు శ్రీయుతులు కే. శే. చెల్లకొండ రామారావుగారిభాష్యార్కప్రకాశమను వ్యాఖ్యానము వ్రాసియున్నారు. ఈభాష్యార్క ప్రకాశము శంకరభాష్యమునకు మెరుగుపెట్టునదై యున్నది. వీరు, శంకరాచార్యులు వ్యాఖ్యానము చేయక వదలివేసిన భాగమునకు వ్యాఖ్యానమును, వారు వ్యాఖ్యానముచేసిన భాగమునకు పదాన్వయమును గావించిరి. సంస్కృతమున కొంచెము ప్రవేశముగలవారు గూడ సులభముగ నర్థముచేసికొనదగినంత సులభశైలిలో నీవ్యాఖ్యానము వ్రాయబడియున్నది. అందరును ఈ గ్రంథమును జదివి గీతల పరమార్థమును దెలిసికొని యానందింతురుగాక!

# జీవన ప్రభాతము

అనువాదకులు: శ్రీ పోలవరపు రామబ్రహ్మముగారు, B A., Murugan the Tiller (మురుగన్ ది టిల్లరు) అను పేరున శ్రీ కే. యస్. వెంకటరమణిగారు ఆంగ్లభాషను రచించిన సుప్రసిద్ధనవల కిది యనువాదము. ఇది రమణీయమయిన సాంఘిక నవల. పాశ్చాత్య విద్యావిధానము, పాశ్చాత్య సంస్కారము, పాశ్చాత్యాదర్శములు మొదలగువానివలన గలుగు కష్టములు ఇందు చక్కగ వర్ణితములయినవి. ఆంధ్రవాఙ్మయమున నిట్టి కథావిధానము గల యీ నవల క్రొత్తది. ఆంధ్రులెల్లరు చదువవలసినది. క్రౌను ౪౭౬ పుటలు. వెల రు. ౧—౮—౦ మాత్రము.

# బసవపురాణము వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పండ్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకు డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను, కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులుగురిపించినాడు. గ్రంథము భిన్నభిన్న మండలములకు జెందిన పెక్కు తాళపత్ర మాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందు గలదు. ఆకాలపుటపూర్వసారస్వత చారిత్రక విశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారుల కిది యత్యంతోపకారకము.

# భారతీయ చిత్రకళ

## గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి, ఏ., బి. యల్.,

ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంతవిధానము, బాఘువిహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములవైఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ-ఏక వర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్ర కళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము. వెల. రు. ౧-౧-౦.

**మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.**

వ్యావహారికాంధ్రములో గ్రంథరచన సాగవలెనని కీ. శే. కవిశేఖర శ్రీ గురజాడ అప్పారావుగారితో కలిసి ఆంధ్రదేశములో ప్రచారముచేసి పండితులచేత తిట్లుతిన్న యువకులలో నే నొకడిని. వాదించడముతోటి సరిపోతే ఆనాటి పండితులు నన్నంతగా తిట్టిఉండరు. మావాదము నుదాహరించుటకు "విమర్శాదర్శ" అని పేరు పెట్టి పండితులు రచ్చకెక్కి వాదించేటప్పుడు ఉపయోగించే వ్యావహారికాంధ్రమున సాహిత్య సమీక్షణములు ప్రచురించితిని. గ్రంథము ముప్పైరెండు పేజీలదే. అయినా దాన్ని తిడుతూ "ఆంధ్రభాషా సంరక్షక సమాజమువారు" మూడు వాల్యూములు ప్రచురించిరి. అప్పటిలో నామిత్రులు ఉమ్రే ఆలీషా కవిగారు నన్నా వాల్యూములను గురించి అభిప్రాయమడిగితే "నేను చేసిన రచన గ్రాంథికాంధ్ర సూత్రములకు విరుద్ధముగా ఉన్నదని వారు చేసిన ఖండన కన్న పిచ్చిపని నాకు కనబడదు" అంటిని. ఆనాటి వాదప్రతివాదములలో డిఫెన్సు ఆఫ్ లిటరరీ తెలుగు ("Defence of Literary Telugu") అని ఒకరచన బ్ర. శ్రీ. జయంతి రామయ్యపంతులుగారు ప్రకటించి యుండిరి. అప్పటి మా వాద ప్రతివాదము లెట్లు సాగినా ఈ ౧౯౩౬సంవత్సరారంభములో చూచుకుంటే వ్యావహారికాంధ్రవాదమే నెగ్గినట్లు ఆంధ్రదేశమంతటా పత్రికలమూలమున విజయభేరీ వినబడుచున్నది. ఆనాటి పండితు లిప్పటికీ మిగిలియున్న వారి కిది యంతయు ప్రళయాగమమువలె తోచును. బ్ర. శ్రీ. జయంతి రామయ్యపంతులుగారికిన్నీ అట్లే తోచినట్లు ఈమధ్య వారు ఆంధ్ర విశ్వకళా పరిషత్తు (Andhra University) పక్షమున రాజమండ్రీలో చెప్పిన ప్రసంగముల రిపోర్టులవల్ల తోచుచున్నది. వ్యావహారికాంధ్రముపట్ల వారు "డిఫెన్సు ఆఫ్ లిటరరీ తెలుగు" ("Defence of Literary Telugu") అన్న గ్రంథములో చేసిన విమర్శలే తిరిగీ చెప్పట చూడగా వారు బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి "అనుశాసనము" లోని ప్రయోగము లయినా సర్వాంధ్రజనీనము లని అంగీకరించునట్లు తోచదు. ఆంధ్రలక్షణకర్తలగు కూచిమంచి తిమ్మకవి, అడిదముసూరకవి, చట్రాతి లక్ష్మీనరసుకవి వంటివారే బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, పూర్వకవికృతము లగు కావ్యములనుండి "సర్వలక్షణ సారసంగ్రహము", "కవిసంశయవిచ్ఛేదము", "విశేషాంధ్రము" వంటి గ్రంథములం దంతకు ముందటి లాక్షణికు లుదాహరింపని ప్రయోగములు సూత్రీకరింపబడినట్లే మననాటి ఈ

"అనుశాసనము" నందును క్రొత్తప్రయోగము లుదాహరింపబడినవి. చిన్నయసూరిగా రుదాహరింపని ప్రయోగములు ప్రౌఢవ్యాకరణములో గైకొనలేదా? ఆంధ్రలక్షణగ్రంథ రచనా సంప్రదాయముప్రకారమే అంగీకరింపబడిన ప్రయోగములనైనను వ్యావహారికము లని సాకుచెప్పి అంగీకరింపమని భీష్మించుటకన్న గ్రాంథికాంధ్రమునకు బ్ర. శ్రీ. రామయ్యపంతులవంటి వారు చేయఁగల యపకార ముండదు. "అనుశాసనము" లోని క్రొత్త ప్రయోగములవంటివి పూర్వ కవి ప్రయోగము లెన్నో మ. రా. శ్రీ. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు ప్రచురించిన వ్యాసావళులలోను, "బాలకవిశరణ్యము" లోను ఉదాహరింపబడినవి. వచ్చే "ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక సభ" లో శ్రీ రామయ్యపంతులుగారు "అనుశాసనము"ను, "గిడుగువారి గ్రంథము"లను కలిపి పరిశీలింపించి గ్రాంథికాంధ్రప్రయోగ విపులీకరణమునుగురించి నేటి రచయితలకు ఆచరణయోగ్యమగు తీర్మానమును చేయించినయెడల గ్రాంథిక వ్యావహారికాంధ్రములను గూర్చిన వ్యవస్థను తమ తరములో సమన్వయించినవారై ఉండీ ఉడుగుచున్న ఆంధ్రసాహిత్య పరిషత్తును పునరుద్ధరించినవా రగుదురు! నాడు సరియైన వ్యావహారికాంధ్ర విజయము గాని నేటి పరిస్థితులలో గాదు. నే డాంధ్ర గ్రాంథికమునకు యువాంధ్రరచయితలు జ్వాలాతోరణమే కట్టి విప్లవరంగమునే జ్ఞాపకము చేయుచున్నారు.

## వినిమయము

కొంపెల్ల జనార్దనరావు

యోజనము కొల్చు దూరాల నుబికి త్వన్ము
ఖైకలక్ష్యమ్ము నెత్తురు లడఁచి చూతు:
ఉత్థశోకము మృతికి వట్టోడి పేరు
బరువు రెప్పల బ్రదుకు బోఁటొగ్గి లేపి.

* * *

కట్టినది అగ్ర మొకటి : లక్ష్యశిథిలీకృ
తప్రవృత్తిక మది ప్రీలి, తరుము వలిత
చైత్ర వేదన నాలంచు చఱవ, మునిఁగి
బ్రదుకు పట్టు నాతలఁ గోర్కి కుదురుకట్టి.

# కృత్యాద్యవస్థ

వేమూరి విశ్వనాథశర్మ

నాకు తెలుఁగుభాషయం దభిరుచి యుండుటఁ జూచి నాస్నేహితులు కొందరు కవిత్వము చెప్ప మని వేధింపసాగిరి. కాని నేను వారివలలోఁబడక తప్పించుకొని చాల కాలము తిరుగుచుంటిని. ఏలయన పద్యము లల్లుట యన నాకు పెద్దపులినిఁ జూచినంత భయము. భావములు కొద్ది. భాషాజ్ఞానము స్వల్పము. ఇట్టి సహజలోపములకు తోడుగ ఛందోబద్ధ మారంభించినయెడల భావము లెగిరిపోవునను భీతాహము. కాని కొంతకాలము గడిపినతరువాత. నా స్నేహితులు పన్నిన వలలో పడవలసివచ్చినది. అదియెట్లు తటస్థించినదో చెప్పెదను వినండి.

నాస్నేహితులలో చాలమంది కవులు. నాసహాధ్యాయులు పెక్కండ్రు గ్రంథకర్తలు. మీఁదుమిక్కిలి నాశిష్యు లనేకులు తెలుఁగులో పద్యములు చెప్ప నారంభించుటచేత నాస్నేహితులు నన్ను హేళన చేయుటకు మొదలుపెట్టిరి. ఇంతియ కాక యిటీవల తెలుగువారిలో పద్యములల్లుట వేలము వెఱ్ఱిగ పరిణమించినది. ప్రతిస్వల్పవిషయమునకు పద్యములు పరిపాటియైనవి. పుట్టినప్పుడు పద్యాలు; పుట్టినపండుగకు పద్యాలు; పెండ్లికి పద్యాలు; చావుకు పద్యాలు; దండనాధికారి యెదుట పద్యాలు; కారాగృహ ప్రవేశమప్పుడు పద్యాలు; ఖైదువిముదలకు పద్యాలు; స్వాగతానికి పద్యాలు; ఆసీమాంతానికి పద్యాలు. పద్యాలపిచ్చి యెంతవర కెక్కినదంటే, ఉద్యోగమున కర్జీలోఁ పద్యాలు; రాజీనామా పత్రములో పద్యాలు. ఇంతమంది ఇన్ని విషయములను గూర్చి పద్యములు వ్రాయుచున్నప్పుడు నేనెందుకు వ్రాయలేకపోవలెనని రోషము జనించి యేదేని పద్యప్రబంధమును వ్రాయ నిశ్చయించితిని. కాని ఛందశ్శాస్త్రము చదువలేదు. అందుచేత కొంతవరకు తటపటాయించి భావకవిత్వము చెప్పుదునా యని నాలో నేను వితర్కించుకొంటిని. కాని భావకవిత్వముచెప్పి శాస్త్రీయ కవులతో వాదప్రతివాదములకు దిగి 'కవి' బిరుదమును స్థాపించగలనను ధైర్యము లేకపోయినది. అందుచేత నేదో యొక రీతిని పూర్వపద్ధతినే పద్యములు వ్రాసి గ్రంథము పూర్తిచేయుటకు దృఢనిశ్చయుఁడ నైతిని. అయితే విషయము తోచలేదు. ఇతివృత్త మేదియైనను గ్రంథాదిని కృతికర్త వంశవర్ణన ముందును గాన నన్ను గురించియే మొదటి పద్యము వ్రాయుటకు నిశ్చయించి తిక్కన భారతములోని "శ్రీయన గౌరినాఁబరఁగు" అను ప్రారంభపద్యమును వ్రాసి యెదుట నుంచుకొని అదే వృత్తములో నీ క్రింది పద్య

మును అర్ధరాత్రి యగునప్పటికి ముగించితిని. మరునా డాపద్యమును నా స్నేహితులకు చదివి వినుపింపఁగా వారు నా పద్యములో పదగుంభనము గాని, భావగాంభీర్యము గాని లేదని యాక్షేపించి నాకవిత్వప్రయత్నమును నిరసించుట కారంభించిరి. కాని నేను వారి యభిప్రాయము నంగీకరించుట కుద్యుక్తుఁడను కాలేదు. ప్రాచీనకవుల పోకడలు నాపద్యమునం దున్నవని నావాదము. ఛందోభంగము లేక పోయినను పద్యములో సారములేదని వారి యాక్షేపణము. ఎంతసేపు వాదప్రతివాదములు జరిగినను మాతగవు తెగలేదు. అంతట సామాన్యముగ కవులలో చూడనగు పరస్పర ద్వేషభావమే వారిలోను జనించి యుండునని గ్రహించి నాపద్యమును "భారతి" పాఠకులలోఁ బడవైచినయెడల నాకు న్యాయము కలుగునని నమ్మి మీకువిన్నవించుటకు నిశ్చయించితిని. నాపద్య మిదిగో:

"పుట్టితి స్తనకర్తమున
 పూజ్యుఁడనైతిని పూరాణవిద్యచే
పుట్టితి శ్రోత్రియోత్తములు
 పూర్వ మొనర్చిన పాపకర్మచే
పుట్టితి పూరుషాధముఁడ
 పుణ్యవిదూరుఁడ జ్ఞాన శూన్యుఁడన్
పుట్టితిగాన నాపయిని
 పూర్ణకటాక్షముఁ జూపుమీశ్వరా!"

ఈపద్యనిర్మాణమునందు చూపిన చాకచక్యమునుగూర్చి నేనే ప్రస్తావించుట స్వోత్కర్షమైనను కొంతవరకు నా వ్యాఖ్యానమవసరమని మనవిచేయుచున్నాను. ఏలయన, నేను వ్రాసిన పద్యములోని భావము నాకు స్పష్టమైనట్లు ఇతరుల కెట్లు స్ఫుటము కాఁగలదు? నా పద్యమునందలి రచనా చమత్కారము చదువరులకు వెంటనే గోచరము కాకపోవచ్చును. స్నేహితులు నాకవిత్వమును చులకనగా చూచుటచేత నావాదమును నేనే నిలవఁబెట్టుకొనుట కర్తవ్య మని యీ వ్యాఖ్యను వ్రాయుచున్నాను గాని పాఠకుల యొక్క గ్రాహ్యతాశక్తి తక్కువను దురుద్దేశముతో కాదని మనవిచేయుచున్నాను. ఈయుపోద్ఘాతముతో పద్యవ్యాఖ్యానమును ప్రారంభించెదను.

మొదటిపాయింటు : పద లాలిత్యము

ఒకటి రెండు తప్ప తక్కిన పదములన్నియు సులభమైనవి; సామాన్యముగ వాడుకలో నున్నవి. సరళమైనవి గాని కటువైనపదములు లేవు. "స్తనకర్తము" ను గూర్చి యొకటి రెండుమాటలు వ్రాయవలసి యున్నది. నాజన్మస్థానము 'జువ్విగుంట.' దీనికి సంస్కృతము 'స్తనకర్తము.' దేశీయ పదములను సంస్కృతము జేసి ప్రయోగించుట కవిసంప్రదాయము. 'పులికొండ'కు 'వ్యాఘ్రగిరి' 'చీమకుర్తి'కి 'పిపీలికాకర్తము' మొదలగు ప్రయోగములు కొందరు పూర్వకవులు వాడిరి. "ముదిగండి" అను చిన్నవాగు సమీపమున నున్న లింగంగుంట గ్రామవాసి యగు లింగంగుంట తిమ్మ

కవి తన సులక్షణసారములో "వృద్ధ కుండీ తీర" అని పొగడియున్నాఁడు. కావున "ప్లక్ష గర్త" మను ప్రయోగము సంప్రదాయ సిద్ధమగుటయే కాక పూర్వకవులపోకడలతో నాపరిచయమును చాటించుచున్న దని విన్న వించుచున్నాను.

రెండవపాయింటు :

ఛందశ్శాస్త్రజ్ఞానము లేకపోవుటచేత విరామస్థానములయందు ఒకటే పదమును వాడినానని నాస్నేహితులు పరిహాసించిరి. ఇది సత్యమని నే నంగీకరించితిని. కాని యతి ప్రాసలజ్ఞానము లేనంతమాత్రమున పద్యము చెడిపోయినదా ? ఏకాక్షరమైత్రి, ఏకాక్షర ప్రాసలవలన పద్యమునకు మెరుగు రాలేదా యని ప్రాజ్ఞుల నడుగుచున్నాను. యమకము సొంపుగాదా ?

మూడవపాయింటు :

నా స్నేహితులకు తోఁచని కొన్ని విశేషములు నాపద్యమునందుఁ గలవని మనవి చేయఁదలంచినాను. మొదటి చరణములోని "పూజ్యుఁడనైతిని" అను వాక్యము గౌరవార్థముగాని, నూన్యార్థముగాని కావచ్చును. కాని పద్యధోరణినిబట్టి పాఠకమహాశయులు రెండవయర్థమునే గ్రహింతురుగాక ! పద్యశేషమునందలి మూఁడు చరణములును నా యర్థమునే రూఢిచేయఁగలవు.

నాల్గవపాయింటు :

నే నద్వైతినగుటచే 'ఈశ్వరా' యని పద్యమును ముగించితిని. శైవులకు వినుపించునప్పుడు 'శంకరా' యనియు, వైష్ణవుల యెదుట చదువునప్పుడు 'మాధవా' యనియు మార్చుటకు వీలున్నది.

ఐదవపాయింటు :

నాస్నేహితులకు తట్టని విషయమొకటి చెప్పెదను. నాల్గవ చరణములోని "గాన" అనుపదము వ్యర్థ మని - నా నిశ్చయము. అక్కడ కారణార్థపదమునకు బలము లేదు. కాఁబట్టి పైపద్యములో 'కాన' అనునది 'పడికట్టురాయి' అని చదువరులు గ్రహింతురుగాక !

పట్టుదలకై బింకముతో వాదించితిని గాని సరసముగ పద్యములు వ్రాయుట కష్టమే. అందుచేత పైపద్యమును ఛందోభంగములేకుండ నెట్లనో వెళ్లనీడ్చి కవిత్వ ప్రయత్నమును కట్టిపెట్టి కృత్యాదితో నా చెప్పఁదలఁచిన ప్రబంధమునకు స్వస్తిచెప్పితిని.

# చెరువు

అడివి బాపిరాజు

చక్కనిచిన్నది
చుక్కలరాణట!
పాటను వింటూ
పడతి నిలిచినది
చక్కని...

తెల్లనిచీరా,
వెల్లనిరైకా,
మెళ్లోహారం,
తల్లోపూవులు,
చక్కని...

బిందె బుజానా
సందె నీటికై,
చెల్లోకలవలు
నల్లనికన్నులు
చక్కని...

కంఠమెత్తితే
కలచుపాటలవి,
పాటలవింటూ
పడతి నిలిచినది
చక్కని...

చెరువుమెట్లపై
చెలియ నిలిచినది,
బంగరునీటిలో
ప్రతిఫలించినది
చక్కని...

సందెవెలుగులో
చక్షులు కలిసెను,
ఎఱ్ఱని పడమట
ఇంతివెనకనే
చక్కని...

పాటేభామై,
భామే పాటై,
పాటభామలూ
పడమటిరంగై,
బంగరునీరై
పొంగెడు ప్రేమై,
చెరువుమెట్లపై
చిత్రాలయ్యెరి!
చక్కనిచిన్నది
చుక్కలరాణట.

## చతుర్థాంకము

(విష్కంభము)

కన్యాకుమారికిఁ బోవుదారి.

మోటారులో నారాయణభట్టు, భార్యయు నుందురు. అన్నంభట్టు పశ్చాత్తాపముతో మోటారు వానితో నెదురు చూచుచుండును.

పాట

(కాంభోజి - అటతాళము)

అన్నంభట్టు—

1 ఎన్నెన్నో మాటాడి యెందఱినో నేఁడి
యీ పట్టలోఁ బడితి.

2 వన్నె వాసియు లేక, వరహీన మూపోకఁ
గన్నతికముకన్నఁ గడుహీన మేమున్న.

3 తార్చి మనోరమ, మార్చి స్వమతము
పేర్చి పాపసమితి, వాల్చితి జ్ఞానాగ్ని.

4 హరిహర కీర్తన్, మరయక లోకత
పరుడనై నీచత్వ, పకతదాసత్వ...

5 కాసుమాత్రకుఁ దార్చి, కను కష్టముఁ గోర్చి
తల నన్నిటిని దూర్చి, కులము పోకార్చి.

6 ధర్మశాస్త్రము వీడి, మర్మశాస్త్రముఁ బాడి
కర్మమార్గము వీడి, దుర్మార్గులను గూడి. ఎన్నెన్నో.

హా శ్రీహరీ! పుట్టిననాటినుండియు నేకొలంతయు నెఱుంగక మహారాజకుమారునితోఁ దిరిగి పెద్దవాఁడనై యాతనిచెలికాండ్రందఱిలో నాతనికిఁ గడుఁ గూర్చువాఁడనైతి. నామనోదౌర్బల్యమునఁగదా! దిద్దువాఁడు లేక దూరదేశముల హద్దుమీఱి సంచరించి మహారాజు పంపు ద్రవ్యమునుఁగూడ నా స్వవ్యసనవ్యయములకుఁ గాలక్షేపములకుఁ దుర్వినియోగపఱిచి "భ్రష్టస్య కా నామ గతి" యన్నరీతి, చెడి, పడి, చావు తప్పి కన్ను లొట్టపోయి, యీ పట్టులోఁ బ్రదికి బైటఁబడితిని. అతని బలమునఁగదా! విదేశములందుసయితము సకలసంస్థల, సంఘముల, సంస్థానముల మెలఁగఁగలిగితిని. మొన్న నిరంజనకుమారునితో సమావేశమయి సంభాషించుటవలన నేమఁ గరిపెట్టినచ్చినమార్గములే మార్గము లనియు, నేఁ జదివినవియే గొప్పగ్రంథము లనియు, భరతఖండమున బుద్ధిమంతు లవలంబింపవలసిన సిద్ధాంతములుగాని, చదువఁదగిన గ్రంథములుగాని లేవనియు, దృఢముగ నమ్మియుంటిని. ఇప్పటికి వచ్చిననాఁటనుండియు నిరంజనకుమారుఁడు తానుసద్గురువులవలన నెఱిఁగి యవలంబించుచున్న మార్గములు, బోధములజాడలు తెలిసిన కొలఁదియు నాయభిప్రాయములు మాఱుచున్నవి.

బుద్ధిమతీదేవి నిజముగ దేవత గాని మానవస్త్రీ గాదు. ఆ వినయము—ఆ ప్రీతి—ఆ మార్దవము—ఆ సౌందర్య—ఆ భక్తి — ఆ యాలుమగలయానుకూల్యము — లోకమునం దెచ్చటను గానరాదు. అట్టి మహాపతివ్రత లుందు రని పాశ్చాత్యదేశవాసు లూహింపనైన నేరరుకదా! నిరంజనకుమారుని నామె ఛాయవలె ననుసరించును. చనవున నుజ్జగించి పతి తన్నడిగినపుడు క్రొత్తపెండ్లికూఁతురు కోరఁదగిన దెన్నని యుండు మీసేవకంటె నేఁ గోరఁదగిన దేది? నన్నడిగితిరి గానఁ జెప్పెదను. మీతోఁ గూడఁ దీర్థయాత్రకుఁ బోవలయు నని యున్న దని తనకోరిక వెల్లడించిన దాయిల్లాలు!!! నిరంజనుఁడును వెంటనే మంత్రి సుదర్శనుని రావించి, మేము తీర్థయాత్రకు బయలుదేరఁదలఁచితిమి. ఈయన్నంభట్టును బూర్తిగ మాఱినాఁడు. ఈయాత్ర పరిపూర్తి కాఁగానే యాతఁడు మీస్థానము నలంకరించి మీకుఁ దపస్సు చేసికొనుటకుఁ దగు విశ్రాంతి నొసంగును. మీఋణము నేఁ దీర్పఁజాలను అని చెప్పి నిర్వ్యాజకరుణతో నన్ను మంత్రినిఁ జేసెను. మొదటఁ గన్యాకుమారి కేఁగి యచటనుండి క్రమముగాఁ దక్షిణ తీర్థముల కేగుట కేర్పాటు చేసి రాజదంపతులును, దామోదరులును

వాయువిమానముపై నరిగిరి. ఐరోపాప్రవాసమునందు నాకై దిగులొంది శోషించిన మజ్జననీజనకులతో నన్ను మోటారుపై రమ్మనిరి. ఈపటికిఁగాని వారిని నేఁ గలయఁజాలను. ఆరాజదంపతు లీసరికి సముద్రతీరంబునఁ బ్రశాంతముగ బ్రహ్మానుసంధానముఁ జేయుచుందురు.

(ప్రవేశము నారాయణభట్టు.)

నారా—నాయనా! నాయనా! మమ్మనాథులనుఁ జేసి యీనట్టడివిని డించిమరల నేనిమ్మకైనఁ బోవ నాలోచించుట లేదుగదా! బుద్ధిమంతుఁడ వయ్యెదవను కొనుచున్న నాయాశాలతలఁ ద్రెంపివైచితివి తండ్రీ!

అన్నంభ—వచ్చితి. వచ్చితి. ఏ మిట్లు చివాలున లేచి వచ్చితిరి? అమ్మ యింకను నిద్రఁ బోవుచున్నదా! మోటారుచపుడుకొఱకు వెళ్లినవాఁ డింకను రాలేదు. ఇప్పుడే యొకపావుగంటలో బయలుదేఱినను. అమ్మను సుఖముగ నిద్ర పోనిండు.

నారా—నిద్రా! పాడా! శోషయేమో! దబ్బఁదిన్న ప్రాణములు కావా నాయనా! నేను గనులు దెఱచి చూచుసరికి నీవు కనఁబడలేదు. నాగుండె పగిలి పోయినది. మహారాజు చిరంజీవి నీకు నిజమైన మిత్రుఁడై, మాపాలిటి దేవుఁడై, నిన్నుఁ దిరిగి మాకంటి కగపఱచి, మాకుఁ బుత్రభిక్ష పెట్టినాఁడు. ఈక త్తెరజుట్టు, ఈ తుమ్మెదమీసలుఁ, చుట్టలుఁ, లాగు, టోపీ, ఈమాలవేషమంతయుఁ గన్యాకుమారికిఁ బోయిన వెంటనే వదలి స్వచ్ఛమైన బ్రాహ్మణుఁడ వయ్యెద నని యాశపెట్టినది నిజమేకదా! బాబూ!

అన్నంభ—(స్వగతము) విదేశముల సకలశౌల్యములలోఁబడి నేనుఁ దిరిగి దేశము వచ్చుటకు నిక్కముగా రాజకుమారుఁడే కారణము. అతఁడు పట్టు పట్టకున్న నాగతి యేమైయుండెడిదో! (ప్రకాశముగ) నాయన గారూ! మీ కింకఁ జింతవలదు. మీసేవ నేమఱను. మీ కోరికలంతయుఁ గలిగింపను. బండి సిద్ధముగ నున్నది. రాజకుమారుఁడీసరికి కన్యాకుమారి చేరి మనకై యెదురు చూచుచుండును. (నారాయణభట్టు నిష్క్రమించును.)

ఉ. నాటికి నేటికిన్ బరభునాస్తిక
బుద్ధి యొకింత నూటిగా
నాటె హృదంతరాళమున
నాగతి యింకటు తెల్లవార్చెదో
కైటభవైరి! జీవులకుఁ
గారణభూతుఁడ వీవ యయ్యయ్యొ నా
బోఁటుల నేల? యిర్వ్యధిని
మూఢులఁ జేసి రమింతు వింతగన్.

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును)

## ప్రథమ రంగము

(సోమశిలాక్షేత్రము, పినాకినీతీరము)

(ఇసుకతిన్నెపైని జలువతాలిపైఁ గూర్చుండిన శారద ప్రవేశము.)

(తెరలో)

(హరహర మహాదేవ! శంభో శంకర! నమః పార్వతీపతయే హరహర మహాదేవ!)

శారద—తెరదేయూరు తిరిగి యాలయము చేరినట్లున్నది. జనులు కరతాళధ్వనులు చేయుచున్నారు. ఒక్కొక్క రొక్కొక్కరీతిగ సంతోషపడుచు నీయుత్సవమున నానందపారవశ్యమును జెంది యున్నారు. విచారించిచూడఁ బండితుల పాండిత్యమునందుకంటెఁ బామరుల భక్తిలోనే యెక్కువ చిత్తశాంతి యున్నట్లున్నది. ఊరూర జను లంపటి యుత్సవములతోఁ దెల్లవాఱినది. నాకుమాత్రము జాగరణముతోఁ దెల్లవాఱినది. అదిగో! కోడి కూయుచున్నది.

క. సోమశిలాక్షేత్రంబును
సోమేశ్వరుసర్వసంబు శోభనగంగాం
భోమజ్జన మేకాంతము
నేమంబు నొసంగ వౌర నెమ్మది మదికిన్.

శాస్త్రవిజ్ఞానము, నాయాసర్వశతముల కవితాధార, ఉత్కృష్టగ్రంథఁబులు, నన్ను మెచ్చుకొని యుత్సాహకపూలాడి లాలించు శిష్యులు, నాయందుఁ బెద్దతిక

ముంది నాకు శిష్యులమని, శిష్యురాండ్రమని చెప్పికొని గౌరవమునొందు ననుచరవర్గముఁ, బత్రికలలో నన్ను గురించి వ్రాయఁబడు ప్రశంసలు, నాదేశాటనము మొదలగువానియం దొక్కండేని నాకు నానందమును, శాంతియు నొసంగ సమర్థంబులు కావయ్యె.

అనిర్వాచ్యమై యొద్దానము దీఁని యీసందేహ దవానలంబు శేఖరుఁడు తన బోధామృతవర్షంబునఁ జల్లారఁజేయునోకదా:

క. వ్యాసముల వ్రాసితిని, బలు
బాసల నేర్చితిని, శాంతిభామ్యంబుల కేఁ
జేసితి, డాసితిఁ బ్రముఖుల,
హీసము మునమొనవ దీప్రవృత్తుల నెందున్.

పరమేశ్వరీ! నీయనుగ్రహము లేనివారి నందఱను వాగ్వ్యాసచతురులైన చదువరులుగఁ జేయుదువు. నీవయుఁ బాత్రులగు సాధువులఁ బూజాసక్తుల నొనరింతువఁట. నీయంతరంగ మెఱింగి తెలుపఁగల మహనీయుల దర్శనము నాకెన్నండు కలుగునో! అట్టివారి కటాక్షము బహుజన్మలబ్ధ పుణ్యపరిపాకఫల మందురు. "అథవా విద్యయా విద్యా" అన్నట్లు నేను గొంద ఱాంగ్లవారీమణులకు నాంధ్రగీర్వాణంబులఁ బాఠములఁ జెప్పుచు జాతివారలగోష్ఠినిఁ దిలకించితిని. వాఙ్మయప్రచారమును గావించు సుప్రసిద్ధ పాశ్చాత్యస్త్రీలఁ బరికించితిని. కేవల సన్న్యాసదీక్ష గ్రహించిన క్రైస్తవశ్రమణులఁ జూచితిని. పురుషవిద్వేషిణులై స్వచ్ఛందస్త్రైణోద్యమముఁ బ్రచురము గావించు వారీమణులఁ గాంచితిని. వారివారి పట్టుదలలతోఁ బెనఁగులాడుటయేకాని నిస్సంశయమైన ప్రశాంతి యొక్కరిచిత్తమందును గానరాదు.

నేటి మహిళామణులు కొందఱు తమకు సమ్యగ్దర్శన మేర్పడమింజేసి చీఁకటింటఁ దడవికొన్నట్లు చేయు ప్రచారంబులు బహుభంగుల భంగపాటులకు మనస్తాపంబులకు నాకర మగుచున్నవి.

ఇంక గృహిణుల యాశాభయంబులు, శిశుపశు గృహచింతలును వర్ణనాతీతంబులగుట నాదారి నాకు నచ్చదయ్యె.

సులభ, మీరాబాయి, తరిగొండ వెంగమాంబ మొదలగువారిమార్గ మాధునిక కాలంబునఁ బ్రచారములో లేకుంట నయ్యది లోకసమ్మతంబై యుండదు. సత్యమైన దారినిఁ బోవుటకు లోకుల యంగీకారముతో నేమిపని? కాని లోకవాసన విహంగ మార్గమునఁ దరింపఁ దలఁచు భక్తులకుఁ బ్రబలమైన శత్రువు సుమా!

క. లోకము దైత్యానీకము
నాకింకఁ దలదుదాని నానుట, నఘముల్
సోఁకును, భవముల్ దాఁకును,
నీకృప లోచూపు నాకు నిలుపుము దేవీ!

లోకులు పలు పోకలఁబోవువారు. సాధువులుగ నుండుపురుషులనే బాధపెట్టుచుందురు. యోగినుల పాట్లు చెప్పవలయునా? హృదయగ్రంథి విప్పఁజాలని విద్యలు-వినోదములు విత్తసాధనములు - మనఃక్షోభకరములు.

ఆత్మవస్తువు తెలిసినయట్టు లయ్యె
నైక్యపరములౌ వేదాంతవాక్యములను
గురుకరుణ నొందకయె యొఁతకోవిదునకు
ననుభవార్థంబు కాఁజాల దంద్రు బుధులు.

ప్రాపంచికసుఖంబులు తాత్కాలికానందప్రదములయ్యు దుఃఖపరిణామము లగుట నఖండానందప్రదమగు స్వస్వరూపానుసంధానసిద్ధి నొసంగు సద్గురుమూర్తిని సేవించుట పరమధర్మము, తల్లీ! నీదయ. నాకట్టిసద్గురుసన్నిధిఁ బ్రసాదించి కటాక్షించినచో జీవింతును. లేదేని యిదే నీపాదములపైనాన నిరశనవ్రతంబు పూని నీసన్నిధిఁ జేరెద నిదినిక్కువంబు.

(ప్రవేశము జ్ఞానాంబ.)

జ్ఞానా—(ఎదుటచూచి) అదిగో! నాపాలిటి కల్పతరువు! (శారదను సమీపించి సాష్టాంగనమస్కారము గావించి)

తల్లీ! ఈదీనురాలిని గటాక్షించి పరతత్త్వము బోధించి తరింపఁజేయుము. దిక్కులేనిదానను. నీ దయయే నా కాధారము.

గీ. కపటవృత్తినివృత్తినిఁ గాంచి తొలఁగ,
నాస్తికకులం బ దాకలం బంది కుంద,
దుష్టవనితలదౌష్ట్యంబు తొట్రుపడఁగ
భక్తురాలిఁ జేసి తాపంబుఁ బాపు.

శారద—ఎవ రీసాధ్వీమణి ? నాకేల యీ పాపము గట్టెదవు ?

ఆ. తాఁ దరించికాదె దాటించు నొరులను
దారకంబుగొలకుఁ దాప ముందు
నావ ద్రొక్క నక్క! నీకేమి యిటుఁ జిక్కె?
ఘనుని నొకనిఁ గొలిచి కనుమ శాంతి.

అమ్మా! నీ వెవ్వరో నన్నుఁజూచి కృతార్థురాల వని భ్రమపడుచున్నావు కాఁబోలు. నేనే సద్గురులాభము నకై నిరీక్షించుచున్నాను.

ఆ. దైన్యవృత్తిలేని ధర్మజీవన మొండు
మరణభీతిలేని మార్గ మొండు
తరుణి యెట్లు గలుగు? హరిపదాబ్జధ్యాన
పరతఁ గనక భక్తి గురుని గనక.

జ్ఞానా—
క. అమ్మా! దయ నాపై రా
నిమ్మా నీ సుతనుజుమ్మ! యిహపర సౌఖ్యం
బిమ్మా! నా దాస్యము గై
కొమ్మా భక్తులను నేలుకొమ్మా! యమ్మా!

నీ వెవ్వరో యెఱుఁగఁ గోరితివిగదా!

గీ. నన్ను జ్ఞానాంబ యందురు కన్నతల్లి!
పిన్న నాటనుబోలె సంప్రీతి మెఱయ
శివునిఁ బూజించుచుందు నీక్షేత్రమందుఁ
గొనెల నిడుప్రసాదంబుఁ గోరికొందు.

గత రాత్రియందు స్వప్నమున సోమేశ్వరుఁడు సాక్షాత్కరించి, చెంత శారద యుండ నీకేమి కొదవ? అమ్మహానుభావ పినాకినీతీరంబున ధ్యాననిష్ఠయం దున్నది. నీవు వెంటనేపోయి యామె కాత్మార్పణం బొనర్చికొమ్మ. ధన్యురాల వయ్యెదవని యుత్తరువుఁజేసి యంతర్ధాన మయ్యెను. నీచరణమే శరణము. (అని పాదములపై వ్రాలి లేవకుండును.)

శా—(స్వగతము) ఓహో! ఏమి యీదైవ చిత్రము. జ్ఞానాంబ పరమభక్తురాలు నాకడ నబద్ధమేల యాడును? (ప్రకాశముగ) శివునాజ్ఞ నేనుమాత్రము దాఁటఁగలనా? నిన్ను నెయ్యంబునఁ జూచికొందును. ఈశ్వరానుగ్రహంబున నా కేమిలాభంబు గలుగు నదియే నీకును గలిగెడు లెమ్మ.

జ్ఞా—(లేచి) అమ్మా! శారద! నీకుఁ బరిచర్య చేసి తరించెద. నన్ననుగ్రహింపుము.

(ఆకాశముననుండి వినఁబడును.)

తల్లీ శారదాదేవి!

క. జననం బాదిగ నిర్వ్యాధి
జననీ! సర్వార్థసారసంగ్రహ మరయఁ
దని మునిజనములఁ గనఁ గొనఁ
జనుదెంచెదు నిన్నుఁబోలు సాధ్వులు గలరే?

శా—ఏమి! ఆకాశవాణియా! కాదు. ఎవరో యాకసముననుండి భాషించుచున్నారు. (పైకిఁజూచి) ఓహో యెంతచక్కని హంస! ఈవాక్యంబు లీహంస రాజు పలికియుండును. ఏసిద్ధుఁడో నాపైవాత్సల్యమున హితముఁ గఱపవచ్చి యుండనోపు!!

గీ. స్వాగతము హంసరాజ! మద్భాగధేయ
మునకు నిశ్రేణివై నీవు పొలిచితౌర!
దారిఁ జూపింపుమయ్య! నాతారకమున
కవనిమీఁదికి వచ్చి మాటాడవయ్య!

హంస—(ఆకాశముననుండి దిగివచ్చును.)

హంస—తల్లులారా!

ఉ. మీరు మహానుభావలర
మేయచరిత్రలు, భక్తురాండ్రొహో
ధారుణి మర్త్యలంచు నభి
ధానము మాత్రముగాక, సాటి యెం

ద్వారము తెర తెరవుముఁ
బండితపామరు లొక్కరీతిగాఁ
జేసి భజించుచుంట యది
చెప్పక చెప్పెద మీప్రభావముల్.

గీ. నిన్ను సేవింపఁగల్గుట నేఁడు నిజము
జన్మసాఫల్యమును గంటి శారదాంబ!
నన్నుఁ జూచుచు నాజాడ నడచిరంతు
ఉదయ మగుటకు మున్నె తత్పదముఁ జేర్తు.

శా—హంసరాజ!

గీ. భక్తవరుల కనన్యవిశ్వాస మగుట
నమ్మి మీవెంట వత్తు. జన్మమ్ము సఫల
మొందఁజేసెదు సద్గురునొద్దఁ జేర్చు
మార్తిలక్షణ మదికాదె యార్తరక్ష.

అంబా! జగజ్జననీ! నీకటాక్ష మెంతని వర్ణింతును.

శ్లో. పరాంబికాపాదసరోజసేవాం
నిరంతర సంతకృతిభిః ప్రపూర్ణామ్
కరోతు, మత్పూర్వసు కర్మ సర్వం
గురూత్తమాంఘ్రిద్వయరూపమాశు.

(అని శ్లోకమునుఁ బాడుచు హంసవెంబడి జ్ఞానాంబతో నేగును.)

తెరవ్రాలును.

## ద్వితీయరంగము

జయంతము.

(వాకిట శారదాంబయు, జ్ఞానాంబయు నిలువఁబడి యుందురు.)

శా—ఆహా! ఇయ్యాశ్రమారామమెంత ప్రశాంతముగ నున్నది. (వినుటనటించి) ఓహో! బాలకులు ధ్యానశ్లోకములు చెప్పునట్లున్నది.

(తెరలో - భూపాలరాగము)

శ్లో. శాంతాయ సాధువరవాయ పరాత్పరాయ,
గోపాంగవాహ్యదయ పంకజభాస్కరాయ,
యోగీంద్ర వేద్యనటనాయ భవప్రియాయ,
ధర్మాయ ధర్మనియమాయ నమోనమస్తే.

ఉ. ఇంద్రియగోచరాత్ములు బు
ధేంద్రులు వారలఁగాంచలేని వీ
రందఱు వేదశాస్త్రముల
నద్దముదిద్దము చేసి శంకలం
డింపము దుందుడుందఁ బలు
కేవలదాఁగిన బ్రహ్మతేజ మా
నంద మతీంద్రియం బది క
నంగలరన్న వృథాభిమానులా.

క. సకలము బ్రహ్మంబనితా
నకలంకస్థితిని గురుకటాక్షముకలిమిన్
త్రికరణముల సరి గొల్చినఁ
బ్రకటించున్ దత్త్వ మంబ పరమప్రీతిన్.

శా—(పద్యములను విని వెనుకకుఁ దిరిగి చూచునరికి హంసయదృశ్యుఁ డగును) హంసరాజేఁడీ! అదృశ్యుఁడయ్యెను. ఏమి యీచిత్రము! నాకిక్కడ దారిఁజూపువా రెవ్వరు? సూర్యభగవానులే నాకు దిక్కు!

క. వేవిధములఁ బలమారెదు
జీవులతమముల్ హరించి సిద్ధులఁ జేయం
గావలయు వేయికరముల
తో వచ్చెదు నిత్య మీవు తోయజమిత్రా!

(ప్రవేశము : బాలకుఁడు)

వటుఁడు—(వచ్చి నమస్కరించి) అమ్మా! శారదాదేవి! మిమ్ము లోనికిఁ దోడ్కొనిరమ్మని నాకు శ్రీపరమహంసమునీంద్రు లాజ్ఞాపించినారు.

శా—అమ్మహనీయునిదర్శనమే మాకభిలషణీయము. (స్వగతము) హంసరాజానుడివిన దేశికోత్తముఁ డీతఁడే. సందియము లేదు. నేటికి నాతపము ఫలించినది. (అని వటునితో నిష్క్రమించును)

(గోష్ఠీమందిరము)

(పరమహంస వ్యాఘ్రాసనమున నాసీనుఁడై యుండును.)

పరమ—ఆనందః ఆనందః ఆనందో బ్రహ్మ బ్రహ్మానందః.

రాజ—(పట్టుబట్టల ధరించి పుష్పములు చేతఁబూని వచ్చును:)

మాలిని—

మన మని గురుమూర్తిన్ మాధవాత్మైకభక్తిన్
ఘనతరజపశక్తిన్, జ్ఞానయోగప్రసక్తిన్,
గనియుఁ గద విరక్తిన్, గర్మసంసారముక్తిన్
మను వికనెటులున్నన్ బావనం బెందుఁగన్నన్.

(అని పరమహంసకు నమస్కరించును.)

పర—రాజశేఖరా! ఈశారదాగమనము మనకెంతయు నానందసంధాయకము.

(ప్రవేశము ధర్మాంబ, ఆమెవెంట శారద, జ్ఞానాంబ ప్రవేశింతురు.)

(పరమహంసకు నందఱు నమస్కరింతురు. పరమహంసయందఱను దీవించును.)

ప—(రాజశేఖరునితో) నిన్న నీతోఁ బ్రశంసించిన దీవనితామణినిఁ గుఱించియే సుమా!

శా. బాలత్వం బని యౌవనం బనియుఁ జె
ప్పన్ రాక శ్రీవిష్ణునే
బాలోలత్వము పుట్టినోడఁ గలిగెన్
బ్రాహ్మీప్రసాదంబునన్
బాలోన్మత్తపిశాచవర్తనమునన్
బ్రహ్మాత్మబుద్ధిప్రథన్
భూలోకోద్ధరణైకసత్క్రియకునై
పూర్ణాత్మకల్యాణమూ
లీలామానుషవిగ్రహంబు నిటు దా
ల్చెన్ జూడుమా! యోగినిన్.

రా—స్వామీ! ఈశారదజన్మము కలికల్మషహరంబు.

ఉ. ఇమ్మహనీయురాలి కనరే
జగమందున కాంకలెందు? లో
కమ్ము తృణమ్మొనర్చి యిటు
కాననసీమల జ్ఞానలబ్ధికై
ముమ్మరమైన యార్తిఁ బడి
పుణ్యఫలమ్ము భవత్పదమ్ము జ
న్మమ్ముఁ దరింపఁబట్టె ముని
మాన్య పవిత్రపదంబుఁ జేకొనన్.

శా—(స్వగతము)

క. భగవద్భక్తులవలె నీ
వుగదా దర్శనము నిత్తువో పరమేశా!
జగమున భేదం బెంచక
యగపడకుండంగఁ జేయుమా యిరువురకున్.

(పరమహంసను సమీపించి యంజలిఘటించి) (ప్రకాశము)

ద్విపద — భూపాలరాగమునఁ బాటగఁ బాడవచ్చును.

యోగీశ్వరా భూసురోత్తమ ధీర!
ఆగమేతరదూర ఆనందసార!
శ్రీగురుస్వామి! యాశ్రితభక్తకామి!
జేగీయమాన! ప్రశిష్యసంతాన!
విశ్వసన్మాన్య! సద్విబుధాగ్రగణ్య!
ఐశ్వర్యధన్య! వేదాంతిమూర్ధన్య!
నిరుపాధికుండవై నిర్విచారముగఁ
బరమార్థదృష్టి భావనము తీవ్రగతిఁ
జేయుచుండెడినీకు జేమోడ్చుచును
న్యాయంబుగా జీవయాత్ర నడిపెదము.

(అని పువ్వులు మునిపాదములపైఁజల్లి నమస్కరించును.)

మ. పరులన్ వేఁచుటకన్న వేఱుకలదా
పాపంబు? సద్భక్తులన్
హరినిన్ బాడుటకన్న నొండు కలదా
యానందముద్యోగముల్?
గురుమూర్తిన్ భజియింపుచున్, బుధులతో
గోష్ఠీవినోదంబులన్

దరియింపంగల పుణ్యపూరుషుల చెం
తఁ దాసినిఁ ధన్యనున్.

స్వామీ! సర్వజ్ఞులు, సర్వశక్తిమంతులు నగు మీరే నాయంతరంగ మెఱింగి మీసన్నిధికి రప్పించుకొంటిరి. సర్వమునకు మీరే కర్తలు. నేఁడు మీదర్శనము లభింపకున్నచో నేనేమయియుండెడుదాననో కదా. నామదికి జీవితము భరింపరాని దైనది

ప—తల్లీ! దిగులొందకుము. శ్రీహరి నిన్నుఁ బరిపూర్ణముగ ననుగ్రహించినాఁడు. అంత దుర్భరమైనవేదన కలుగుటయే తద్బాధాపరిహారమునకు దృఢమైన సూచన.

మ. ఘోరస్వప్నము గాంచి జీవుఁడటు మే
ల్కాంచినట్లు లక్షించుతా
ఘోరాఘంబుల సర్పసర్పిముది సం
కోచంబులఁ జీవ స
ద్వైరాగ్యంబున బ్రహ్మ మట్లు దయదై
స్వస్వామిసద్యోగ వి
ద్యారామత్వము తత్త్వమై తనర నా
త్మార్థంబు వరిలెడున్.

స్వప్నమున యథార్థముగ ననుభవించుచున్నట్లున్నను జాగ్రదవస్థనుఁబట్టి కలకలగా గ్రహించినట్లు, పరమార్థదృష్టిఁ గాంచిన, నీప్రపంచమునందలి యనుభవములును కలగాఁ దోఁచును. జగమంతయు మిథ్యకదా! యంతగురుండును గురుబోధంబు మాత్రము మిథ్యకాదా! యందురు, జగముతోఁబాటు గురుఁడుకూడ మిథ్య యయ్యెఁ దద్బోధము మాత్రము ప్రబోధంబొసంగఁ జాలియుండు నదియెట్లన్నఁ, గుమారుఁడు బావిలోఁబడినట్లు కలఁగాంచి భయమొందుచున్నవానికి, బావియుఁ గుమారుఁడుంబడుటయుఁ బడినపుడు కలిగినశబ్దమును, కల్లయైనను, శబ్దముమాత్రము మెలకువను గలిగించి, కలఁతఁబాపఁ జాలి యుండును.

గురుబోధము శ్రవణమాత్రంబున జగజ్జీవేశ్వరభ్రాంతిని దొలఁగించి పరమానంద మొసంగును. కావున శ్రద్ధాభక్తులతోఁ దత్త్వమునెఱింగి కృతార్థురాల వగుము.

ఉ. ఎట్టి మనోవికార ముద
యించిన నయ్యది జీవసంజ్ఞగా
నెట్టుము సద్గురూక్తవిధి
నేర్పున శౌరిపదద్వయంబునే
పట్టుము భక్తకోటికిఁ బ్ర
పత్తి నొసర్చుము మోక్షమద్ది నీ
పట్టగు వేదవాదితము
భవ్యపథం బిది శారదామణీ.

స్వస్వరూపసాక్షాత్కారదీక్ష నిపుడే పొందఁగలవు. నిన్ననుసరించివచ్చిన జ్ఞానాంబయుఁ గృతార్థురాలు కాఁగలదు. ధర్మాంబా! నీపుత్రుఁడు లోకప విశ్రుతుఁడయ్యెను. పుత్రికాలాభసంతోష మీశారదాంబ నీకొసంగఁగలదు.

ఉ. నూఁతురటంచు లోకముల
నుక్కఁ దలమానికమంచు విద్యలన్
ఖ్యాతివహించెనంచుఁ బర
మార్థపు సారమటంచు మాతగాఁ
బ్రీతిని సాకుచుండఁగల
పెద్దఱికం బొనఁగూర్చు నీకటం
చాతత వైభవోన్నతుల
నక్కునఁ జేర్చి ముకుందగీతికా
వ్రాతము పాడి వించి భవ
వార్ధిఁ దరింపుము బాలతో లలిన్.

నీకుమారైను లోనికిఁ గొనిపోయి మంగళస్నానముఁ గావించి జపశాలలోనికిఁ దీసికొనిరమ్ము.

ధర్మా—మహాప్రసాదము. (శారదవైపునకుఁ దిరిగి) తల్లీ! శారదా!

క. కనిపెంచఁ గుమారుఁడవై
కనిపించితి మానికృప నికఁ దల్లి నినన్
జనవున నరయుము మనమున
వనితామణి నాదుపుణ్యఫల మీవుసుమీ.

పరమ—తల్లీ! శారద! ఈధర్మాంబ రాజర్షి యనం బ్రసిద్ధుఁడగు నీరాజశేఖర మహారాజుసహధర్మచారిణి, నిరంజనమహీపాలునకు జనయిత్రి, నీయందుఁ

బుత్రికా వాత్సల్యము కలదు. ఈయాశ్రమమున నీకామె తల్లి కాఁగలదు.

కా—మహాప్రసాదము.

ధ—సెలవు పుచ్చుకొనుము, లోని కేగుదము.

కా—(నమస్కరింతురు.)

జ్ఞా—సెలవొసంగుఁడు, పోయివచ్చెదము.

(తెర వ్రాలును.)

## తృ తీ య ర ం గ ము

కన్యాకుమారి.

నటేశ—ఒరే సుబ్బుకుట్టీ! ఏమిరా! ఈవేళ నీకుదండిగ దక్షిణముట్టినదాయేమి?

సుబ్బు—నీకేమి నిరంజనమహారాజుగారికి స్నాన సంకల్పము చెప్పి వడినింపుకొంటివి. కావున నందఱను వేళాకోళము చేయుచున్నావు?

న—నీకేమిచేటురా! అలాగు మూతిమూరెడు చేసికొని వచ్చుచున్నావు? ఆ రెండుమూటారులలో వచ్చినయతఁడు నీకేమియు నీయలేదా?

సు—ఆయన పట్టులాగు, కోటు బంగారుకండీలు, చేతికఱ్ఱ యాజాతిదొరవేషము, వైదికముగనుండు తల్లిదండ్రులనుఁ జూచి, యీయన యేమండలాధిపతియో, యేమంత్రియో నాపంటపండినదని యాతని నే మూపెట్టుకొని యుండఁగా నానోట మంటిగడ్డ కొట్టినాఁడు.

న—ఏమిరా! వాఁడేమి చేసినాఁడు?

సు—ఆయనకేమి పిచ్చియో! ఏదేనిదయ్యము పట్టినదో! నేను జూచుచుండఁగా లాగు చొక్కా మొదలగువాని నన్నింటినిఁ దీసి నిర్విచారముగ సముద్రములోఁ బాఱవైచి, మీసముకత్తిరింపు జుట్టు గొరిగించుకొని, వైదికపువానివలెఁ బిలకజుట్టు పెట్టుకొన్నాఁడు. నాకును నాతలిదండ్రులకు నిదంతయు వైదికశ్రద్ధగాఁబోలు, నాకు నేదోముట్టునని నిరీక్షించుచుండ, లోనికిఁబోయి బిళ్లగోచీ పెట్టిదోవతికట్టి విభూతిపెండెకట్లు తీర్చి, యొక కోలె కట్టి ముష్టికి బయలుదేరినాఁడు. అప్పటికిఁ గుక్కాక గుండ్రాతితోఁ దీరినది. నా లాభమునకేమి గాని, యావేషమునార్చి యీవేషమేల దాల్చెనో నాకుఁ దెలియదు. కాల్చుచుండు కంపెనీచుట్ట తీసి పారవేసిననోట స్వచ్ఛమైనపాటలు, పద్యములు, నామస్మరణము చేయుచుఁజేయు భిక్షాటన మాబాలగోపాలము గుంపులు కట్టి చూచుచున్నారు. ఆయన తొల్లింటివేషము నందఱు చూచినవారగుట నీయూర్పున కచ్చెరువందుచున్నారు. (వినుట నటించి) అదుగో! ఆమహానుభావుఁడిటే వచ్చుచున్నాఁడు.

(ప్రవేశము అన్నంభట్టు)

అన్నం—భవతి భిక్షాం దేహి.

సీ. రామామృతమునోట ద్రావఁగల్గిననాఁడు
నిల మఱొక్కడు రుచియించు నెట్లు
కృష్ణకథల్ చెవి కింపుగావిననాఁడు
వినిపించునే మఱి వింతలెందు
బ్రహ్మవిద్యాలబ్ధి పరిఢవిల్లిననాఁడు
నరుగునే సభకుపన్యాసములకు
సద్గురూపాసనాశాంతిగల్గిననాఁడు
తర్కమంత్రంబులఁ దగులుకొనునె
గీ. ముక్తియందేని మోహంబు పుట్టదన్నఁ
జీటికిని మాటి కట్టొకో చేరనేర్తు
నితరవిషయంబులను మానసేంద్రియముల
యనుభవములేక చర్చించు టదియకాక.

భవతి భిక్షాందేహి.

(ప్రవేశము: డామాడోలీ యొకప్రక్కనుండియు, రామిరెడ్డి మఱియొక ప్రక్క నుండియుఁ బ్రవేశింతురు.)

డామా—కాయనా! తెలుఁగువానివలెనున్నావు?

మీరా! రామిరెడ్డిగారా! మనతెలుఁగువారిని జూచిన నీయుఱవవారికెంత యలుసము కొన్నారు! దారియడిగినఁ జెప్పరుకద! వారికిఁ దెలిసిన విషయమడిగినను మనముఖము చూడఁగానే తెలియదని కొందఱు, "నేరుగా పూడ్చండి" అని మఱికొందఱునందురు.

ఎవరిని బూచ్చుట? వారివా? నన్నా? మామహారాజు గారికిఁ గ్రొత్తగాఁ బెండ్లియాడిన భార్యమీఁదకన్న నన్నంభట్టుమీఁద మరులెక్కువైనవి. భట్టుగారెక్కడ నున్నదియు వెదకి కనుఁగొని పిలిచికొని రమ్మని నాకాజ్ఞాపించినారు. నాయనా, రాజవీధికి దారిదేనా?

రామి—ఔ నిదియే, పొండు. (డామాడోరీ నిష్క్రమించును.)

రామి—(స్వగతము) ఏవ రీతఁడు. ఎఱిఁగిన వాఁడే, ఆనవాలు తెలియలేదు.

(మకలప్రవేశము : అన్నంభట్టు)

అన్నం—

శా. ధ్వంసంబుం బొనరించి మించుటకు నీ
ద్వంద్వంబులన్ లీలమై
సంసారం బెడనమ్మ కించుకభవ
త్సాయుజ్యమేయంచు నో
కంసారీ! భవదీయభక్తతతితోఁ
గాలంబు నిశ్చింతగా
హంసోపాసనఁజేయుచున్ గడచెదన్
న్యాయ్యంబె కానీకృపన్.

భవతి భిక్షాం దేహి!!

రామి—(పరికించి చూచి)

ఓహో! ఎవరీబ్రాహ్మణుఁడు? నాస్నేహితుఁడు భట్టువలెనున్నాఁడు. అతఁడిట్టులేటరొట్లు? అరే! అతఁడే! (సమీపించి) భట్టుగారా?

భట్టు—అవును. నన్నన్నంభట్టంగురు. (ముందునకు సాగి)

ఉ. మాటలఁగాంగు ధ్యానమహి
మంబుచెలంగు మనోవికారముల్
మాటికిఁగ్రుంగుఁ, జేష్ట లభి
మానములోడఁదోలంగు, నాత్మము
మ్మాటికిఁ బొంగు జ్ఞానమణు
మాత్రము గల్గినయోనియందురా
వాటము దేశికోక్తుల న
పారకృపన్ వినిపింతు మాధవా!

రామి—అన్నంభట్టుగారూ! ఒక్క మాట, పదిదినములక్రిందటఁగదా మీరు యూరపునుండి వచ్చినందులకు మేమందఱము చెన్నపురిలో మీకు స్వాగతపత్రము నిచ్చితిమి. మొన్నటిదినపత్రికలో నన్నంభట్టుగారు కల్యాణపురసంస్థానమునకు మంత్రిగా నియమింపబడిరనియుఁ 'బార్వతుఁ బ్రజానిసుదర్శనులు కొలఁదికాలములోఁ దపంబున జేసుచున్నారనియుఁ జదివితిమి. ఏమి యింతయాశ్చర్యము? ఇంతలో నింత మార్పేల? మనోహరమైన మీవేషమును మార్చి యీవికారపు బిచ్చపుబాపని యాకృతి ధరించితిరేమి? మీ రింత సాహసముచేయుదురని కలనైన ననుకొనలేదు.

అన్నం—మీకింతవింత యేల? భరతఖండములోని యార్యవిజ్ఞానహృదయము మహానుభావులవలన నెఱిఁగితిని. కాన నాయహంకార పరిత్యాగముకొఱకుఁ జేయుచున్నానీ భిక్షాటనము.

రామి—మీ క్రొత్తమహారాజుగారు మిక్కిలి తెలివితేటలుగలవారు. ఉత్సాహపూరితులయ్యు బూర్వాచారపరాయణులగుట శోచనీయము. మీవంటి పాశ్చాత్య విద్యాపారంగతులు ప్రధానులైనయెడలఁ గల్యాణపురసంస్థానమున ననేకనూతన సంస్కారములు వెలువడఁగలవని గంపంతయాశతో మే మెదురుచూచుచుండ మీరాజుగారి చాదస్తము మాన్పుటకు బదులు మీరే గొప్పచాదస్తమునఁ బడితిరేమి?

అన్నం—నావేషము మీకంత వింతగఁదోఁచుచున్నదా! సూర్యవంశపురాజులకు గురుండైన వశిష్ఠుండును, చంద్రవంశపురాజముఖ్యులకు నాధారభూతుండగు వ్యాసుండును, చంద్రగుప్తునకు సామ్రాజ్యమును గటాక్షించిన చాణక్యుండును, విజయనగరసామ్రాజ్యస్థాపనాచార్యుండగు విద్యారణ్యస్వామియు, శివాజీమహారాజును దద్గురుండగు సమర్థరామదాసుండును ధరించిన వేషమునే నే నీనాఁడు ధరించితిని.

గురుసన్నిధిని దత్త్వము తెలిసికొని నిరాడంబరమైనవేసముతో నహంకార రాహిత్యమునకై భిక్షాటనముచేసినధీరుఁడే లౌకికప్రవృత్తియందైనను జంకులేక చొరఁబడి యనుచరుల నడుప సమర్థుఁడైయుండు. ఇట్టివారగుటవలననేకదా నేఁ బైనుదాహరించినవారు గురులై మహారాజాధిరాజులకు నెల్లకాలములఁ బూజ్యులైరి.

గీ. క్షోణిపతులను దమకు శిష్యులుగఁజేసి
మాన మభిమానముడిపి సన్న్యాసవృత్తి
బ్రాహ్మణోత్తములకునెప్డు బల మొసంగ
జాలినది జోలె త్యాగధ్వజంబుఁబోలె.

(జోలెనుఁజూపించును.)

దామా—(ప్రవేశించి) నాయనా! భట్టూ! నీకొఱకు వెదకివెదకివేసరితిని. ఏమి యీవైరాగ్యము. అమాత్యపదచిహ్నితుం డభిమానమునకుఁ బడిచచ్చును గాని యిట్టి విహంగమార్గము ద్రొక్కఁగలఁడా? మా నారాయణభట్టు మామగారిదిగులు తీరినది. ఆదంపతుల కడుపు చల్లఁగా సాధువులకళ్లు చల్లఁగా నీ విట్టినిరహంకార శిరోమణివైతివి. తండ్రీ! ఈరెడ్డిగారిని నీవెఱుఁగుదువాయేమి? ఆంధ్ర గీర్వాణములందును నాంగ్లభాషయందుఁ జక్కని ప్రవేశము కలిగి పండిత గోష్ఠిలో నున్నవాఁడు. ఇటీవల నీతనికి శాసనసభ్యత దొరకినపిదప నేనంతగా వినలేదు. నాయనా! నీ జోలె బరువెక్కినది. కొన్నిబియ్యము నాజోలెలోఁ బోయుము. (అని జోలెకట్టుచుండును.)

రామి—(స్వగతము) లోఁగలిగినమార్పు లోకులు కనిపెట్టఁగలరు సుమా!

అన్నం—శాస్త్రిగారూ! రెడ్డిగారు మనకుఁ బరమమిత్రులు. కడునుదార స్వభావులు. కాలానుసారముగ నభిప్రాయభేద మించుకకలిగిననేమిలెండు. ఆయన హృదయ మమృతమువంటిది.

రామి—అంతరంగమునమున్న సంకల్పములకును బహిరంగముగ సంఘమున సంచరించునపుడు జరుపు చర్యలకును నైక్యముకల్గుట చాలకష్టముగనున్నది. మీవలెఁ ద్రికరణము నేకముచేసి తెంపుచేయుటకు మాబోంట్లకుఁజేతగాదు. సంఘమున కేవిధమైన బహిరంగోపయోగములేనిసాధకులకు, సాధువులకు సాయము చేయుట మా స్నేహబృందముయొక్క సమదర్శనదృష్టికి సమ్మతంబుగ నుండదుకదా!

మున్నొకసాధకుఁడు కతిపయభక్తగోష్ఠితో యోగాభ్యాసము చేయఁదలఁచుకొన్న తమ్ముఁ గొంతకాలము కాపాడరాదాయని నన్నడిగె. నేను సమ్మతింప సాహసింపనందున నాతఁడు నాతో నట్టి మమ్మీశ్వరుఁడే కాపాడఁగలఁడు. నీకట్టిపుణ్యము ప్రాప్తము లేదు కాఁబోలునని నిర్విచారముగ వెడలిపోయినాఁడు. భట్టుగారూ! ప్రత్యక్షముగ మీరు చూపిన తెంపు నన్నొక్క నిముసములోమార్చివేసినది. మీదీక్ష కడ్డమురాను. నేనును మీవెంటనే గమ్యస్థానమునకు వచ్చి సెలవు పుచ్చుకొని వెళ్లెదను. ఎంతకాల మీ నియమము ననుష్ఠింతురు?

అన్నం—

గీ. కోవిదత్వ మమరి గోవిందు నర్చించి
మదము డంగి పరమపదము కొఱకు
నంతవఱకు నిట్టు లాకలి సైరింప
మాధుకరముకరము మాకువరము.

వాదాకిని నన్నుఁబోసెను. (ముందుకునడిచి) భవతిభిక్షాందేహి. (గృహిణులు భిక్షనుదెచ్చి సమర్పింతురు.)

గృహస్థుఁడు—పో! పోవయ్యా చచ్చిపోవుచున్నా మీబిచ్చగాళ్లతో. పూర్వము కుంటి గ్రుడ్డివాళ్లకును నేఁ కొలఁది బ్రాహ్మణులకో మాత్రము ముష్టి. ఇప్పుడందరు ముష్టివాండ్లైయయినారు. దీపావళిభిక్షముగ వారి జాతీయకళాశాలలకును, సంక్రాంతిభిక్ష యాఁడు వారినికేతనములకు పో పో.

అన్నం—కోపగించుకొనకు బాబూ! విరిసిన పువ్వులమీఁద వ్రాలి పువ్వులు చెడకుండ మధువును గ్రహించు తుమ్మెదవలెఁ దెలిచియున్నవాకిట నిలుతును.

పెట్టిన భిక్షమును గ్రహింతును. (అని జరిగిపోవును)
భవతి భిక్షాందేహి రామా! పరంధామా!

గీ. రామనామంబు నీవు శ్రీరామభార్య
పుత్త్రి(డగును శ్రీరాముడు మిత్త్రి(డట్ల
రామ! శ్రీరాము(డయ్యె నీరమ్యనామ
మందఱకు( జెల్లుమందు నీవందఱకుట

(కొందఱు కూరలిత్తురు, కొ(దఱు పండ్లిత్తురు)

రామి—(ఆశ్చర్యముతో) మేము మా సభ్యత్వమునకు( బ్రజాసమ్మతి (వోటు) సంపాదించుటకు మానాభిమానములను వీడి కన్నవాళ్లను గాళ్లు కడుపులు( బట్టుకొని సంపాదించుచుందుము. అహంకారముతో జేయుపను లఁటచే మనస్సునకు మిక్కిలికాలుష్యము ఘటించును. (ఒకగృహస్థుడు పనసపండుతెచ్చి యీయ(గా రెడ్డిగారందుకొనును.)

డామ—నాయనా! మీరెందుకు లెండు. నేను దీసికొనివచ్చెదను. దొరబిడ్డలు మీరిట్టిపనిచేయరాదు.

రామి—మీ నిరహంకారవృత్తి ముందు మా దొరతనము లేమి లెక్కస్వామీ! నాకును గొంత సాధుసేవాఫలము దొరకనిమ్ము. (అని నమస్కరించి ఫలమును దీసికొనివచ్చును.)

డామ—దీర్ఘాయుష్మమస్తు. సమస్తసన్మంగళానిధవంతు.

అన్నం—భవతి భిక్షాందేహి.

చ. వ్యయము క్షణక్షణంబునకు
నాయువు మాయజగమ్ము నమ్మచో
నయమొ వృథాభిమానమున
నార్తిహరించునె ముక్తిఖించునే
రయమున దేశికోక్తవిధి
బ్రాహ్మణవృత్తినిమాకు నిత్యత
న్మయత నన్నుగ్రహింపుము
రమాపతి సద్గతి రామభూపతీ.

(అందఱు నిమస్కరింతురు.)

# తృతీయరంగము

కన్యాకుమారి - సముద్రతీరము

(ప్రవేశము - నిరంజనుడు - బుద్ధిమతి - స్నానఘట్టమున మంటపమున( గూర్చునియుందురు.)

నిరం— "సర్వంఖల్విదమేవాహం నాన్యదస్తి సనాతనమ్" ఈ శ్లోకార్థము బేహాగ్ రాగమువీఁద నైగుసారులుపాడుచు. శ్రీమన్నారాయణమూర్తి భాగవతమంతయు శ్లోకార్థమున నన్నుగ్రహించిన పరాంబిక మూలాధారస్వరూపిణి బాలికారూపంబున నిందు సేవింపఁగంటి.

క. బాలా! నీవే ప్రాపకు
చాలగ నీలీల లోకజాలము సేయగ
బాలనఁజేయగ మాయగ
ఫాలాక్షుని దేహ మర్థభాగము చేయన్.

ఆహా! కన్యాకుమారిస్వరూపము! సర్వదృశ్యంబును లయింపఁజేసి యంధకారబంధురంబగు శూన్యస్థానంబును దాటి యవ్వలితేజంబు వీక్షించుసమ్యగ్దర్శనము భక్తులకు దెలుపుదేశముచేయుచున్నదా యన్నట్టు లీపరాశక్తి భూభాగమునువీడి, తన దృష్టి సముద్రమువైపునకుఁ ద్రిప్పి యగ్రమున నిల్చియున్నది.

నేఁడు బుద్ధిమతి ప్రభాతదర్శనానంతర మిట్లో బైటికివచ్చి యొక్కమూటయైన నాడక ఆ స్తంభము మఱుగున ధ్యానపారవశ్యమునన్నది అదిగో దేవీ స్తవము సేయుచున్నది. నాసన్నయొటింగి సంతోషించును. నే నిక్కడనుండియే వినుచుండెద.

(వినుట నటించును.)

బుద్ధి—

ఉ. పారవిహీనసంసరణ సాగరమీఁదఁగ నేరికిన్శమం
చారొదసేసి బంధురమనై భవదీయపదాబ్జమందు సంచారముచేసి మొక్కెదను శంకరతత్త్వవికారదక్షమే
తీరవనైనఁ గల్గునటు దీవనలిచ్చుచుఁజేర్చు పారమున్,

నిరంజ—

గీ. పరమభక్తురాలు తరుణీశిరోమణి
పరమగురుఁడు నాకుఁ బరమహంస
పరమసాధ్వితల్లి పరమాప్తుఁడగుఁ దండ్రి
పరమకులభపదము పరమపదము.

తల్లీ! జగదంబ! ప్రణతార్థులకు మహాశక్తులను నీ వనుగ్రహించినట్లు భగవత్స్వరూపుఁడగు గురుమూర్తియే బుద్ధిమతియోగము నాకుఁ గటాక్షించెను.

క. ద్వైవాధీనము సద్గురు
సేవాఫల మాత్మయోగ సిద్ధిప్రదముల్
శ్రీవిద్యారూపము నగు
నావనితాసంపద మనసార భజింతుల్.

బుద్ధి—(స్తంభముచాటునుండి) ప్రాణనాథుని మాటలమృతంపుఁదేటలై నేనింత సేపు సేయుచుండిన ధ్యానరూపతపమునకు సత్ఫలమాయన్నట్లు కర్ణపర్వము గావించె. ఇఁకేమనునో వినుచుండెద.

నిరంజనుఁడు—(బేహాగ్ రాగమునఁ బాడును)

శ్లో. సర్వచైతన్యరూపాంతాం ఆద్యాంవిద్యాంచ ధీమహి, బుద్ధింయానః ప్రచోదయాత్.

బుద్ధి—

గీ. అఖిలచిత్స్వరూపమైన యద్దానిని
నాద్యవిద్యయు నగునట్టిదాని
బుద్ధులన్నిమాకుఁ బుట్టించుదాని ధ్యా
నింతుమాట వెలదినిక బరాంబ

నిరం—(బుద్ధిమతినిసమీపించి) ఎంతలలితముగ, మనోహరముగ నాంధ్రీకరించితివి, ప్రేయసీ! మతి యొక్కమాఱు చదువుము. (అని గడ్డముపట్టుకొని బతిమాలును.)

బుద్ధిమతి—తేటతెనుఁగుమాటలతోఁ గూర్చినది యిది దేశికు నాయందుఁగల యనురాగమహిమచే నంతముద్దుగఁదోఁచినది. ("అఖిలచిత్స్వరూప" అను పద్యమును జదువును.)

నిరం—ఈ జగమును సృజించి యాడించి వినోదించునట్టి వెలఁది కావున నాటవెలఁదియని చమత్కారముగ వర్ణించితివి.

బుద్ధి—నా కంత చమత్కారము తెలియదు. చిన్నియాటవెలఁది పద్యములో వ్రాసి నిమ్ననుతించితి నని విన్నవించుకొంటిని. అదియంతయు మీవ్యాఖ్యాన కౌశలము. నాథా! మీచెలికానిజాడ యేమియుఁ దెలియ లేదుకదా! పిలువఁబోయినశాస్త్రియు రాఁడాయెను. నాఁడు తోఁటలో మీతో మీమిత్రుఁడుచేసిన నాస్తిక వాదమును వినియాతఁడు మనవాఁడగుట యసంభవమను కొంటిని. మీరు మీచెలికానితోఁ దత్త్వ విచారము చేయుటఁజూచి చాటునుండి విని మీయుక్తి చమత్కృతులకు బోధమునకు సంతసపడుచుంటిని.

నిరం—నా చెలికాఁడు నీయందుఁ బరమభక్తి గౌరవములు కలవాఁడు. కడు నుత్తముఁడు. నీకు సోదర ప్రాయుఁడు. నీవు నిశ్శంకముగ మాగోష్ఠిలోనికి రావచ్చును.

బుద్ధి—మీరు మహాఫలదమగు జ్ఞానదానము చేయుట సహధర్మచారిణి నాకెంతయొ సంతసము.

నిరం-

గీ ధవుని కేదివ్రతమొ తనకదే వ్రతము ప
తివ్రతలకటంచుఁ దెల్పు శ్రుతులు
బుద్ధిమతిని లక్ష్యముగఁజేసి యద్దాని
కజుఁడు మేలుచేసె నౌర నాకు.

రాత్రి ప్రొద్దుపోవువఱకు నాతో మాటలాడు చుండెను. సకలాభిమానంబులను విడనాడి, మిక్కిలి పశ్చాత్తప్తుఁడయి నిదుర యన్నదెఱుఁగక, వేకువనే వెడలి పోయినాఁడు. ఉత్తుంగతరంగభంగితమై పరుగెత్తుచు దుముకుచుఁబోవు తరంగిణిని మరల్పుట యెంత కష్టమో సంపర్కదోషంబునఁ బశ్చిమాభిముఖమై నిమ్నమార్గమునకుఁదిరిగి పరుగెత్తు చిత్తసంకల్పప్రవాహమును బ్రాఙ్ముఖముగాఁ ద్రిప్పుట సామాన్యమా! అతఁడెట్లు తెనువచేయునో ?

(తెరలో)

గీ. రామ రామ రామ, రమణీయగుణధామ
వదన విజితసోమ, వైరిభీమ,
దాసకామ, దేవతాసార్వభౌమ, మా
వాస హృదయసీమ, భవ్యనామ.

భవతి భిక్షాందేహి!

నిరం—(ఆలకించి) ఓహో మిత్రుఁడు విహంగ మార్గముఁ బట్టినాఁడు. ప్రేయసీ! మన మాతని నెదు ర్కొనఁబోవుదము రమ్ము (అనిపరిక్రమించుచు)

క. విద్యాదాయక మాద్యము
సద్యఃఫలితంబు సకలసాధుప్రియము మఱి
యుద్యమరహితం బగుటన్
హృద్యము భిక్షాన్నమంచు నెంతురు ధీరుల్.

(ప్రవేశము. అన్నంభట్టు—రామారెడ్డి మొదలగువారు)

నిరం—మిత్రమా! ధన్యుఁడవు. కృతార్థుఁడ వైతివి. శాస్త్రిగారూ! మనవిడిది లోనికి నీసామగ్రినిఁ గొనిపోయి దీనికిఁదోడు మన సంస్థానవుభిక్షనుఁగూడఁ జేర్చి యొక సహస్రబ్రాహ్మణ్యమునకు సమారాధనఁ జేయింపుఁడని నారాయణభట్టుగారితోఁ జెప్పుఁడు. భిక్షాన్నము మనకు సామాన్యముగ లభించునా! మేమును ప్రసాదస్వీకారమున కక్కడికే వత్తుమని చెప్పుఁడు. మాచెలికానికి నేటి కార్యభారమేమియు లేకుండ విశ్రాంతి నొసంగుఁడు.

శాస్త్రి—చిత్తము. ధర్మప్రభువులు. ఇట్టిమాట లేని మీ సంస్థానమునఁగాక కర్మభూమియందు మఱొక చోట వినఁబడునా! ఇదె పోయివచ్చెదను.

అన్నం—నేను సెలవుపుచ్చుకొనెదను. మీమైత్రి యెంతని కొనియాడఁగలను.

ఉ. చేసిన వెల్లపాపములు
చెప్పిన వెల్లనుగల్లలౌట నా
యాసము గల్గెనింకఁ బరి
హాసపుజీవన మేల? యాత్మస
న్న్యాసమునందు నిచ్చగల
దన్నియుఁ దూగుట నీపదంబ నా
యాసముగా లభించెఁ బర
మావసుధీమణీ రాజచంద్రమా!

ఒక్క మనవి. ఈ రామిరెడ్డిగారు నాకు మాననీయు లగుటఁ దమకు నివేదించితిని.

నిరం—మంచిది. నీవు కడుతపస్వివి. ఇంటికేగి విశ్రాంతిఁ గైకొనుము.

రామి—మహారాజా! మీకును మీ యమాత్యులకు నివే నా నమస్కారసహస్రంబులు. యౌవనధనాధికారమదంబునఁ జిన్నపెద్దలఁగానక తెలియనివాఁడనౌట మీ చెంత నేఁడు నే నిట్లు నిల్వఁబడుటయే నా పూర్వపుణ్యఫలంబనుటకు సందియము లేదు.

నిరం—మీ మైత్రియు మాకు సంభావనీయము.

రామి—నాకును నచ్చట నింత ప్రసాదముఁ బెట్టింపుఁడు.

నిరం—అడుగవలెనా! మా సంస్థానమును మీరు నిజగృహముగ భావింప వచ్చును. విడిదిలో విశ్రాంతిగ మాట్లాడుదము.

(అందఱు నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.

# నిరుత్తరము

వేలూరి శివరామశాస్త్రి

[సంయుక్త నికాయ, ౪ ఖండ]

క్షేమ యను బుద్ధశిష్యం
గామాదివికారదూరఁ గనుఁగొంచుమహా
ధీమంతుండును రాజ్య
మంతుండౌ ప్రసేనజి త్తిట్టడిగెన్.

ప్రసేనజిత్తు

అమ్మా! నిర్వాణముఁ గను
పిమ్మట జీవుండు తనువువిడనాడిన యా
పిమ్మటఁ దనువుం గాల్చిన
పిమ్మట నేమగును? తెలియవేఁడెద నిపుఁడున్.

క్షేమ

తొల్లియు నీప్రశ్నమె జిన
వల్లభసన్నిధిని వచ్చె, వచ్చిన 'హరిలే
ద'ల్లన 'నచ్యుత లేవి'
సల్లాపము సతఁడు వినని చాడ్పున నుండెన్.

ప్రసేనజిత్తు

తల్లి, యనాదికాలపు
వెల్లువఁబడి ప్రశ్న యిద్ది విచ్చేయుఁగదా!
యల్ల సకలజ్ఞుఁడే చల
చల్లఁగ నీప్రశ్న నేల జాఱన్ విడిచెన్?

క్షేమ

అల్ల సముద్రమునందున
నల్లఁగఁ గనుపట్టు జలకణంబుల నెపుఁడే
నుల్లేఖింపం గలఁడా?

ప్రసేనజిత్తు

ముల్లోకములందు నుండఁ బోఁడో తల్లీ!

క్షేమ

పంచస్కంధ పరాక్రమంబు నడఁగిం
పంజాలువాఁ డంతముం
గాంచన్ లేని మహాసముద్ర సదృశా
కారంబుతో నిశ్చలున్
మించుంగావున నట్టిజీవి మృతుఁడౌ
మీఁదం గనంబోవు రూ
పించన్ రానిది చెప్పరానిదిగదా
యెవ్వారికేనిన్ నృపా!

# ప్యారిస్

బుర్రా వెంకటసుబ్రహ్మణ్యము

ఎవరికైనా నేను బుద్ధిపొరపాటున పాశ్చాత్య దేశాలు కొన్ని చూసి తిరిగివచ్చానని తెలిస్తే వాళ్లు నన్నుముందు అడిగే ప్రశ్న 'ప్యారిస్ చూసేరా?' అని. అంతదూరంవెళ్లి ప్యారిస్‌నగరాన్నా చూడకుండా రావడం! ఈ అడిగేవాళ్లల్లో కొందరు ప్యారిస్ చూడకపోయినా దానిగురించి చదివియుండడంవల్ల 'నాతిర్‌దామ్‌ఆలయం చూసేరా?' అనీ, 'లూవ్రే చిత్రశాల చూసేరా?' అనీ, 'వర్సైయ్ రాజభవనం చూసేరా?' అనీ, 'ఈఫిల్ టూర్ చూసేరా?' అనీ అడుగుతూ ఉంటారు. అన్నీ చూసేనని సమాధానం చెప్తూఉంటాను. మరికొందరు ఏవిధంగానో ప్యారిస్ నగరంలో జరిగే కొంకితనాలు కొంతవివరంగా తెలుసుకున్నవాళ్లు 'ఫోలీస్ బర్జీర్ నాటకశాలకి ఎప్పుడైనా వెళ్లేరా?' అని సందేహిస్తూ అడుగుతారు. వాళ్ల కుతూహలం గ్రహించి నవ్వుతూ 'వెళ్లేన'ని జవాబిస్తాను. కాని ప్యారిస్ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఇవేవీ నాకు జ్ఞాపకంరావు. అందుకు మొదటికారణం ప్యారిస్‌నగరాన్నీ, ఆనగరం యొక్క దృశ్యాలనీ నేను ఒక్కమాటు కాకుండా అనేకమాట్లు చూసేను. నా కెందువల్లనో కాని ఒక్కమాటు చూసినవి మాత్రమే చటుక్కున జ్ఞాపకంవస్తాయి. అనేకమాట్లు చూసినవి అలవాటువల్ల వెనకకిపడి ప్రత్యేకంగా ఆలోచిస్తే కాని మనస్సుకి మళ్లీ చిక్కవు కాబోలు. రెండవకారణం నేను ప్యారిస్ నగరాన్నే కాకుండా అనేక గొప్ప పాశ్చాత్య నగరాలు చూసేను. బర్లిన్, వీన్, రోమ్, నపోలీ, మ్యూన్‌చెన్, ఫిరెన్జై, బుడాపెస్ట్, జినీవా, లుసర్న్, లెనిన్‌గ్రాడ్, మాస్కో ఇంకా ఎన్నో నగరాలూ, అక్కడా అక్కడా చూడవలసినవిచిత్రాలూ అన్నీ చూసేను. అందువల్ల ప్యారిస్ విశేషాలేవీ అంతప్రత్యేకంగా వాటంతటవి జ్ఞాపకం రావు. ఈరెండుకారణాలేకాక మరొకకారణం, వీటి రెండిటికంటే ముఖ్యమైనది, రెనీ.

నేనిప్పుడు చెప్పదలచుకున్నకథ చెప్తే ఈదేశంలో అందరూ ఆశ్చర్యపడతారు. చాలామంది నమ్మరు. కొందరు పాశ్చాత్యసంఘాలలోఉండే వికరీతమైన దోషాలన్నీ ఈవిధంగా మనదేశంలో అందరికీ చాటిస్తున్నాననీ, అలా చాటించడంవల్ల మనసంఘాన్ని పాడుచేసినవాడి నవుతాననీ నన్ను తిట్టడం ప్రారంభిస్తారు. కాని నా ఉద్దేశ్యం ఒకసంఘాన్ని తిట్టాలనీకాదు, మరొకసంఘాన్ని పాడుచెయ్యాలనీ కాదు. నా అభిప్రాయం ఏమిటంటే, నిజంచెప్పడంవల్ల ఎవరికీ అపరాధంజరగదని. అదేకాక కళ్లుమూసుకునీ, కాళ్లూచేతులూ బంధించేసుకునీ సంపాదించే పుణ్యలోకం ఏమాత్రం విలువైనదని?

ఇంక నాకథ చెప్తాను — నేనవలోయిన దేమిటంటే, ప్యారిస్‌నగరాన్ని నేనెప్పుడు తలచుకున్నా రెనీఒక్కర్తే నాకు జ్ఞాపకంవస్తుందని. రెనీ ఒకఫ్రెంచిపిల్ల. ప్యారిస్‌లోనే పుట్టి ప్యారిస్‌లోనే పెరిగింది. పూర్తి పేరు రెనీబర్నే. అంతమరీ అందమైనదని నేను చెప్పను. ఇంగ్లండులో కనబడే అందమైనముఖాలూ, అందమైన శరీరాలూ మరేదేశంలోనూ నాకు కనబడలేదు. ఈవిషయంలో ప్యారిస్ నాకసలేనచ్చలేదు. ప్యారిస్‌లో ముఖాలన్నీ అనేకరాత్రుళ్లబట్టి నిద్రలేనివాళ్ల ముఖాలలా ఉంటాయి. అదేకాక 'లాటిన్' ప్రజ కనుక వాళ్లయవ్వనపు కళలూ శోభా త్వరలో మాయమైపోతా యనుకుంటాను కూడాను. అదేలా ఉన్నా, రెనీ అంతఅందమైనదని చెప్పేందుకు వీలులేదు. కాని మంచితెలివైనది. తెలివైనదని ఆకళ్లల్లోనే కనిపిస్తుంది. నవ్వుతున్నప్పుడు అంత అందమైనది కాదన్నమాటకూడా మరచిపోతాం.

ఈ అమ్మాయిని తలవనితలంపుగా కలుసుకున్నాను. జరిగిన దిదీ. అది నాల్గవసారి ప్యారిస్‌కి నేను

రావడం. ఒకచిన్న తోలుపెట్టె చేతిలోపట్టుకుని నేను క్రిందటిసారి దిగిన హోటల్‌కే వెళ్ళేను. ఈహోటల్ యజమాని నాకు చాలా నచ్చినవాడు. మొదటిసంగతి ఇంగ్లీష్ బాగావచ్చును. అదికాక నాతో సరదాగా మాట్లాడుతూ ఉండేవాడు. వీలైనప్పుడల్లా నేను ఒంటరిగా భోజనంచెయ్యడంకాని, టీతాగడంకాని జరుగకుండా తనతోటే, తనకుటుంబంతోటే కలసి కూర్చునేటట్టు చూసేవాడు. అతనిభార్యా, ఇద్దరు చిన్నకొడుకులూకూడా నేనంటే సరదాగానే ఉండేవారు. క్రిందటిసారి ఒకసాయంత్రం ఆ ఇద్దరుకొడుకులనీ నేను సినీమాకి తీసుకువెళ్తానంటే తల్లి సరేనని ఒప్పుకుని పెంకితనానికి తననికూడా రమ్మని పిలవనందుకు కోపం తెచ్చుకొన్నట్లు నటించింది. ఇలా వీళ్లందరినీ కూడా బాగా ఎరుగున్నాను కనుక అక్కడికే వెళ్ళేను. ఈసారి హోటల్ అంతా క్రిక్కిరిసే ఉన్నప్పటికీ నాకొక మంచిగది ఏర్పాటుచేసేడాయజమాని. పదినిముషాలు దాటేక వస్తే నాకక్కడ చోటుండకపోవునన్నాడు. యథాప్రకారంగానే నాకు సదుపాయాలన్నీ చేసిపెట్టేడు.

వచ్చిన మూడవరోజున ప్రొద్దుటినుంచి సాయంత్రంవరకూ గదిలోనే కూర్చోడంనచ్చక రోజంతా వేరే ఎక్కడో గడుపుదామని నిశ్చయించుకుని, పదకొండు గంటలకే పైకివెళ్తూ, ఆరాత్రి పదిగంటలవరకూ గదికి రానని హోటల్‌యజమానితో చెప్పి వెళ్లిపోయాను. వెళ్లిపోతుంటే అతనిభార్యకూడా నవ్వుతూ ఈరోజల్లా నీతో కాలక్షేపంచేసే అదృష్టవంతురాలి పేరేమిటో చెప్పమంది. 'మనిషినెవరినో ముందు స్థిరపరచుకున్నాక పేరు కనుక్కుందాం' అని జవాబుచెప్పేను. ...ముందు లూవ్రేచిత్రశాలకి వెళ్ళేను. చూసినచిత్రకళే, చూసిన శిల్పకళే మళ్లీచూసేను. జగత్ప్రఖ్యాతిపొందిన లియొనార్డోడావించీ యొక్క 'మోనలిస్' చిత్రపఠాన్నీ, అనేకశతాబ్దాలక్రిందట మైలో అనువాడు అతిసుందరంగా చెక్కిన వీనస్‌శిల్పాన్నీ మళ్లీచూసేను. పూర్వం అంతరమ్యమైనవిగా కనబడని చిత్రపఠాలు కొన్ని ఇప్పుడు చాలా ఆనందం కలుగజేసేయి. హెన్నర్ అను చిత్రకారుడిది 'చదువరి' అని ఒకపఠం ఉందక్కడ. ఎంతో మనోహరంగా ఉంది. క్రిందటిమాటు దానిని నేను చూడనేలేదు. జుట్టు విరబోసుకుని, దుస్తులేమాత్రంకూడా లేకుండా, నేలమీదపడుకుని, తలకుడిచేతిమీద ఆన్చి పుస్తకం చదువుతోంది ఒకావిడ. ఆవిడధ్యాన్నం అంతా ఆపుస్తకంమీదనే. ఆచిత్రపఠాన్ని చూసిన వాళ్లకికూడా ఆపుస్తకం ఎదురుగుండా ఉండడం ఆవిడ చదువులో మునిగిపోయుండడం మిగిలిన మనోవికారాలకి ఏమాత్రం చోటీయ్యవు. దిగంబరస్త్రీల చిత్రపఠాలనేకం చూసేనుకాని ఇంతనిర్మలమైన కళ వాటిలో నే నెన్నడూ చూడలేదు........

సాయంత్రం మూడుగంటలవరకూ లూవ్రేచిత్రశాలలోనే తిరిగేను. తర్వాత ఏమిటిచేసేందుకూ తోచలేదు. కొంతిసేపు ట్యూలరీస్ వనంలో అర్థంలేకుండా తిరిగేను. సినీమాకి వెళ్లడానికి బుద్ధిపుట్టలేదు. చెయ్యగలిగినది మరేమీ కనబడలేదు. ఆఖరాఖరకి లండన్‌వదలి ఈసారి ప్యారిస్ నే నెందుకు వచ్చినట్టని నాలో నేను విచారించడం మొదలెట్టేను. మొన్నాడు పొద్దున్నే బయలుదేరి లండన్‌కి పోవాలని నిశ్చయించుకున్నాను... నాలుగుగంటలయింది. ఆవనంలో ఒకబల్లమీద వెళ్లి కూర్చునేసరికి పక్కని ఇద్దరు ముసలివాళ్లు నేను ఆఫ్రికాదేశస్థుడనా ఇండియాదేశస్థుడనా అని వాదించుకోడం మొదలెట్టేరు. నేను ఫ్రెంచిభాష బాగా మాట్లాడలేకపోయినా చాలావరకు బోధపరచుకోగలను. వారిలో ఒకడు నన్ను 'ఫ్రెంచి మాట్లాడగలవా?' అని ప్రశ్నించాడు. నాకు ఫ్రెంచిభాషరాదని సంజ్ఞలు చేసెను. ఒకప్రశ్నకిమట్టుకు 'నాదేశం ఇండియా' అని జవాబు చెప్పగలిగేను. అప్పుడు వాళ్లల్లో ఒకడు, "చూసేవా? నే నన్నట్టే. ఈమనిషిపెదిమలు నీగ్రోలపెదిమలలాగ ముందుకు పొడుచుకు రావడం లేదు. చూడు" అన్నాడు. రెండవవాడు ముందుకు వంగి నాకేసి చూడబోతుంటే ఇదెక్కడిబాధని చెప్పి లేచి వెళ్లిపోయాను.

తిన్నగా హోటల్‌కే వెళ్లిపోయాను. పదిగంటలదాకా రానన్నవాడిని అయిదుకొట్టకుండానే వచ్చే

నేను. లోపల కాలుపెట్టగానే యజమాని నాకేసి దెయ్యాన్ని చూస్తున్నవాడిలా హడిలిపోతూ చూసేడు. ఏమీ తోచకపోవడంవల్ల ముందుగానే వచ్చేనని నవ్వుతూ సమాధానం చెప్పేను. ఇంతట్లో అతనిభార్య వచ్చింది. తనుగూడా నాకేసి ఏమిటో అతికంగారుగా చూడడం మొదలెట్టింది. 'మీరు పదిగంటలవరకూ రారనుకుంటున్నాం' అంది. తనకికూడా బోధపరిచాను నా చిక్కులు. నాగదికి పోదాం అని మెట్లెక్కబోతుంటే హడావిడిగా నావెంటవచ్చి ఆయజమాని ఈ రోజుకి వాళ్లతో క్రిందనే టీ పుచ్చుకోమని బ్రతిమాలుకున్నాడు. సరేకాని, ముఖంకడుక్కునేందుకు గదికి వెళ్లాలన్నాను. యజమాని భార్య ఎంతో ఆప్యాయంగా క్రిందనే కొత్తసబ్బుబిళ్లా, తువ్వాలూ ఇస్తానంది. ఇదంతా నాకేమీ బోధపడలేదు. ఆఖరికి వాళ్లిద్దరికేసీ చూసి చూసి ఈగందరగోళం అంతా ఏమిటో తిన్నగా బోధపరచమన్నాను. 'చాలా బుద్ధిపొరపాటయింది; క్షమించాలి' అంటూ మొదలెట్టేడా హోటల్ యజమాని. 'మరేమీ పరవాలేదు, చెప్పండ' న్నాను. అప్పుడు చెప్పేడు.

నేను వెళ్లిపోయాక సుమారు ఒంటిగంటన్నరకి ఒక అమ్మాయితో ఫ్రెంచికుర్రాడొకడొచ్చి సాయింత్రం అయిదుగంటలవరకూ ఒకగది కావాలన్నాడట. యజమాని ముందర గదులేవీ ఖాళీగాలేవని జవాబిచ్చాడట. కాని ఆకుర్రాడు దుఃఖంగా ఇటూ అటూ చూస్తూ నుంచునేసరికి జాలికలిగి నాగదిమాటా, నేను పదిగంటలవరకూ రాననడం జ్ఞాపకం వచ్చాయట. వచ్చినవాళ్లిద్దరూ భార్యాభర్తలు కారని తెలుసును. అయితే నేమి? యవ్వనంలో ఎవరైనా ఇటువంటి అడ్డులవల్ల దుఃఖపడడం ఫ్రెంచివాళ్లెవరూ చూస్తూ భరించలేరట. అందువల్ల యజమాని అయిదుగంటలకి సరిగ్గా వెళ్లిపోయేటట్టయితే నాగది వాడుకోవచ్చునని ఒప్పుకున్నాడట. నాఅనుమతిలేనిదే అలా ఒప్పుకోడం చాలా తప్పనీ, క్షమించమనీ వెయ్యిసార్లు బ్రతిమాలుకున్నాడు. ఇందులో క్షమించకుండా ఉండేందుకు ఏమీ లేదనీ, తను చేసినదల్లా నా ఒప్పుదలతో నన్నమాటేననీ బదులు చెప్పేను.

నే నీకథచెప్పడం మనదేశంలో కనక ఈ సందర్భంలో కొన్ని విషయాలు చెప్పవలసిన అవసరం ఉంది. పెళ్లికాని అబ్బాయిలూ, అమ్మాయిలూ యావన్మందీ ప్రతిపాశ్చాత్యదేశంలోనూ విచ్చలవిడిగా స్వేచ్ఛావిహారం చేస్తారని కాదు కాని, వీలైనంతవరకు ఆస్వేచ్ఛ అనుభవించాలన్న కోరిక రెండువైపులా ఉండడం అక్కడ సామాన్యమే. తర్వాత ప్రతినగరంయొక్క ప్రతిహోటల్ లోనూ కూడా అటువంటివాళ్లకి సదుపాయాలు సిద్ధంగా ఉంటాయనికాదు కాని, ప్రతినగరంలోనూ అటువంటి సదుపాయాలు సమకూర్చేహోటల్ కాస్త వెతికితే కనబడకమానదు. లోకంలో ఇటువంటి పనులు జరుగుతూఉండడం సిగ్గుపడవలసిన విషయమే. అయినా ఆదేశాలలో ఈవిధమైన పనులు జరగకుండా చేసే మహానుభావుడెవడూ ఇంకా ఉద్భవించలేదు...

ముఖం కడుక్కుంటానే టీతాగడానికి సిద్ధపడ్డాను. మేమూ టీతాగడానికి వెళ్లబోతుంటే ఆ అబ్బాయీ, అమ్మాయీ మెట్లుదిగేరు. ఇద్దరికీ కూడా ఇరవై ఇరవైరెండేళ్లకి పైనుండవు. హోటల్ యజమాని నాకేసి పెంకితనంగా చూస్తూ నెమ్మదిగా, 'వీరిద్దరే ఇంతసేపూ మీగదిలో ఉంట.' అన్నాడు. దగ్గరగా వచ్చాక వాళ్లతో నాకు పరిచయం కలిపేడు. కుర్రవాడిపేరు ఫిలిప్ డోబ్రే అమ్మాయి పేరేమిటని తడుముకుంటుంటే రినీబర్నే అని తనేచెప్పింది. టీ పుచ్చుకునేందుకు వాళ్లిద్దర్నీ కూడా రమ్మన్నాం. కాసేపు వాళ్లల్లో వాళ్లాలోచించుకుని ఆఖరికి 'సరే' నన్నారు. టీ తాగడానికి కూర్చుంటుంటే రినీ చేతిలో రెండుపుస్తకాలు చూసేను. అవి ఏమిటని నేనడిగితే చూడమని నాకందిచ్చింది. ఒకటి షేక్స్పియర్ నాటకాలు. రెండవది జర్మన్కవి గొయ్టే వ్రాసిన ఫౌస్ట్. నేనంతవరకూ వీరిరువురికీ కూడా ఫ్రెంచితప్ప మరే భాషా రాదనుకున్నాను. ఇప్పుడడిగితే ఫిలిప్కి ఫ్రెంచొక్కటే వచ్చును కాని రినీకి ఫ్రెంచేకాకుండా ఇంగ్లీషూ, జర్మన్కూడా వచ్చునని తేలింది. షేక్స్పియర్ నాటకాలన్నీ చదివేనంది. ఇంగ్లీషుకవులంటే చాలాసరదాఅంది. జర్మన్ భాషలోకూడా చాలా

పుస్తకాలు చదివేనంది. కవులందరిలోనూ షిల్లర్ తనకి ప్రత్యేకంగా నచ్చినవాడంది. 'గొప్పచదువరి వన్న మాట!' అన్నాను. 'చదువరి' అన్నమాట పైనపడ గానే ల్యూవ్రేలోచూసిన చిత్రపఠం జ్ఞాపకంవచ్చింది. వెంటనే ఆవిషయమైచెప్పి, 'ఎన్నడైనా ఆచిత్రపఠం చూసేవా?' అనడిగేను రెనీని.

"హెన్నర్ అన్నచిత్రకారుడు వ్రాసినదేనా?"

"అవును."

"చూసేను. అసలు నాకు చాలానచ్చిందది. దానిప్రతికూడా నావద్దరుంది. కాని చిత్రకళాపండితు లెవరూ అదంత గొప్పదని ఒప్పుకోరు."

"నిజంగా?"

"అవును. ఎవరూ దానినంతగా మెచ్చుకోలేదు. నాకుమట్టుకు అఖండంగా నచ్చిందది...ఎవరో కవికి కలలో కనబడిన విచిత్రదృశ్యంలా ఉంటుందికాని కామోద్రేకం కలుగజేసే సామాన్యమానవశరీరంలో కన బడనే కనబడదది. దానిలో చిత్రకళకంటె కవిత్వ ధోరణి హెచ్చుంది... ఇదే మొదటిసారి నాకు దాని నంతగా మెచ్చుకునేవారు మరొకరు కనబడడం."

ఈపఠంగురించి జరిగినసంభాషణలో తేలిన విష యా లేమిటంటే —ఫిలిప్ ల్యూవ్రేచిత్రశాల చూసి ఆరే ళ్లయిందనీ, ఆరేళ్లక్రితం చూసినది తనకేమీ జ్ఞాపకం లేదనీ, మాహోటల్ యజమాని నిజంచెప్పడానికి సిగ్గు పడకపోతే ల్యూవ్రేచిత్రశాల ఎన్నడూ చూడనేలేదనీ, అతనిభార్యకి ల్యూవ్రే అంటే ఏమిటో తెలుసునో తెలి యదో కూడా సందేహాస్పదమనీ!

టీతాగడం అయాక వాళ్లిద్దరూ వెళ్లేందుకు లేచేరు. వెళ్లబోతూ ఫిలిప్ యజమానిని పక్కకిపిలచి ఆగదికి కొంతడబ్బివ్వబోయాడు. అప్పుడతను నాకేసి చూపిస్తూ గదినాదనీ, తనకేమీ డబ్బు పుచ్చుకునేందుకు హక్కులేదనీ బోధపరచాడు. నేనుకూడా యజమాని నాతనిగురించి నాతో చెప్పేడనీ, డబ్బేమీ ఇచ్చేందుకు వీలులేదనీ అన్నాను. అప్పటివరకూ వాళ్లిద్దరూ గ్రహించ లేదు హోటల్ మనిషి వాళ్లసంగతంతా నాకు చెప్పేసే డని. రెనీకి అమితమైన సిగ్గూ, అమితమైన కోపంకూడా సంభవించాయి. మాయజమాని మట్టుకు 'ఈమాత్రం దానిలో తప్పేమి' టని వాదించాడు. 'ఆగది మరొకరి దనిచెప్తే మే మిక్కడ ఉండకనే పోదుం' అన్నాడు ఫిలిప్. 'నీతో నేనిక్కడకి రావడమే బుద్ధిపొరపా' టంది రెనీ ఫిలిప్‌తో. ఫిలిప్ ఉద్రేకం మరీ హెచ్చ యింది. మా యజమానికేసి చూస్తూ, 'మాసంగతి ఊళ్లో వాళ్లందరికీ చెప్పేందుకు నువ్వెవడవు?' అన్నాడు. యజమాని 'ఈభాగ్యంతా ఎందుకు తెచ్చిపెట్టుకున్నా మురా!' అని తల తడుముకుంటూ మరొకవైపుచూస్తూ నుంచున్నాడు. నేను తనపక్షాన్నీ, నాపక్షాన్నీకూడా క్షమార్పణకోరేను. కొంతసేపటివరకూ ఇద్దరూ మాట్లాడ లేదు. నేనింకా దీనంగా మాట్లాడుతుంటే ఇంతవరకూ నాకేసి చూడకుండా నుంచున్న రెనీ 'మీతప్పేమీ లేదు. అంతా ఆయజమానిదే. మీరెందుకు క్షమించ మనడం?' అంది. 'ఇద్దరిదీ తప్పే. ఇద్దరిదీ కాదు. ఇంతకీ జరిగిన హానేమీ లేదుకదా' అన్నాను. 'మిమ్మ ల్నేమీ అనడంలేదు సుమండీ' అందిమళ్లీ. 'ఈ హోటల్ కిక నేనెన్నడూ రా' నన్నాడు ఫిలిప్. నేనెన్నడూ రానంది రెనీ అతినిశ్చయంగా. వాళ్లీమాటల యాక గుమ్మందాటి వీథిలోకి వెళ్తుంటే వాళ్లవెంట నేనూ వెళ్లేను. నేనింతసేపూ ఇంగ్లీషులో మాట్లాడుతూ ఉండడంబట్టి ఫిలిప్ నే నన్నదేమీ బోధపరచుకోలేక పోతున్నాడు. అయినా నేను నాతప్పుడు ఫ్రెంచిభాష ప్రయోగించకుండా ఇంకా ఇంగ్లీషులోనే మాట్లాడేను. 'మళ్లీ మిమ్మల్ని యెప్పుడు నేనుచూడడం?' అనడిగేను. ఫిలిప్ ఏమిటంటే రెనీ నాప్రశ్న ఫ్రెంచిలో బోధపర చింది. 'ఈహోటల్‌కి మళ్లీ మేము ఎన్నడూ రా దలచుకోలేదే' అన్నాడు ఫిలిప్. ఆమాట నేను బోధ పరచుకున్నాకూడా రెనీ భాషాంతరీకరణంచేసిచెప్పింది. 'ఇక్కడకాదు. మనం మరెక్కడైనా మళ్లీ కలుసు కుందాం' అన్నాను. వాళ్లు నాకు జవాబిచ్చేందుకు సందేహిస్తుంటే రెనీతో, 'నేనూ నీలాగే ఇంగ్లీషు లోనూ జర్మన్‌లోనూ చాలాపుస్తకాలు చదివినవాడిని. మనిద్దరం కలసి మాట్లాడుకోగలిగిన విషయాలు చాలా

ఉంటాయి. నాకు కూడా ఇంగ్లీషుకవులంటే ప్రాణం ... రేపు మీరిద్దరూ వస్తే ఎక్కడైనా టీపుచ్చుకుని తర్వాత సినిమాకి వెళ్దాం' అన్నాను. రెనీ 'సరే' నంది. ఫిలిప్‌కి బోధపరచింది. ఫిలిప్‌కూడా నాకేసి తీక్షణంగా చూస్తూ సరేనని తలఊపేడు. మొన్నాడు ఎక్కడ కలుసుకునేదీ స్థిరపరచుకొని వాళ్లతోవని వాళ్లూ, నా తోవని నేనూ వెళ్తూ విడిపోయాం...... హోటల్‌లో మళ్లీ ఫిలిప్‌గురించీ, రెనీగురించీ మాట్లాడేం. యజమానీ, అతని భార్యాకూడా ఫిలిప్ చాలామంచివాడిలా కని పిస్తాడనీ, రెనీ చాలా గయ్యాళిలా కనిపిస్తుందనీ అన్నారు. వాళ్లతో వాదించడం ఇష్టంలేక 'అవున'న్నాను.

మొన్నాడు రెనీ ఫిలిప్ నేనూ కలుసుకున్నప్పుడు ముందటిరోజువిషయా లేమీ మాట్లాడలేదు. రెనీ ఎంతో నవ్వుతాలగా మాట్లాడడం మొదలెట్టింది నాతో. ఫిలిప్‌కూడా కొంతటీతాగేక సరదాగా కబుర్లుచెప్పేడు. వీళ్లు చిన్నప్పటినుంచీ ఒకరినొకరు ఎరుగుదురట. ఫిలిప్‌కి రెనీఅంటే అనేకసంవత్సరాలబట్టి గొప్ప ప్రేమ. ఫిలిప్ తండ్రి వర్తకుడు. అంత మరీ ధనవంతుడుకాడు కాని ధనవంతుడే. రెనీ తండ్రి బీదవాడు. రెనీకి కొంత చదువు చెప్పించాడుకాని, ప్యారిస్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించడానికి డబ్బులేక మానేసింది. ఉద్యోగానికి ప్రయత్నంచేస్తోం దిప్పుడు. చదువంటే చాలాఅభిలాష. తంటాలుపడి ఇంగ్లీషు భాషా, జర్మన్‌భాషాకూడా నేర్చుకుంది. ఫిలిప్‌తండ్రికి రెనీసంగతి తెలుసును. పేదకుటుంబంలో పుట్టినదని రెనీతో తిరుగవద్దని ఫిలిప్‌ని ఆజ్ఞాపించాడు. ఫిలిప్ సరేనని ఒప్పుకుని దొంగతనంగా ఇలా రెనీతో కాలం గడుపుతున్నాడు. తనచేతిలోఉంటే రెనీని వెంటనే పెళ్లిచేసుకునేందుకు సంసిద్ధుడై యున్నాడు. కాని ఇవి వచ్చేఆస్తులు వదులుకోవలసిన రోజులుకావు. వాళ్లబాధలకంతా ఇదే మూలకారణం. ...'ఇక నీసంగతో?' అన్నారు. చెప్పవలసిన దేదో చెప్పేను. కానేపయాక మాటలసందర్భంలో 'ఈసారి ప్యారిస్‌లో ఏమిటోకాని నాకేమీ తోచడం లే'ద న్నాను. రెనీ నాకేసి నవ్వుతూ 'ప్యారిస్‌నగరంలో అంతతోచకపోవడం, అంత ఒంటరిగా ఉండడం ఎందువల్లను?' అంది. 'నాకు ఫ్రెంచి బాగారాదు సరిగదా, నేనంత సులభంగా మనుష్యులతో స్నేహంకూడా చెయ్యలే'నన్నాను. 'ఇక్కడ కన్నుగీటితే కోటి కాంతలే!' అంది. కన్నుగీటడంలో నాకంత అభ్యాసం లేదనీ, అయినా కన్నుగీటుకి వెంటబడే కాంతలంటే నాకంత అభిప్రాయంలేదనీ చెప్పేను. 'నువ్వు మేధావంతుడవని కనిపెట్టి ప్యారిస్‌లో స్త్రీలందరూ నిన్ను ప్రేమించాలని కాబోలు నీ ఉద్దేశ్యం' అంది రెనీ వెంకితనంగా. 'అంత తలతిరుగుడివాడిలా కనిపిస్తున్నానా?' అనడిగేను.

పత్రికలో ప్రకటనలు చూసి వెళ్తే సినిమా ఏదో నిశ్చయించుకున్నాం. టిక్కెట్లుకొని లోపలికిపోతుంటే రెనీకీ నాకూ మధ్యని కూర్చోబోయాడు. పాశ్చాత్యదేశాలలో ఇద్దరుపురుషులతో ఒకస్త్రీవస్తే ఆస్త్రీ ఇద్దరిపురుషులమధ్యనీ కూర్చోవాలి. లేకపోతే అందులో ఒకరిని అమర్యాదచేసినట్టు. రెనీ వెంటనే ఫిలిప్‌ని పక్కకివెళ్లమని తను మధ్యని కూర్చుంది. ఇద్దరూ కొంచెం వాదించుకున్నారు. నేనేమీ చూడనట్టూ, విననట్టూ నటించాను. కాని జరిగినదేమిటంటే ఆ నిముషంనుంచి ఫిలిప్ నాతో సరదాగా మాట్లాడడం మానేసేడు. దానికి బదులు రెనీ తో మరీచనువుగా మాట్లాడడం మేమిద్దరం అంతసేపూ ఇంగ్లీషులో మాట్లాడుతూఉండడం ఫిలిప్‌కి నచ్చడం లేదు. నిముషనిముషానికీ రెనీని మాట్లాడేదేమిటని అడుగుతూవచ్చాడు. కొన్నిసార్లు సావధానంగా జవాబిచ్చింది. ఆఖరాఖరికి తనకి విసుగుపుట్టింది. చివరకి నాకేసి తిరిగి, 'మనం ఇంగ్లీషులో ఏమేమి రహస్యాలు చెప్పేసుకుంటున్నామో అని అనుమానపడిపోతున్నాడు ఫిలిప్' అంది. త నామాట అనేసరికి నాకు సిగ్గేసింది. తనస్నేహితుడిని ఈమాత్రానికే ఇరవైనాలుగుగంటలు మాత్రమే ఎరుగున్న నాదగ్గర అంతమలకనచేసేస్తోందని కొంతకోపంకూడా వచ్చింది. నాఆశ్చర్యం అంతతో నిలిచిపోలేదు. రెనీ సంవత్సరాలకొలదీ ఎరుగున్న స్నేహితుడిలోలాగ ఫిలిప్‌గురించి నాతో మాట్లాడడం మొదలెట్టింది. కవిత్వం అన్నా, కళలన్నా ఫిలిప్‌కి

ఏమీ బోధపడదంది. ఫిలిప్‌కి రెండే ముఖ్యమట-డబ్బూ, రెనీ. తను మరొకరితో, ఆడవాళ్లయేది మొగవాళ్లయేది, స్నేహంగా ఉండడం ఫిలిప్ సహించలేడట. చాలా మంచివాడే కాని ఇలాంటిగుణాలు చూస్తే అప్పుడప్పుడు చిరాకుగా ఉంటుందంది. నాకా మాటలు వింటుంటే రెనీ ఇద్దరితో సహవాసం కలుపుకోడం చాలా తెలివి తక్కువ అనిపించింది. 'అంత నచ్చనివాడయితే, ఫిలిప్‌కి తను స్త్రీ పురుషుడి కివ్వగలిగినంత చనువూ ఇచ్చేసిందే, ఎలా ఇవ్వగలిగిందా?' అని బోధపరచుకునేందుకు ప్రయత్నించేసేను. తర్వాత, ఈవిషయాలన్నీ అటుపక్క ఫిలిప్‌ని పెట్టుకుని నాతో ఎందుకు చర్చించాలి? ఆగలేక అడిగేసేను.

"నిన్న నే మొదటిసారిచూసిన నాతో ఈసంగతులన్నీ ఇంతవివరంగా చెప్పడంలో న్యాయం ఏమిటి?"

నే నాప్రశ్న వేసేసరికి నావైపు అతిదీనంగా చూసింది రెనీ.

"నిన్ను చూసినప్పటినుంచీ నువ్వు నన్ను సరిగ్గా బోధపరచుకోగలవని పొరపాటున ఆశపడ్డాను." అంది.

"ఎవరైనాసరే ఒక్కరోజులో ఎవరినైనా బోధపరచుకోగలరా?"

"నీకూ నాకూ ఇష్టాయిష్టాలన్నీ చాలావరకు సమానం అని తోచింది. మరొకమాట. ప్యారిస్‌కివచ్చి వీథిలో వారకాంతల వెంటబడని విదేశీయులంటే ఎవరికైనా గౌరవమే."

"నేనెన్నడూ వారివెంట బడలేదని నీ కేమిటి ధైర్యం?"

"నాకు తెలుసును...అదికాక ఆంగ్లేయ కవుల గురించీ, జర్మన్ గ్రంథకర్తల గురించీ నాతో మాట్లాడ గలిగినవాడవు ఇన్నాళ్లకి నువ్వొకడవు కనిపించావు... నేను ప్యారిస్‌లో గొప్పవాళ్లనికాని, చదువుకున్నవాళ్లని కాని ఎవరినీ ఎరగను......ఇవన్నీ అటుండగా, నా లూవ్రేచిత్రపటాన్ని నువ్వుకూడా పొగడడం సామాన్యమైన వింత కాదు. ఇప్పుడుకూడా, నిజంగా, ఫిలిప్ కంటె నువ్వే నన్ను బాగా బోధపరచుకోగలవని నా నమ్మకం."

రెనీ చెప్పేది యథాతథంగా నిజమని నేనప్పుడు గ్రహించాను. నిజం కనుక నే తనతో పరిచయం వృద్ధి పరచుకునేందుకు నాకూ ముందటిరోజున కోరిక కలిగింది. కాని ఇది చాలా హానికరమైన స్థితి అని కనిపెట్టేను. మరొకవారంరోజులు రెనీకీ ఫిలిప్‌కీ మధ్యని నే నున్నానంటే వాళ్లిద్దరూ పోట్లాడి విడిపోతారని నాకు తెలుసును. ఈసాయంత్రం గడచినతర్వాత రెనీని నే నెన్నడూ కలుసుకోకూడదని గట్టిగా నిశ్చయించుకున్నాను. మనుష్యమాత్రులమే కనుక ఆలోచించుకోకుండా ఎంతమందిజీవితాలు నిరర్థకం చేస్తామో మనకే తెలియదు. ఈవిషయంలోమట్టుకు నేను కళ్లు మూసుకుని గోతిలో పడకూడదనుకున్నాను.

సినీమాలోంచి ముగ్గురం వచ్చేసేం పైకి. నాకోరిక నెరవేర్చి నాతో సినీమాకి వచ్చినందుకు వాళ్లిద్దరికీ నా వందనాలర్పించాను. అదయాక చటుక్కున 'నాకు వేరేపనుంది. నేను పోవా'లన్నాను. రెనీ నాకేసి ఆశ్చర్యంగా చూస్తూనుంచుంది. ఫిలిప్ "మళ్లీ ఎప్పుడు నిన్ను చూడడం?" అన్నాడు. ఈలోకంలో ఇలాగే అన్నీ అనుకోనట్టు జరుగుతాయి. మాట్లాడకుండా ఇద్దరూ వెళ్లిపోతా రనుకున్నాను. ముందుగా మాట్లాడినది ఫిలిప్!

"నేను రేపే లండన్ వెళ్లిపోతున్నాను."

"అప్పుడేనా?" అంది రెనీ.

"నువ్వే మమ్మల్ని టీకి, సినీమాకి పిలిచావు కాని, నిన్ను మేము పిలవనక్కరలేదా?" అన్నాడు ఫిలిప్. రెనీ ఆమాటే నాకు ఇంగ్లీషులో చెప్పింది.

"ఈవిషయంలో అంత కట్టుబాటేమిటి?... పరవాలేదు. మళ్లీ ప్యారిస్ వచ్చినప్పుడు నాకీమర్యాదలన్నీ చేద్దురు గాని."

"వీలులేదు. రేపుసాయంత్రం నాలుగుగంటలకి ప్లేస్ డి లా మేడలైన్ దగ్గర మమ్మల్ని కలుసుకోవాలి" అన్నాడు ఫిలిప్.

"కాని రేపుప్రొద్దున్న నేను వెళ్లిపోతున్నాను."

"రేపు వెళ్లేందుకు వీలులేదు" అంది రెనీ.

"సరే" అన్నాను.

మొన్నాడు నాలుగుగంటలకి అనుకున్నచోట సిద్ధం నేను. నాచేతిలో రెండు పుస్తకాలున్నాయి. మొదటిది గాంధీమహాత్ముని స్వీయచరిత్రం. రెండవది రవీంద్రుని గీతాంజలి. ప్రొద్దున్న తిరుగుతుంటే ఒక పుస్తకాలకొట్టులో ఈరెండూ కనబడ్డాయి. రెనీ కివి కొని బహుమానంగా ఇవ్వాలని బుద్ధిపుట్టింది. వెంటనే కొన్నాను. రెనీ వీటిని చూసి చాలా సంతోషిస్తుందని నాకు తెలుసును. ఫిలిప్‌తో రెనీ వచ్చేసరికి పది నిముషాల ఆలస్యం అయింది. ఆలస్యానికి క్షమించమన్నాడు ఫిలిప్. రాగానే నాచేతిలో ఉన్న పుస్తకాలు చూపెట్టి 'అవి ఏమిటి?' అనడిగింది రెనీ. 'నువ్వు చూడవలసినవి కావు' అన్నాను.

"అందుకే చూపించు."

"తర్వాత చూపిస్తాను."

ఒక 'కఫే' లో కూర్చుని టీ తాగుతుండగా రెనీ కాపుస్తకాలు చూపించాను. నేను వాటిని తనకే కొన్నానని లోపలివ్రాత చూడగానే పరిమితిలేని ఆనందం వెల్లడిచేస్తూ, 'నువ్వింత మంచివాడవని నేననుకోలేదంది.

ఫిలిప్ కొంచెం ఈర్ష్య దాచీదాచుకోనట్టు వెంకితనంగా, 'రెండుపుస్తకాలూ రెనీకే అయితే నాకేమిటి?' అన్నాడు.

"పుస్తకాలు రెనీవి రెనీ నీదీ." అన్నాను.

ఇద్దరూ నవ్వుకున్నారు. ఫిలిప్ ఆసరదాలో రెనీభుజంమీద తనచెయ్యి వేసేడు. ఫిలిప్‌కేసి చూడకుండా ఆచెయ్యి తొలగించుకుని, రెనీ "సరిగ్గా నాకివ్వవలసిన పుస్తకాలే ఇచ్చావు నువ్వు......నిజంగా చెప్తున్నాను, నిన్ను సంతోషపెట్టాలనికాదు, ఎన్నేళ్లబట్టో ఇండియాదేశం చూడాలని నాకు గొప్ప ఆశ. ఈజన్మలో తీరని కోరికలలో అదొకటి." అంది.

"ఆచెల్లని కోరికలలో మిగిలినవి ఏమిటి?" అనడిగేను అల్లరికి.

రెనీ జవాబుచెప్పలేదు.

"ఏదైనా నాటకానికి కాని, సినీమాకి కాని వెళ్దామా?" అన్నాడు ఫిలిప్.

వద్దన్నాను నేను. రెనీకూడా వద్దంది. మరేమిటి చెయ్యడం అని ఆలోచిస్తే, రెనీ ఏదైనా తోటలోకి వెళ్లి కాసేపు నడచి ఎక్కడైనా కూర్చుందాం అంది. బోయ్‌దిబొలోన్ అన్నచోటికి వెళ్లేం. సరదాగా మాట్లాడుతూ చీకటిపడేవరకూ నడిచేం. ఆఖరికి నేను వెళ్లిపోవాలంటే కాసేపు అక్కడ బల్లలమీద కూర్చుని తర్వాత వెళ్లిపోదాం అంది రెనీ. చీకటిలో ఒకబల్లమీద ముగ్గురం కూర్చున్నాక రెనీ మౌనం దాల్చింది. నేనూ ఫిలిప్‌ముట్టుకు మాట్లాడుకుంటున్నాం. నాతప్పుఫ్రెంచితోటే తంటాలు పడుతున్నాను. అప్పుడప్పుడు రెనీచేత తప్పులు దిద్దించి నామాటలు ఫిలిప్‌కి బోధపడేటట్టు చేస్తున్నాను. మొన్నాడు నేను లండన్‌కి వెళ్తున్నానన్నాను. ఫిలిప్ నన్ను లండన్‌గురించి అనేకప్రశ్నలు వేస్తున్నాడు. రెండుమూడు నెలలలో తనక్కడకి వస్తానన్నాడు. 'రెనీకూడావస్తుందా?' అనడిగితే 'నాకు లండన్‌తో పనేమిటి?' అని జవాబిచ్చింది. ఇలా ఉండగా కొంచెందూరంలో 'ఫిగారో! ఫిగారో!' అని ఒకప్యారిస్‌పత్రికని అమ్ముతూ కుర్రాడు కేకలువేస్తున్నాడు. రెనీ ఫిలిప్‌ని వెళ్లి ఒక పత్రికకొని తెమ్మంది. 'వెళ్లిపోతూ తోవలో కొనవచ్చు' నన్నాడు ఫిలిప్. తర్వాత పత్రికలు మిగులుతాయో లేదో ఇప్పుడే కొనమంది. నేను వెళ్లికొంటానని లేచేసరికి, వద్దని తనే విధేయుడిలా లేచివెళ్లేడు ఫిలిప్.

అతను కొంతదూరంవెళ్లగానే నారెండుచేతులూ గట్టిగా తనరెండుచేతులలోనూ పట్టుకుంది రెనీ.

"నువ్వు రేపువెళ్లడానికి వీలులేదు... మొన్నాటికీ వీలులేదు" అంది.

"ఇదేమిటి రెనీ?" అన్నాను నిర్ఘాంతపోయి.

...లులేదు. నువ్వు లేకపోతే నేనుండలేను... నువ్వు వెళ్లకు ...రేపు మధ్యాహ్నం ఒంటిగంటకి మాల్ మెయ్‌సాన్ రాజభవనందగ్గర నువ్వుండాలి. నేను వస్తా నక్కడికి ...లండన్‌కి వెళ్లనని, అక్కడికి వస్తానని నాకు వాగ్దానం చెయ్యి. వస్తావా?... అదుగో, ఫిలిప్ వచ్చేస్తున్నాడు. ...వాగ్దానంచెయ్యవూ ?"

నేను వాగ్దానంచెయ్యలేదు. నాదగ్గరనుంచి దూరంగా జరిగి కూర్చుంది.

ఫిలిప్ వచ్చి 'ఇదిగో నీపత్రిక' అన్నాడు.

ఇంతమౌనంగా కూర్చున్న రెనీ మళ్లీ యథాప్రకారంగా హాయిగా "ఏమైనా ప్రత్యేకమైన విశేషాలున్నాయా, ఫిలిప్, ఈరోజుపత్రికలో?" అంది.

"నేనింకా చూడలేదే" అన్నాడు ఫిలిప్.

కాసేపయాక వెళ్లిపోవాలని లేచేం. మళ్లీ నేను ఫిలిప్‌తో రేపు లండన్‌కి వెళ్లిపోతున్నానని చెప్పేను. నేనెక్కడ నివసిస్తున్నానో కూడా చెప్పేను. ఒకచిన్న పుస్తకంలో వీధివెలుతురు బట్టి నావిలాసం వ్రాసుకున్నాడు. రెండుమూడునెలలలో నన్ను లండన్‌లో చూస్తానన్నాడు. రెనీతో కూడా వెళ్లిపోతున్నానని చెప్పేను. ప్యారిస్‌కివస్తే తనమాట మరచిపోవద్దంది. తనెక్కడుంటోందో నాకు తెలియదంటే 'తెలియకేం చేస్తుందిలే!' అని సమాధానం చెప్పింది.

ఇకను విడిపోబోతుంటే నన్ను రెనీ, "అన్నట్టు, ప్యారిస్ అంతా చూసేనంటావు. మాల్ మెయ్‌సాన్ రాజభవనం ఎప్పుడైనా చూసేవా?" అనడిగింది.

"రెండుమూడుసార్లు చూసేను."

"చూడలేదేమో అనిఅడిగేను...చాలాఅందంగా ఉంటుంది కామా?"

"అవును."

ఆరాత్రంతా ఆలోచించాను మొన్నాడు ప్రొద్దున్న లండన్‌కి బయలుదేరి వెళ్లిపోవడమా లేదా అని. మొదట వెళ్లిపోదామని నిశ్చయించుకున్నాను. నేను తప్పకుండా ఉండిపోతాననీ, మొన్నాడు ఒంటిగంటకి కలుసుకుంటాననీ రెనీ దృఢంగా నమ్ముకొందని నాకు తెలుసును. తను ఏదడిగితే అది చేసేందుకు నేను సిద్ధంగా ఉన్నానని రెనీకి ఈధైర్యం ఎందుకుండాలని నాకు పౌరుషం కలిగింది. సాయంత్రం ఆఖరిని మళ్లీ నన్ను మాల్ మెయ్‌సాన్‌గురించి ప్రశ్న వెయ్యడం ఒట్టిపెంకితనమూ గర్వమూ కాక మరేమీ కాదని చికాకుపడ్డాను. లండన్‌కి వెళ్లిపోవాలి నేను. తప్పదు...............

మళ్లీ, ఒంటిగంటకి మొన్నాడు మాల్ మెయ్‌సాన్ ప్రాంతాలలో నాకోసం ఎంతో అపేక్షతో కాచుకుని ఉంటుందని ఆలోచిస్తే జాలివేసింది. ఫిలిప్‌తో తనకేమీ సరియైన ఆనందంలేదు. నిజమే. అంతసున్నితమైన స్వభావం కలదానిని ఫిలిప్ బోధపరచుకోలేడు. అయినా, నేనేమీ చిక్కులలో పడకూడదు. జాగ్రత్తగా కొంతసేపుమాట్లాడి వచ్చెయ్యాలి. పరవాలేదు. ఆమాత్రం నేను చూసుకోగలను — నేనిచ్చిన పుస్తకాలు చూసుకుని చిన్నపిల్లలా ఎంతసంతోషించింది! పాపం, వెళ్లి చూడకపోతే తప్పు.

మొన్నాడు లండన్‌కి నేను బయలుదేరలేదు. ఒంటిగంటదాటిన కొన్నినిముషాలలో మాల్ మెయ్‌సాన్‌ప్రాంతాలకి జేరుకున్నాను. ఒక చక్కనిగవును తొడుక్కుని రెనీ నాకోసం ఎదురుచూస్తోంది. దగ్గరకి వెళ్లేను. నేనువచ్చినందుకు తనముఖంలో ఏమీ సంతోషం చూపెట్టలేదు. చూడగానే మాట్లాడనైనా లేదు. దగ్గరలో ఒకహోటల్ ఉంటే 'అక్కడికి వెళ్లికూర్చుందాం రా' అంది. ఇద్దరం అక్కడికి వెళ్లి కుర్చీలలో కూర్చున్నాం. నేనేమీ మాట్లాడలేదు. రెనీకేసిచూస్తూ కూర్చున్నాను. రెనీ అంతసేపూ నాకేసి చూడకుండా ఉండేందుకు ప్రయత్నం చేస్తోంది. ఆఖరికి తనే మాట్లాడింది.

"ఒంటిగంటదాటేక నువ్వికరావేమోనని బెంగ పెట్టుకున్నాను."

"అవును. ఆలస్యం అయింది. కాని నాతప్పు కాదు."

"నువ్వు రాకపోతే నేనివాళ ఏంచేద్దునో నాకే తెలియదు."

ఇంతట్లో హోటల్ వాడువచ్చి ఏమి కావాలని అడిగేడు. తినేందుకేవో కొన్ని పదార్థాలు తయారు చెయ్యమన్నాం. వాడు వెళ్లిపోయాడు.

ఇంకా రెనీ నాకేసి చూసేందుకు సిగ్గుపడుతోంది. నేనప్పుడు, "రెనీ, నువ్వు నన్నీవాళ ఎందుకు రమ్మన్నావో తెలియదు కాని, నేను రాకుండా ఉండేందుకు చాలా ప్రయత్నం చేసేను నాకిదేవీ బోధపడడం లేదు." అన్నాను.

"నువ్వలా ప్రయత్నం చేస్తావని నాకు తెలుసును. నిన్నరాత్రంతా నాకు నిద్రలేదు. నువ్వు రావేమోననే నా బెంగ. నువ్వు..." ఇకను మాట్లాడలేకపోయింది. బల్లమీద తలవాల్చేసి ఏడవడం మొదలెట్టింది.

"ఏడవకు, రెనీ. ఎందుకిలా ఏడుస్తావు? నేనన్నమాటలేమైనా నీమనస్సునొప్పిస్తే నన్ను క్షమించు."

"నీ మాటలకని కాదు."

"మరేమిటి?"

"నీకు... నేనంటే... లెఖ్ఖలేదు."

"రెనీ, మరొకరయితే నేనీవాళ లండన్‌కి వెళ్లకుండా ఉండిపోదునా?"

"నేనంత పోరుపెట్టేను కనుక ఉండిపోయావు."

"నిజమే. మరొకరు పోరుపెట్టినా ఉండక పోదును."

కళ్లు తుడుచుకుంది. తనచెయ్యి నాచేతిమీద వేసి ఎంతో మృదువుగా నావేళ్లన్నీ తడిమింది.

"నన్నింకా బోధపరచుకోలేక పోతున్నావు" అంది.

"నిన్ను బోధపరచుకోలేక కాదు. నాకిదంతా నచ్చడం లేదు...నిన్నూ నన్నూ ఇప్పుడు ఫిలిప్ చూస్తే ఏమనుకుంటాడు?"

"ఫిలిప్ ఏమనుకున్నా నాకింక పరవాలేదు."

"అలా అనకు. ఫిలిప్‌కి నువ్వంటే ఎంతో ప్రేమ."

"నీకు లేదు."

"నాకు లేదని కాదు. నా ప్రేమ మరొకరకం. నువ్వంటే నాకు అమితమైన స్నేహభావం. ఈసారి వచ్చి నిన్నింటూ ఒకత్తెని కలుసుకున్నందుకు నాకెంత సంతోషంగా ఉందో నువ్వు ఊహించలేవు. కాని... అంతే. ఫిలిప్ ప్రేమ అలాంటిదికాదు."

"నాతో ఫిలిప్‌గురించి మాట్లాడేందుకా ఇక్కడికి వస్తే నువ్వు?"

"అందుకే."

"అయితే మళ్లీ వెళ్లిపో. ఫిలిప్ సుగుణాలన్నీ నువ్వు నాకు వర్ణించనక్కరలేదు. నీకంటె ఫిలిప్‌ని నేను బాగానే ఎరుగుదును."

"నువ్వెరగవని కాదు...అయినా, రెనీ, నీ ఉద్దేశ్యం ఏమిటి? ఎందుకింత బాధపడిపోతున్నావు నువ్వు?"

"నేనేమీ బాధపడడం లేదు."

"మరిఏమున్నా ఇదంతా ఏమిటి?"

"నిన్ను మళ్లీ చూడకుండా ఉండమంటే ఉండలేను...నువ్వేమిటి చెయ్యమంటే అదిచేస్తాను. ఏమిటి చెయ్యమంటే అది...కాని, నిన్ను మట్టుకు నేనెప్పుడూ చూస్తూవుండాలి."

"నామాతృదేశం ఇక్కడెక్కడా లేదని నీకు తెలుసునా?"

"నేనదంతా ఇప్పుడు ఆలోచించ దలచుకోలేదు."

"పోనీ, నాశరీరచ్ఛాయ చూడు. నల్లని నలుపు...నీకూ నాకూ స్నేహం ఉండొచ్చును కాని మరే సంబంధానికీ వీలులేదు."

"నన్ను పెళ్లిచేసుకోమని బ్రతిమాలుకోడం లేదు నేను."

"రెనీ, ఫిలిప్ నిన్ను నిజంగా సుఖపెట్టగలడు. మరేవిధంగానూ నీకు సుఖంలేదు. నువ్వు మోసంచేస్తే ఫిలిప్ భరించలేడు."

"ఫిలిప్ కోసం అనే అంత బెంగ నీకు? ...నేను కాకపోతే నావంటివారు లక్షమందున్నారు ఫిలిప్‌కి.

"ఫిలిప్ కోసం అనికాదు బెంగ. నీకోసమే."

ఇంతట్లో హోటల్‌వాడు తినేందుకూ తాగేందుకూ అన్నీ బల్లమీద తెచ్చిపెట్టేడు.

తింటుంటే మధ్యలో రెనీ నన్నొక విచిత్రమైన ప్రశ్న అడిగింది. "నిజం చెప్పు, నేను నీకు నచ్చినంత అందంగానూ లేనా?" నాకు నవ్వొచ్చింది.

"నీ అందానికి లోటులేదు. నీ తెలివితేటలకి అంతకంటే లోటులేదు. ఎవరిలోనైనా అందంకంటె తెలివితేటలు నన్నెప్పుడూ ఎక్కువ సులభంగా లోబరచుకుంటాయి" అన్నాను.

తినడం అయ్యాక ఇకనేమిచెయ్యాడం అన్న చర్చ వచ్చింది. "మాల్ మెయ్‌సాన్ భవనం వెళ్లి చూద్దాం" అన్నాను. "దరిద్రంగా ఉంటుంది. మరెక్కడికైనా వెళ్దాం" అంది రెనీ. మిగిలినచోట్లగురించి ఆలోచించడంలో ఒకరికినచ్చినది మరొకరికి నచ్చలేదు. ఆఖరికి నేను "లూవ్రే చిత్రశాలకి వెళ్దాం" అన్నాను.

"లూవ్రేకా? ......ఫిలిప్ కనబడతాడేమో."

"అయితేవద్దు."

"పరవాలేదు. లూవ్రేకే వెళ్దాం. పద." ......తోవలోనూ, లూవ్రేలోనూ మళ్లీ రెనీ నాతో అన్ని సంగతులూ అతిసరదాగా మాట్లాడింది. మిగిలినమాటలు మాట్లాడుతూ మధ్యమధ్యని నన్నింకా ప్యారిస్‌లో ఒక వారం అయినా ఉండిపొమ్మని బతిమాలుకునేది. ఆలోచిస్తానని జవాబిస్తూ వచ్చాను. ఒకచోట అమూర్ ఆండ్ సైకీ (అనగా పాశ్చాత్యరతీమన్మథుల) చిత్రంచూపించి, 'అదెంతబాగుందో చూడు' అంది. అదిచూస్తుంటే చటుక్కున నాచెయ్యిపట్టుకుని ప్యారిస్‌లో ఇంకా కొన్నిరోజు లుండిపోతానని వాగ్దానం చెయ్యమంది. చుట్టూ ఎటుప్రక్క చూసినా మనుష్యులు మరెవరూ కనుచూపుమేర చూపులో లేనట్టు నాకేసి అతిప్రేమోద్రేకంగా చూస్తోందిరెనీ. నాకు సిగ్గేసింది. చెయ్యి విడిపించుకుని "మరొకమూడురోజులు తప్పకుండా ప్యారిస్‌లో ఉంటాను. అపైని నేను మాటివ్వలేను" అన్నాను. 'సరే' అంది. మరొకచోట "మూడురోజులూ ఉంటానన్నావుసుమా. మాట నిలబెట్టుకోవాలి మర్యాదస్థుడిలా" అంది.

"వాగ్దానంచేసేక నిలబెట్టుకోక ఏంచేస్తాను?" ఆవేళ నాలుగుగంటలకి తను వెళ్లిపోవాలంది. "ఫిలిప్‌ని చూడడానికా?" అంటే 'అవు'నంది. మళ్లీ కాసేపుండి, "నువ్వివాళ ఫిలిప్‌ని వెళ్లిచూడొద్దంటే మానేస్తానుసుమా" అంది.

"తప్పకుండా వెళ్లి చూడు."

"ఎప్పుడో ఒకప్పుడు త్వరలోనే మేమిద్దరం విడిపోకమానం. కాని సంగతంతా ఫిలిప్‌కి కొంచెకొంచెంగా బోధపరచాలని నా ఉద్దేశం. ఒక్కసారిగా చెప్పడం నాకిష్టంలేదు ...నువ్వు వెళ్లమంటే నే వెళ్తాను. ఏమంటావు?......నన్నికను ముట్టుకోనివ్వను ఫిలిప్‌ని."

ఆమాటలు వింటుంటే నేనేంచేస్తున్నానో నాకే బోధపడలేదు. లోలోపలినుంచి కంగారు పుట్టుకొచ్చింది. పైకి తాపీగా ఉన్నట్టు నటించాను.

ఇంతట్లో హెన్నర్ యొక్క చదువరి అన్న చిత్రపటందగ్గరకి వచ్చాం. రెనీ నావీపు తట్టింది.

"అదుగో, చూడు"

"రెనీ, నువ్వూ నేనూ తప్ప దీనినెవరూ పొగడలేదంటావా?"

"లేదు. నిజానికి ఇది మనిద్దరిదే."

"అయితే పట్టుకుపోదామా?"

"ఇక్కడ చూసేందుకెవరూ లేకపోతే అంత పనికీ నేను సంసిద్ధురాలనే... ...ఏరాత్రైనా మనిద్దరం వచ్చి దొంగిలిద్దాం. చాలా దురాలోచనంటావా?"

"దురాలోచనా దూరాలోచనాకూడాను ...రెనీ, ఇకమీదట నువ్వు జ్ఞాపకంవచ్చినప్పుడల్లా ఈచిత్రపటం కూడా జ్ఞాపకం వస్తుందినాకు."

"ఎందువల్ల?"

"రెండురోజులక్రిందట నువ్వూ నేనూ కూడా అన్నాం, జ్ఞాపకం లేదూ? ఈచదువరిని చూస్తే మనో వికారాలేవీ పుట్టవు. చిత్రకారుడు చిత్రించిన శరీరంలో కంటె చిత్రకారుడిలో ఉన్న కవి ఉద్దేశించిన మన స్సౌందర్యంలో ఎక్కువ శోభ కనిపిస్తోంది."

"అదంతా బాగానే ఉందిలే. కాని నేను జ్ఞాపకంవచ్చినప్పుడల్లా ఇదెందుకు జ్ఞాపకం రావాలి?"

"ఏమో, చెప్పలేను...నిన్ను చూస్తే కూడా నాకు స్వచ్ఛమైన ఆనందమే కాని మనోవికారం లేదు కనుక నేమో."

"నిజంగా? నేను నీకంత అందవికారంగా కని పిస్తున్నానా? నీకు మనోవికారం కలుగలేదంటే అది నాలో అందవికారం అన్నమాటే."

"నువ్వా అందవికారివి?"

"నాచిన్నప్పుడు అందరూ నేను చాలా అం దంగా ఉండేదాన ననేవారు."

"ఇప్పుడు నువ్వందంగా లేవనా, నువ్విప్పుడు చిన్నదానవు కావనా!...అందానికేం కాని నాలుగు గంటలయిపోతోంది."

"అప్పుడే? అవును. నేను వెళ్తాను. మళ్లీ రేపు...పన్నెండు గంటలకే ఈవాళ కలుసుకున్న చోటనే కలుసుకుందాం. ఏమి?"

"సరే."

"నన్ను మోసపుచ్చకు సుమా...పన్నెండు గంట లకి...నిజంగా నువ్వు నన్ను ప్రేమించకపోతే నాజీవితం అర్థంలేనిదై పోతుంది...అలా నవ్వకు. వేళాకోళం కాదు."

"రెనీ, ఇప్పుడు వెళ్లేముందు నీవిలాసం నాకు తెలియచెయ్యి. నాది తెలుసును కామా?"

"ఇప్పుడు తొందరేమిటి? రేపుచెప్తాను...నాకు చెప్పకుండా వెళ్లిపోదాం అనుకుంటున్నావా? వద్దు సుమా...మర్యాదైన పనేనా అది?"

"ఈ అపనమ్మకాలన్నీ ఏమిటి, రెనీ? నీకు మాటిచ్చాక వెనక తియ్యను."

"సరే. రేపు పన్నెండుగంటలకి...వెళ్లనా?"

రెనీ వెళ్లిపోయింది. నేను ప్యారిస్ వీథులంటా మతిపోయినవాడిలా తిరిగితిరిగి ఎనిమిది గంటలకి హోటల్‌కి చేరుకున్నాను. ఏమీ భోజనం చెయ్యలేదు. నాగదికిపోయి బట్టలుమార్చుకోకుండానే దీపం ఆర్పేసి పక్కలో పడుకుని ఈరెండుమూడు రోజులలోనూ జరిగిన చర్యలన్నిటిగురించీ దీర్ఘంగా ఆలోచించాను. ఆలోచించినకొలదీ నాప్రవర్తనా, రెనీప్రవర్తనాకూడా చాలా అసందర్భం అనిపించాయి. నేను రోజురోజుకీ ఎక్కువ తెలివితక్కువగా సంచరిస్తున్నానని తోచింది. రెండురోజులక్రిందటే నేను లండన్‌కి వెళ్లిపోవలసిందను కున్నాను. రెనీ నన్ను చాలా ప్రేమిస్తోందన్నమాట నిశ్చయం. కాని రెనీ నాకెంతనచ్చినా, తనంటే నాకు తనకున్నటువంటి ప్రేమ లేదన్నమాట కూడా నిశ్చ యం. తను ప్రేమించినట్లు నేనెలా ప్రేమించగలను? ఇంకా నాలుగురోజులుకూడా కాలేదు ఫిలిప్ తనూ కలసి, నాలుగైదుగంటలు ఈగదిలోనే ఒంటరిగా గడిపి. మళ్లీ అలా వాళ్లిద్దరూ గడిపేరని నామనస్సులో ఎంత వెతికినా ఏమీ ప్రణయాసూయకూడా లేదు...ఏదో ఒకవిధంగా ఫిలిప్‌తో సంతృప్తిపొంది రెనీ సుఖంగా ఉం డాలనేనా ఉద్దేశ్యం. సుఖంగామట్టుకుండాలి, పాపం.

చెప్పకుండా మొన్నాడు ప్రొద్దున్న వెళ్లిపో దాం అని నిశ్చయించుకొన్నాను. దీపం వెలిగించి గడియారంలో చూస్తే పదకొండుగంటలయింది. మూడు గంటలలా చీకట్లో కొట్టుకున్నానన్నమాట ఈవిధంగా మనస్సు దృఢపరచుకునేందుకు. తెల్లవారగానే బయలు దేరాలి కనుక బట్టలూ అవీ సద్దుకోవలసినవి కొన్ని సద్దడం మొదలెట్టేను ఇంతట్లో ఎవరో నాగదితలుపు కొట్టేరు. భోజనం ఎందుకు చెయ్యలేదని అడిగేందుకు హోటల్ యజమాని వచ్చినట్టుందనుకుని, లోపలికి రావచ్చునని గట్టిగా చెప్పేను. వెనక్కి తిరిగి చూసేసరికి తలుపుతెరచి లోపలికి వచ్చినది—రెనీ.

"...ంటి, రవీ?"

"...పువెళ్లిపోవాలని పెట్టె సర్దేస్తున్నావా?"

"సర్దడం కాదు. అన్నీ పైనుండిపోతే పెట్టెలో ...తున్నాను. కాని, నువ్వెందుకు వచ్చినట్టిప్పుడు?"

"నిజంచెప్పు. రేపువెళ్లిపోదాం అనుకుంటున్నావా లేదా?"

"వెళ్లడానికి కాదు, రెనీ... నీకువెళ్లనని మాటిచ్చాక వెళ్లిపోతానా! ...సరేలే, అర్ధరాత్రి నాగదికి రావాలని నీ కెందుకు బుద్ధిపుట్టింది? ...ఏమి ...దారుణం?"

"నిజంచెప్పనా? నువ్వేమీ అనుకోకు. సాయంత్రం నీమాటలు కొన్ని జ్ఞాపకంతెచ్చుకుంటే నువ్వు నాకు తెలియపరచకుండా వెళ్లిపోదలచుకున్నావని అనుమానం కలిగింది. మళ్లీ వెళ్లొద్దని బ్రతిమాలుకుందుకు వచ్చాను."

"రెనీ, నీకు మతిపోయిందా?"

"అవును. మతిపోయింది."

"ఇలా అర్ధరాత్రి నాగదికి వస్తే హోటల్ యజమాని ఏమనుకుంటాడు?"

"ఏమనుకుంటే నాకేమిటి లెక్క?"

"ఇంతవరకూ నేను చాలామర్యాదస్థుడ ననుకుంటున్నాడు."

"తను అనుకుంటున్నంతకంటె కూడా చాలా మర్యాదస్థుడవని నేను బోధపరుస్తానులే. ...ఇలా నేను నుంచోవలసినదేనా? నీపక్కమీద కూర్చుంటాను."

"వద్దు, రెనీ. మనిద్దరం కూడా ఇప్పుడే పైకి వెళ్దాం. నిన్ను మీఇంటిదాకా దిగబెట్టి నేను మళ్లీ వచ్చేస్తాను."

"నన్ను వదలుగొట్టుకుందాం అని చూస్తున్నావు. నువ్వు ఉండిపొమ్మంటే ఈరాత్రంతా నీతోటే ఉండిపోదాం అనుకుని వచ్చాను. తెలుసువా?"

"ఆమాటఎలా అనగలిగేవు, రవీ? ఈగదిలోనే ఫిలిప్‌తో నాలుగుగంటలు స్వేచ్ఛగా నువ్వు కాలంగడిపి నాలుగురోజులుకూడా కాలేదు."

"ఆసంగతి నువ్విప్పుడు జ్ఞాపకంచెయ్యడం అంత్రమూరత్వం అదేకాని మరొకటి లేదు."

"అబద్ధం చెప్తున్నానా నేను?"

"ఫిలిప్ అంటే నాకింకా ప్రేమ మిగిలిపోయిందనుకుంటున్నావా?...ఫిలిప్‌ని నేనెన్నడూ అంతగా ప్రేమించలేదసలు ...ఈవాళ తనతో గడపిన ప్రతి నిముషం ఒకయుగంలా అనిపించింది. తనతో కూర్చున్నంతసేపూ నిన్ను గురించే ఆలోచిస్తూ ఉన్నాను."

"వెళ్దాం, రా, రెనీ."

"ఎక్కడికి?"

"మీఇంటిదాకా వస్తాను."

"అక్కడికి నువ్వువచ్చేందుకు వీలులేదు. ఏదైనా వనంలోకి వెళ్లి కూర్చుందాం."

"వద్దు, రెనీ. ఆలస్యంఅయిపోయింది. ...... అన్నట్టు నీవిలాసం చెప్పేవుకాదు. రేపు మళ్లీ అడగడం మరచిపోతానేమో నని."

"నువ్వా మరచిపోవడం? నావిలాసం చెప్పమని నువ్వడిగినప్పుడల్లా నువ్వు నాకు మళ్లీ కనబడకుండా వెళ్లిపోతావేమో నని భయం."

"అందుకు కాదు. ఇప్పుడు చెప్పితే పుస్తకంలో వ్రాసుకుంటాను"

"నేను రేపో ఎల్లుండో ఏదైనా పుస్తకంలో వ్రాసే ఇస్తానులే."

"నీఇష్టం. ఇకను వెళ్దాం. రా."

ఇద్దరం హోటల్ వదలి పైనపడ్డాం. కొంత దూరం వెళ్లేక రెనీ మళ్లీ 'ఎక్కడికైనా వెళ్లి కూర్చుందాం' అంది. ఇప్పుడు కాదని తప్పించుకున్నాను అయితే తను ఇంటికి వెళ్లిపోతానంది. స్టేషన్‌దాకా

నేను వస్తానంటే రావద్దంది. వెళ్ళిపోతూకూడా "ఇంకా నన్ను నువ్వు మోసపుచ్చి నాకు తెలియపరచకుండా వెళ్ళిపోతావనే నా బెంగ" అంది.

హోటల్‌కి వచ్చాక హోటల్ యజమానితో మొన్నాడు ప్రొద్దున్నే లండన్‌కి వెళ్ళిపోతున్నానని చెప్పేను. ఇవ్వవలసినడబ్బంతా ఇచ్చేసేను. రెనీ ఆరాత్రి రావడంగురించి కొంచెం సరదాగానూ, వేళాకోళంగానూ మాట్లాడబోయాడు. నేనేమీ సమాధానం చెప్పక పోయేసరికి మళ్ళీ ఊరుకున్నాడు. కాసేపయాక మాటలలో తనభార్యా పిల్లలూ నిద్రపోతున్నారని చెప్పేడు. వాళ్ళు లేవకుండానే వెళ్ళిపోతాను కనుక వాళ్ళందరికీ నా శుభార్పణ లివ్వమన్నాను.

మొన్నాడు బయలుదేరి లండన్ చేరుకున్నాను. ప్యారిస్‌నుంచి లండన్‌వరకూ ఒక్కటే ఆలోచన నాకు —రెనీ. ప్యారిస్‌లో రైలెక్కేటప్పుడు రెనీ ఆఖరినిముషాన్ని నా మోసం కనిపెట్టి స్టేషన్‌కి వచ్చేస్తుందేమో అన్న కంగారుతప్ప మరే ఆలోచనా లేదు. కాని లండన్ చేరుకుంటుంటే, రైలు విక్టోరియా స్టేషన్‌లోకి ప్రవేశించబోతుంటే రెనీగురించి ఆలోచిస్తూ దుఃఖం ఆపుకోలేక ఏడ్చేసేను.

ఆతర్వాత లండన్‌లోకూడా చాలారోజు లుండలేదు. అకస్మాత్తుగా నేను లండన్ వదలి ఇంటికి వచ్చెయ్యవలసొచ్చింది. రెనీగురించి ఇప్పటివరకూ మళ్ళీ ఏమాటా వినలేదు నేను..........

ఇది ఇండియా దేశం. ఇక్కడ స్త్రీప్రపంచంలో ఎటుపక్క చూసినా 'సిగ్గుదొంతర'లే, మురిముసుగులే, ఘోషాలే. ఇప్పుడు నాలోకం ఇదీ. రెనీ లోకం ఇది కాదు. అప్పుడప్పుడు సంధ్యాసమయాలలో కళ్ళుమూసుకొని రెనీగురించి ఆలోచిస్తే రెనీముఖం ఆముఖంలో నేనెన్నడూ చూడనటువంటి రౌద్రంతో చెదిరిపోయి కనిపిస్తుంది. నన్నిప్పటికింకా రెనీ క్షమించియుండదని విచారిస్తూ ఉంటాను. కాని ఎప్పుడైనా మిట్టమధ్యాహ్నం రెనీగురించి ఆలోచిస్తే ఫిలిప్‌ని తనుపెళ్ళి చేసుకొని ఉంటుందనీ, అయిదారుగురు పిల్లలకి తల్లయి నామాటే మరచిపోయి ఉంటుందనీ నాకు తోస్తుంది ...జీవించే ప్రతిజీవానికీ రెండు వ్యతిరేకమైన మనోగుణాలుంటాయి. ఒకమనోగుణానికి జీవనపరిస్థితులతో మైత్రి, రెండవగుణానికి జీవనపరిస్థితులతో వైరం. రెండూ ముఖ్యమే.

# దర్శనము

చావలి బంగారమ్మ

కూపంబులో బడి కుంగుచున్నాను
మేఘుంబులో మెరపు తొంగిచూచింది
కన్నెత్తి నేనట్టె కాంచబోయేను
పల్లెత్తి పలుకకే పారిపోయింది
అంధకారములోన అణగిపోయేను

మరల వచ్చెద నంచు పురిమి చెప్పింది
ఇదె కదా ధైర్య మం చెద నింపినాను
అదనంచు హర్షాశ్రు లదె వంపినాది
అదె యూతగా గొనుచు అట్టె లేచాను
అటు చూడ గనుపించె అతని వదనంబు.



విజయప్రబోధము

—తోట వేంకటేశ్వరరావు

# జ్ఞాపకం

ఏలేశ్వరపు కృష్ణమూర్తి

ఏవిషయమైనా బాగా జ్ఞాపకంవుంచుకోవడం మనలో ఓ గొప్ప శక్తి; మరచిపోవడంకూడా ఓ గొప్ప శక్తే. ఈశక్తులలో ఏది మరీగొప్పదనేవిషయం ముందుగా మరచిపోదాం. కాని చూస్తూచూస్తూ ఏ విషయం తీరా జ్ఞాపకంవచ్చాక మరచిపోలేమేమో. మనం ప్రత్యేకంగా కూర్చొని ఏదైనా జ్ఞాపకం చేసుకోవాలన్నపుడు జ్ఞాపకానికి రాదు. ఎత్రమేమిటోకాని, కొన్నివిషయాలు జ్ఞాపకం రావద్దన్నా జ్ఞాపకం అట్టే వుంటాయి. జ్ఞాపకం అనే ముక్క మనం వాడుతున్నామంటే పూర్వానుభవానికి కట్టుబడ్డామన్నమాట. ఇందులో పూర్వానుభవం ముందా, జ్ఞాపకం ముందా అంటే మనం జ్ఞాపకం లేదనాలి. కంటిముందు ఏవస్తువైతే మనకు పూర్వానుభవం కలుగజేసిందో ఆవస్తువు లేకపోయినా, అనుభవస్మరణ కలుగజేసేది స్మృతి. స్మృతిమహత్వం చాలావుంది. ఎన్నో ధర్మశాస్త్రాలు జ్ఞాపకానికి వస్తాయి.

సాధారణంగా దారిపోయే మనిషి ఆనందకరమైన విషయాలనే జ్ఞాపకం వుంచుకొంటాడు. కాస్త దుఃఖకరమైన విషయాన్ని కూడా జ్ఞాపకంవుంచుకొనడు. ప్రతిమనిషి తన కష్టాలనే జ్ఞాపకం వుంచుకుంటే తలవంచుకునే తిరగవలసి వచ్చేది. సుఖమొస్తే పొంగేవారు, కష్టమొస్తే క్రుంగేవారు సామాన్యులు. కష్టమనేది దుఃఖకరమని, సుఖమనేది ఆనందదాయకమని మనం నమ్ముతున్నాం. మన పూర్వీకులకు అష్టకష్టాలని ఆనాడు వుండేవి. ఒకరికి కష్టంగా తోచింది వేరొకరికి కష్టంగా తోచదు. వారి కష్టాలు జ్ఞాపకం చేసుకొందాం. ఒకటోది దేశాంతరగమనం; యిపుడిది కష్టంకాదంటే వీరు ఏకీభవిస్తారు. ఇక భార్యావియోగం పూర్వీకుల రెండో కష్టం. భార్యాయోగం భాగ్యమది, మనయోగం మనదీఅనే సంపూర్ణస్వాతంత్ర్య వ్యక్తిత్వభావం ప్రబలే యీరోజుల్లో యిది ఓ కష్టం కాదు. పూర్వీకులకు మరోభయం ఏమిటంటే కర్మం చాలక ఆపత్కాలంలో బంధుదర్శనం అవడం. ఈ రోజుల్లో ఆపత్కాలంలో బంధువులు దరిచేరుతారనే భయం ఏమాత్రం లేదు. పైగా ఎవరికి తగిన ఆపత్కాలం వారికి వుండడంబట్టి ఎక్కడికక్కడ ఆత్మరక్షణతో సరిపోతోంది. ఇక వుచ్ఛిష్టభక్షణం అంటే వృద్ధులు కష్టపడేవారు; యిప్పటి సంగతి కావలిస్తే కాఫీహోటల్లో కళ్లారా చూడండి. పురాతనులకు పైగా శత్రుస్నేహం మొకకష్టంగా తోచింది; కాని మనం లోకకల్యాణానికి పాటుపడుతున్నాం; లీగ్ ఆఫ్ నేషన్సులాంటి సంస్థలను లేవదీయ గలుగుతున్నాం; అంటే మరేమీ లేదు, పూర్వపుకష్టం యిప్పటి రాజనీతిగా మారింది. పరాన్నప్రతీక్షణం అనేది పూర్వుల మరోకష్టం; యిపుడిది సాంఘికమర్యాద. భంగాన్ని పూర్వులు కష్టంగా భావించారు; భంగమే భావి మంగళ సూచకమని మనం భావిస్తున్నాం. కడకు పూర్వులు దారిద్ర్యమొక కష్టంగా పేర్కొన్నారు; యిది ఏ రాజ్యంలోను, ఏకాలంలోనుకూడ వుండే కామన్ ఫాక్టరు. ఈ అష్టకష్టాల మాటెటున్నా, జీవిత యాత్రలో సుఖదుఃఖములను సమానంగా ఆదరించేవారు అరుదు.

మనలో చిత్తం అనేది లేకుంటే జ్ఞాపకం లేకుండేది. చలచిత్తులకు జ్ఞాపకం చాలా తక్కువ. మనస్సున్నా, బుద్ధియున్నా, అహంకారమున్నా, చిత్తం లేకుంటే మనిషికి ఏ కోశానా జ్ఞాపకం వుండదు. అందుచేతనే మనం చిత్తం చిత్తం అని మాటకు ముందు దేవులాడుతాం, ఎవరితో మాటలాడినా. అంటే యితరులు సెలవిచ్చిన విషయాల్ని జ్ఞాపకం వుంచుకొంటాం అని ప్రతిజ్ఞచేస్తున్నాం అన్నమాట.

మనం జాగ్రదవస్థలో వుంటే సభ తీర్చి సరసంగా పని చేస్తాయి మన పంచేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ. అదే మనం స్వప్నావస్థలో వుంటే పంచేంద్రియాలు పనిచేయవు, కర్మేంద్రియాలు కదలవు. కాని ఒక్క అంతఃకరణమాత్రం లేచి గంతులు వేస్తుంది, స్వాదీ రాజ్యంయిప్పుడని. ఈ నాట్యాన్ని మనం కొంచెం జ్ఞాపకం వుంచుకొని మెలకువగా వున్నప్పుడు కల లని చెప్పుకొంటాం. ఇక సుషుప్త్యవస్థలో ఒంటిగా, ఎంత సహాయనిరాకరణముల్నా, పాటుపడుతుంది చిత్తం. ఈ అవస్థలో చిత్తం సాగించేది తప్పకుండా నిరంకుశ ప్రభుత్వమనిపించకగదు. కడకు తుర్యావస్థలో జీవుడే దేహంమీద అధికారం చెలాయిస్తాడుట.

జ్ఞాపకం లేకుంటే ఆలోచన ముందుకు నడువదు. సంకల్పం ధ్రువపడదు. ఆత్మాభిమానం అంకురింపదు. తామసగుణంతో తరలి వస్తుంది మరుపు. రాజసగుణంతో నేను నేననే ముక్కమాటకుముందు జ్ఞాపకం వస్తుందిట. సాత్త్వికగుణంతో స్వర్గమార్గం ఒక్కటే జ్ఞాపకం వుంటుందిట.

ప్రకృతిని పరిశీలించినా, తత్త్వాలను తిరగ వేసినా, జ్ఞాపకంలేందే పనిజరుగదు. మనం వద్దన్నా గగనానిలవహ్ని సలిలధరాదికం మన్ని చుట్టివేసింది. గగనాన్ని ధ్వనినిబట్టి కనుగొంటున్నాం. గాలిని స్పర్శ ధ్వనులమూలాన్ని గుర్తిస్తున్నాం. అగ్నిని రూపస్పర్శ ధ్వనులచే పోల్చుతున్నాం. నీటిని రసరూపస్పర్శధ్వనుల తీరునుబట్టి నిరూపిస్తున్నాం. పృథ్విని గంధరసరూప స్పర్శధ్వనులబట్టి పరీక్షిస్తున్నాం. ఏదిఎటున్నా జ్ఞాపకం లేకుంటేగంధరసరూపస్పర్శధ్వనులను గుర్తించుకోలేము. మాటాడేవారికి వినేవారికి, మాటాడింది విన్నది జ్ఞాపకం వుంటేకాని విషయాలు తెలియవు. పైగా మాటకుముందు వెనుకటి ముక్కలు జ్ఞాపకంవుంచుకొంటున్నాం కనుకనే ఎవరైనా మాటాడింది మనకు అర్థంఅవుతుంది. అన్వయించుకొంటున్నాం. బుద్ధివారికి చెమిటివారికి జ్ఞాపకశక్తి మెండని కొందరు సెలవిస్తారు. లక్షణజ్ఞులకు ప్రతిపాయింపునకు సొల్లునోటికి వస్తుంది. అంటే టటటటటా అనాలో, గిడగిడతా అనాలో జ్ఞాపకం వుంటుంది. ధ్వని నాకర్షించుటకునే శక్తి చెవులకున్నా జ్ఞాపకశక్తి లేకుంటే యీ ధ్వని మేఘగర్జనమనీ, యిది కోయిలకూతయనీ తెలిసికొనజాలము! ఇది గాంధారమనీ, యిది కాకలీనిషాదమనీ, యిది తారకషడ్జమనీ చెప్పేటందుకు జ్ఞాపక మవసరం. మానవతిమార్గమిది రూపవతి తీరిది,కీరవాణికదలిక యిది, సరసాంగి సొంపిది, నీతిమతి నడకయిది, శ్యామలాంగిస్వరమిది, రసికప్రియ రూపిది అని తలపునకు వెంటనే రావాలంటే జ్ఞాపక మత్యవసరం. కృషి లేకుంటే జ్ఞాపకానికి ఏవిషయం వెంటనేరాదు. నిప్పునుతాకిన నొకతీరనీ, నాయికను తాకిన వేరొకతీరనీ తెలిసికొనుటకు జ్ఞాపకమే ముఖ్యం. ఏకతాళ మేదో, ఆటతాళ మేదో గుర్తించాలంటే జ్ఞాపకం వుడాలి. ఇక రూపాలవిషయంలో మన్మథాకారుడతడు, కురూపి యీతడని నిర్ణయించి త్రాసులో పెట్టి తూచుకోడానికి జ్ఞాపక మవసరము. అల్లది మేడ యిల్లిది గోడయని నిరూపించుకొనుటకు జ్ఞాపక ముండవలయును. వీరు ఋషులు, వీరు పితృదేవతలు, వీరు దైత్యులు, వీరలే దానవులని గుర్తించడానికి జ్ఞాపకం కావాలి. ఋషులే జ్ఞాపకంలేకుంటే వేదం జ్ఞాపకానికి రాదు పితృదేవతలు జ్ఞాపకం రాకుంటే తద్దినాలు జ్ఞాపకానికి రావు. పితరులు జ్ఞాపకం వుంటే మాత్రం తద్దినాలు జ్ఞాపకంవుండాలా అంటే మీచిత్తం, మీ పితరుల భాగ్యం దైత్యులు, దానవులు జ్ఞాపకంలేకుంటే రామాయణాలు, భారతాలు అర్థం కావు. ఇక భావ ప్రపంచంలో కన్నులుమూసికొని దేవుడీతడు, బ్రహ్మాండమిది అనుటకు జ్ఞాపకశక్తిగావలయును. జ్ఞాపకంలేకుంటే తండ్రి లేడు. విశ్వములేదు. స్థావరజంగమాత్మకమైన జగత్తులేదు. మానవజన్మ నిరర్థకము. రూపం మాటయటుండగా రసముల తీరు తిలకించుదాం. కషాయ మిది, మధుర మిది, లవణ మిది, కటువిది, తిక్తమిది, అమ్ల మిది యనుటకు జ్ఞాపకం కావాలి; రసజ్ఞ యుంటే చాలదు. గ్రంథములవిషయం వేరే చెప్పనక్కరలేదు. జ్ఞాపకం వుందనగానే మనం మరుపుకూడా వుందన్నాం అన్నమాట. ప్రతివ్యక్తికి అన్నివిషయాలు జ్ఞాపకం

వుండవు; మరుపే లేకుండాను వుండదు. ఒకక్షణంలో అన్ని విషయాలు జ్ఞాపకానికిరావు. ఒకటితర్వాత ఒకటి జ్ఞప్తికివస్తాయి. మనకు అనుభవం హెచ్చినా జ్ఞాపకశక్తి హెచ్చదు. మనిషిలో మరుపెక్కువా, జ్ఞాపకమెక్కువా అనే విషయం ఎవరికి వారు చిత్తానుసారం యోచించుకోవాలి. ఒంటరిగా కూర్చుంటే ఓ కోటి విషయాలు జ్ఞాపకానికి రాకపోవు.

చచ్చేవానికి మతివుండదు. కాని బ్రదికినవాళ్లు జ్ఞాపకాన్ని పెంపొందించేది పొడుమని ఒకరు, చుట్టయని ఒకరు, త్రాగుడని ఒకరు, కాఫీ అని ఒకరు భేదాభిప్రాయాలు వెలిబుచ్చుతారు. వీటివల్లనే జ్ఞాపకశక్తి క్షీణిస్తుందంటారు మరికొందరు. ఏది ఎటున్నా, చచ్చినవాళ్లందర్నీ జ్ఞాపకంచేసుకొని గుళ్లుకట్టి పూజించేది హైందవదేశీయులు. చచ్చినవాళ్లని జ్ఞాపకం చేసేంటివే టాజ్ మహాలులాంటి గొప్పగోరీలు. రాజులను జ్ఞాపకంచేసేవే ఈజిప్టుదేశంలో జయగోపురాలు. విజయనగరసామ్రాజ్యాన్ని జ్ఞాపకానికి తెచ్చేది హంపి. ఇల్లా స్మారకచిహ్నములనుబట్టి జరిగినవిషయాలు జ్ఞాపకానికివస్తాయి. జ్ఞాపకార్థం కట్టాలు, కానుకలు, గోరీలు, మహలులు, మాన్యాలు, పట్టుపచ్చడాలు, విందులు మనదేశంలో లేకపోలేదు. గతయుగాల్లో సుప్రసిద్ధులపేర్లు మనకు కొన్నే జ్ఞాపకమున్నాయి. మిగిలినపేర్లేమైనాయో? మరచిపోయాం. ఎందుచేతో? జ్ఞాపకంలేకను

స్వంతఘోష కొందరకు జ్ఞాపకంవుంటుంది. కొందరకు పూరివార్థిక్యోమతప్ప తదితరంతో ప్రమేయంవుండదు. పుట్టగానే వెనుకటి జన్మసంగతులు జ్ఞాపకం వుండవు. ఈ జీవితం మనం ఒకవిధమైనమరుపుతో ప్రారంభిస్తున్నాం. పోను పోను యీమె తల్లి, యీతడు తండ్రి యని గుర్తించుకోగలుగుతున్నాం. అక్కడనుంచి పాఠశాలలో పలక, పుల్లతో జ్ఞాపకాన్ని పదునుపరచుకొంటున్నాం. ఎక్కాలు నోటికిరాకపోతే పీకగింపుతో చూడబడుతున్నాం. తర్వాత పరీక్షలు నూటికి తొంభైపాళ్లు జ్ఞాపకశక్తిని పెంపొందిస్తున్నాయి. విశ్వవిద్యాలయాలు పరీక్షలకు ముందు రెండు నెలలూ జ్ఞాపకశక్తిని హెచ్చించి, వెంటనే ఒక్కమాటుగా తగ్గించివేస్తున్నాయి యీశక్తినంటారు విద్యాధికులు. బాలురకు జ్ఞాపకశక్తి గర్భాయంనుంచి వుంటుందని, పాతికయేళ్లు నిండాక యీశక్తిబలం, తీక్షణత హెచ్చదనీ, యాభైసంవత్సరాలకుపైన జ్ఞాపకశక్తి క్షీణిస్తుందనీ పరిశోధకులు చిలకపలుకులు పలుకుతారు. కొందరు యీశక్తి చిత్తాన్నిబట్టి మారుతుంది, దీనికి వయసు ప్రధానం కాదన్నారు. వృద్ధులు చిన్నప్పటి విషయాల్ని మరీమరీ వృద్ధాప్యంలో జ్ఞాపకానికి తెచ్చుకుంటారు. బాల్యంలో జరిగినవిషయాలు పూసగ్రుచ్చినట్లు వివరిస్తారు. కాని కళ్లముందుజరిగే విషయాలంటే కాస్తపరధ్యానంగా వుంటారు. ఎవరుకూడా గతజన్మలోని విషయాలను యీజన్మలో జ్ఞాపకముంచుకొని చెప్పేవారులేరు. అల్లా చెప్పినా, అది నిజమో అబద్ధమో తెలిసేవారులేరు. కర్మవిపాకంలాంటి గ్రంథంలో గతజన్మలో నీవు కోమటివాడవని అంటే కాబోలునవాలి. గణితశాస్త్రంలో కొందరు బాల్యమందే అఖండమైన ప్రజ్ఞ చూపుతుంటారు. వారు గతజన్మలో బాగా కృషిసలిపి వుండడంచేతనే వారికి యీజన్మలో ఆవిషయాలు సునాయాసంగా వస్తున్నాయని కొందరు నమ్ముతారు. బీజాంకురం గతజన్మలో నాటుకుపోయినట్లయితే బీజావిర్భావం యీజన్మలో కాకూడదా? జాతకం చేతబట్టి జాగీరుల గణించితిమనే జ్యోతిష్కులు రీయంశాల్ని ఎల్లాసమర్థిస్తారో. వెనుకటి జన్మలో జరిగినవిషయాలను దేవుడెవరికీ జ్ఞాపకం వుండకుండాచేశాడు, అంతా మాయ అంటారేమో. ఎవరిదో మాయ!

పూర్వులు పుస్తకాల్ని పీటలైనంతవరకు చేతబట్టకుండా యీశక్తియాలాన్ని బుద్ధిబలాన్ని సంపాదించుకొన్నారు. దేశాలల్లో దిగ్విజయంచేసి వచ్చేవారు. ఇప్పుడీ శక్తి తగ్గుతూవస్తోందనేఅభిప్రాయం అక్కడక్కడవుంది. ప్రతి బి. ఏ. లను కర్మం చాలక మీరు చూస్తే యీ విషయం వాగు మీకు విపులంగా తెలుస్తారు.

జ్ఞాపకం అంటే స్ఫురణఅనవచ్చును. స్ఫురణ లేకుంటే పరీక్షలకు పదేపదే వెళ్లవలసివస్తుంది; ప్రాత స్మెట్రిక్యులేటులు వెళ్లేవారుట, అన్నీ పరీక్షకు జ్ఞాపకం వుండి! ఎప్పుడు అర్థంఅయినవిషయం అర్థంకానివిషయం కంటె బాగా జ్ఞాపకంవుంటుంది. పురనివాసులకు గ్రామస్థులకంటె సగటున జ్ఞాపకశక్తి తక్కువ. ఈశక్తి నాగరికులకు అనాగరికులకంటె తక్కువ అని కొందరు తేలుస్తున్నారు. ఏది ఎల్లా తేల్చినా, తేలినా, జ్ఞాపకం తెచ్చుకునేందుకు బుర్రగోక్కోడం, నడినెత్తిని చేత్తో పట్టుకోడం, కనుబొమలు ముడివేసి ఆలోచించడం దూలాలకేసి తీక్షణంగా చూడడం, కాళ్లు కుర్చీలో కూర్చొని తెగవూపడం, చుట్టకాలుస్తూ పొగ గుప్పుగుప్పుని నిట్టూర్పు విడిచినట్టు విడవడం, సావిట్లో కాలు కాలిన పిల్లిలా పచారుచేయడం, గ్రంథాలలో విషయమైతే పుటలు వెనుకకు ముందుకు త్రిప్పడం లాటివి జరుగుతాయి. జ్ఞాపకం తెచ్చుకునేలోగా ఎవరైనా అడ్డంవస్తే కసురుకోవడంలాటిది జరుగుతుంది. కసురుకోవడంతో చిత్తశాంతి చెడుతుంది; జ్ఞాపకం రాబోయిన సంగతిగూడా జ్ఞాపకంరాకుండా పోతుంది.

జ్ఞాపకశక్తిని పెంపొందించుకునేందుకు తెల్లవారగట్ల లేచి చదువుకుంటారు కొందరు. ఎలుగెత్తి చదువుతే ముక్కలు బాగా నాటుతాయని పైకి చదువుతారు కొందరు. వ్రాసుకుంటేగాని జ్ఞాపకం వుండదు కొందరికి. మరికొందరు కొంగు ముడివేసుకుంటారు. పూర్వం అరవదేశీయులు జుట్టును దూలానికి ముడివేసుకుని భట్టీయం వేసేవారని ప్రతీతి.

జ్ఞాపకం వుండవలసినవి సమయానికి జ్ఞాపకం రాకపోవడం సామాన్యం. డాక్టర్లకు ఫీజుమాత్రం కాకుండా డోజుకూడా జ్ఞాపకంవుండాలి. సాక్ష్యం ఏమియ్యాలో పార్టీలకు మరుపురాకూడదు. వ్యాపారస్థుడికి మాటిమాటికి లాభంమాట జ్ఞాపకం వుండాలి. సానివారికి సరసం మరుపురాకూడదు. సర్కారు వుద్యోగికి సంతకం మరుపురారాదు. నటకునికి సహజంగా నోటికి ముక్కలు రావాలి; లేకుంటే ప్రాంప్టింగ్‌తో పదాలు లాగగలగాలి. గాయకుడికి రాగాలు మరుపు రాకూడదు. పురోహితునికి పనస మరుపు రాకూడదు. సంఘసంస్కర్తలకు బాలవితంతువులు మరుపురాకూడదు. శాసనసభ్యులకు దేశాభివృద్ధి,ప్రజాభివృద్ధి మరుపురాకూడదు. నేరపరిశోధకునికి నలుగురిపోకడా జ్ఞాపకం వుండాలి. బోధకుడికి ఆచరణ అనేది కూడా వుందని జ్ఞాపకం వుండాలి. జ్ఞాపకశక్తి లేకుంటే ఎన్ని శక్తులున్నా రాణించవు. చదివిందే చదవడం, చూచిందే చూడడం, విన్నదే వినడం జ్ఞాపకశక్తిని వృద్ధిపరుస్తాయి. మరీ ఎక్కువగా చదివిందే చదవడం, చూచిందే చూడడం ప్రారంభిస్తే చాదస్తం క్రింద మారుతుంది. ఈచేష్టలు విపరీతమైతే పెర్రివాలకంగా చప్పున పోల్చుకోవచ్చును.

జంతువులకుకూడా జ్ఞాపకశక్తి వుంది; అనుభవం వుంది. కాని జ్ఞానం లేదు.

భక్తులు దైవాన్ని మరచిపోలేరు. మనం ప్రహ్లాదునివంటి భక్తులను యిప్పటికి మరచి పోలేదు. జ్ఞాపకం వుంచుకున్నాం.

"చిత్తము సంసృతిపటలము
ద్రచ్చుతము కామాది వైరి వర్గంబుల నే
డిత్తము చిత్తము హరికిని
జొత్తము నిర్వాణపదము శుభమగు మనకున్."

అనగల్గినాడు ఈ భక్తుడు.

ఒకొక్కప్పుడు మంథరలాంటివారికి సమయానికి ఏదైనా జ్ఞాపకం వస్తే చరిత్ర మారుతుంది.

"వసుమతీశ నాకు వరమిచ్చి తప్పుట
తగవుగాదు మీకు దలపులేన
మఱచినారదేమొ మన్నించి తొల్లింటి
యాత్మ లీయవలయు నీక్షణంబ"

అన్నది కైక. మధ్య దశరథుడు మూర్ఛిల్లినాడు. ఈ జ్ఞాపకం చేయడంతో రామాయణం అంతా బయట పడింది. అది వద్దు మొర్రో అన్నా ఎవరికి మరుపు రావడం లేదు. ఎందుచేతనో!

మరోవిషయం. "పుట్టిన యిండ్ల మానినులు పోరచిగా ననిశంబు నుండుటే" అన్నాడు కణ్వమునీంద్రుడు. ఈముక్కలు విని దుష్యంతుడున్న సభామండలిలో నిలబడింది శకుంతల యను సాధ్వి. రాజునకు పూర్వవృత్తాంతము రవ్వంతకూడా జ్ఞాపకం రాలేదు.

"వలకేలన్ గురు చక్రరేఖగలుగు బద
ద్వంద్వంబునం బద్మరే
ఖలు నొప్పారగ నందు వచ్చిన రమా
కాంతుండు నాగాంతిన
గ్గలమై యున్నకుమారు మారసదృశా
కారున్ విలోకించి తా
బలుకం డయ్యె విభుండొజెంగి సతి వి
భ్రాంతాత్మయై యుండగన్."

కడకు అశరీరవాణి మాటవింటేగాని రాజుకి బుద్ధి రాలేదు, జ్ఞాపకం రాలేదు. రాజులకలి పూర్వకాలంలో యీతీరుగా వుంటే, యీరోజుల్లో సామాన్యులకు వాణి చేదోడవుతుందా?

ఈ వృత్తాంతాలు యిల్లాగుంటే ద్వారకానగరానికి దీనంగా వారితీశాడు కుచేలుడు. చిత్తం చక్రిమీద వుంచాడు.

"ఎఱుగుదువె మనము గురుకులం
దిరమున వసియించి యతడు తెలుపగ వరుసన్
ఎఱుగగ వలసిన యర్థము
లెఱిగి పరిజ్ఞానమహిమ లెఱుగుట లెల్లన్".

అని విన్నవించుకున్నాడు. అబ్బే, ఎరుగను బాబూ, వస్నొంటుకు చంపుతావని ఒకవేళ హరి అని వుంటే అది గర్వమనీ, తెగనీలుగనీ, నెత్తిమీదకు కళ్లురావడమనీ మనం భావించేటందుకు సందుండేది. "విప్రవర్యా, యిందేల వచ్చెద" వని ఎవరైనా అడ్డుపెట్టారా? లేదు. మిత్రుని చూచేమాడడంతో తల్పం దిగి, ఎదురుగా వెళ్లి ఆదరించాడుట. జ్ఞాపకమునకు వేరు నిర్వచన మవసరమా? మనకు సృష్టికర్త జ్ఞాపకం వుండడు. జ్ఞాపకం లేదు. జ్ఞాపకానికి రమ్మన్నా రాడు. జ్ఞాపకం చేసుకుందామన్నా మనకు తీరుబాటులేదు. జ్ఞాపకం పోనీ చేసుకుందాం, ఎందుకు పేచీ అంటే ఏమని జ్ఞాపకం చేసుకోవడం అని ముందు ఆలోచిస్తాం. కాని పరమాత్మునికి మనము సదా జ్ఞాపకమే.

తుది ముక్క. లోకం తల్లక్రిందైనా కన్నపువాడు కత్తి మరచిపోడు. నేరగానికి దొంగబుద్ధివున్నా మంచి జ్ఞాపకశక్తి వుంటుంది. నేరానికిముందు జ్ఞాపకశక్తి తీక్షణంగా వుంటుంది. తెలివితేటలతోనే పని జరుపుతాడు. చిత్తాన్ని వంగదీస్తాడు. దుష్కృతానికి గడగుతాడు. అప్పుడతని కంతా సులువుగా తోస్తుంది. కాని నేరానికి వెనుక అతని మరుపు ముంచివేస్తుంది. చిత్త మొకమూలకు లాగుతుంది. వెర పొకవంక బాధిస్తుంది. అంతటా చీకటి కమ్ముతుంది. ఈచీకటిలోనే పరిశోధకుని చేతులో చిక్కుతాడు దోషి. ప్రతిమనిషికి మరుపులో జ్ఞాపకం, జ్ఞాపకంలో మరుపు వుంటుంది. ఎవరికి జ్ఞాపకం వుండేది భావాత్మకమైన విషయంకదా! నేరగాడనినంతనే మానవప్రకృతిని జయించాడా! జితేంద్రియుడవునా? కానేరడు.



# విష్ణుమాయానాటకము*

విద్వాన్ టి. ఆర్ముగంపిళ్లై

ఆంధ్ర ప్రబంధావతరణము రాయలనాఁటి రసికత యను పాలవెల్లినుండి వెలువడిన జాబిల్లి వంటిది. నన్నయభట్టారకుని నాఁడే వాడ సందోహముతో నారంభించిన సంస్కృతాంధ్రీకరణముల పరిణామమును శ్రీనాథకవిసార్వభౌముఁడు తన శివరాత్రిమాహాత్మ్యమున, హరవిలాసమున నొకనూత్న పద్ధతిని సంస్కృతానుసృతములుగా మార్చెను. పెద్దన రామరాజభూషణులు దాని కింకొక క్రొత్తమార్గమునే కల్పించిరి. సూరనార్యుఁడా క్రొత్తబాటను 'సిమెంటు'తో చదునుచేసి చక్కదిద్దెను. ఆనాఁడు కావ్యలక్ష్మి సర్వాలంకారశోభితయై, రాజపూజితయై, సర్వాంగసౌందర్యరేఖతో నవనవనృత్తగీతాదులతో చిందులు ద్రొక్కెను. ఆకాలమున నాంధ్రవాఙ్మయలత పలుమొగ్గలుదొడిగి రేకులి తన దివ్య సౌరభములను సమస్తాశాంతములను నిండించినది. రసికావతంసులగు రాజశేఖరుల మస్తకముల నెక్కి నిక్కెను. ఆయుగమేకదా స్వర్ణయుగము!

స్వర్ణయుగమున నవతరించినకావ్య మొక్కొక్కటియు నొక్కొక్క జాతిరత్నము. ఈరత్నము లన్నియు నాంధ్రలక్ష్మి కొక యపూర్వమండనముగా విరాజిల్లుచుండెను. శత్రురాజగజము లీమండనముల సొంపుపెంపుల నేమెఱుఁగును?......త్రెంచి కాళ్ల క్రిందవైచి నజిబిజిచేసివైచినవి. కొన్ని దిక్కుహరములఁ బాఱవేయఁబడినవి. ఎన్నియో నాశనమునొంది, పేరులు కూడ మాసిపోయినవి. పోయినవి పోవ, కొన్నికొన్ని శిథిలాతిశిథిలములు మాఱుమూలలవి కొందఱు సారస్వతప్రియుల నిరంతర ప్రయత్నములవలన నానాటికి వెలుఁగుమొగమును జూడఁగల్గినవి.

అట్టి ప్రయత్నము తొలుత బ్రౌనుమహాశయునితోఁ బ్రారంభింపఁబడిన దనవచ్చును. ఆమహాత్ముని పరిశ్రమలఫలితము నేఁడు శాశ్వతమై ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారాకృతి దాల్చి విరాజిల్లుచున్నది. తంజాపూరునందును, ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమునందును, లెక్కలేని ప్రాచ్యవిజ్ఞాన ప్రపూర్ణ గ్రంథ భాండారములయందును సేకరింపఁబడియున్నవి; ఇంకను సేకరింపఁబడుచున్నవి. ఇట్టివానికి విశ్వవిద్యాలయమువారుకూడ చేయూతనిచ్చుచుండుట మనభాగ్యమనకతప్పదు. ప్రభుత్వమున కంతటితో తనకర్తవ్యమంతముకాలేదు. 'అసూర్యంపశ్య'లై యున్న గ్రంథరాజము లనేకములకు అనశ్వరరూపములు గల్పించుట ముఖ్యమైయున్నది.

మద్రాసు విశ్వకళాపరిషత్ప్రాచ్యపరిశోధనాలయాంధ్రశాఖవారు విష్ణుపురాణాదులతోఁబాటు నిరుడు మధ్యయుగమునాఁటి చింతలపూడియెల్లనార్యప్రణీతమయిన విష్ణుమాయానాటకము నాంధ్రలోకమునకు సమర్పించి మన సారస్వతమున కొక్కవింతపుష్టిని చేకూర్చిరి.

విష్ణుమాయానాటకము నాటకము కాదు. జగన్నాటకసూత్రధారియొక్క చిత్రలీలాప్రభావ ప్రతిపాదకమయిన ఐదాశ్వాసముల రసవత్ప్రబంధము. యెల్లనార్యునకు రాధామాధవకవియని యాతనిరాధామాధవకృత్యంతర విరచనచేఁ గల్గిన పేరు. కవియొక్క దేశకాలవస్తువుల గుఱించి సంపాదకుల విపులమగు పీఠిక గ్రంథమున కలదు.

యెల్లనార్యుఁడు విష్ణుపారమ్యప్రకటనము నుద్దేశించి అత్యద్భుత చమత్కారకథా సందర్భకుసుమముల నొక్కచోటఁ గ్రుచ్చియున్నాఁడు. సినీమాసంధాత నానాదేశములందలి చిత్రవిచిత్రదృశ్యములను తన ఫిలుమున నెక్కించి రమ్యాతిరమ్యమైన యొక్కకథ ననుసం

* మద్రాసు విశ్వకళాపరిషత్ప్రాచ్యపరిశోధనాలయాంధ్రశాఖాప్రచురణము. వెల ౨-౮-౦.

థించి లోకుల కన్నులపండువొనరించున ట్లీకవి విష్ణుమాయానాటకమును నిర్మించి ఆంధ్రపాఠకులకు తన మృదుమధురకావ్యామృతధార లాలికించి పరమానందము కలిగించుచున్నాఁడు.

ఈప్రబంధ మైదాశ్వాసములు కలిగినది. ఐదాశ్వాసములయందును శౌరిసన్నిహితాప్తబృందము లోని ప్రముఖులై దుగురి గర్వశృంగభంగములు చిత్రింపఁబడియున్నవి. గర్వించిన సత్యారక్తి, లక్ష్మీసక్తి, బ్రహ్మశక్తి, శూలివిరక్తి, నారదభక్తి వ్యర్థములయ్యెను. విష్ణుమాయ భార్యలనైనను, బావమఱఁదినైనను, పుత్రునైనను, పౌత్రునైనను గర్వించినపుడు క్షమింప లేదు!

రాధామాధవకవిచంద్రునికవిత స్వతోజాతంబగు సాంద్రారణ్యమువలె నొక్కొక్కచో విజృంభించియుండును; ఒక్కొక్కచో వనపాలక పోషితమైన రమణీయోద్యానమువలె విరాజిల్లుచుండును. రసగ్రహణపారీణుల కందు దివ్యామృతరసకాసారములును, వివిధవర్ణాంచిత, వికసిత సురభిళప్రసూనరాజీవిరాజిత కల్పకపాదపశ్రేణులు శీతలప్రచ్ఛాయాప్రశోభితములై హాయి గూర్చుచుండును.

ఈకవిధారాశుద్ధి అనర్గళమై, అతి వేగమై అయత్నోపలబ్ధమై, ఐచ్ఛికవిహారసంపన్నమై అలరారుచుండును. మచ్చున కీ గౌతమీవర్ణనము దిలకింపుఁడు. ఆంధ్రాభిమానుల కెవ్వరి కానందపారవశ్యము గల్గకుండును?

చనిచని కాంచె విప్రుఁడు వి
సప్రసవప్రసరత్పరాగ సం
జనిత సుగంధబంధురల
సజ్జలశీకర శీతవాతపో
త నిరుపమాన శైత్య నిర
త ప్రతివర్ధితసత్తపోవ్రతా
ది నియమనైష్ఠికవ్రతతి
తీరములంగల గౌతమీనదిన్.

రంగదనిద్ర సద్రుచిచి
రాజిత పద్మసుగంధ సమ్మిళ
ద్భృంగ కనంగభంగకళి
దీప్తకదర్పకృశానువంగ కా
కాంగసశీకరోత్కరస
మగ్రతరంగకు ద్రొక్కు గౌతమీ
గంగ కథంగురాభ్యుదయ
కారణకారుణికాంతరంగకున్.

భావనాప్రపంచమున నీకవి వైకుంఠాది సమస్తప్రదేశముల పాఠకులకుఁ జూపుచున్నాఁడు:

హరినాభినవ పుండరీక మకరం
దాసారముల్ గ్రోలి త
ద్వరకర్పూర మయోరు సౌధముననో
వాతాయనద్వార సం
చరణక్రీడ లొనర్చుమం దిరుచు ని
చ్ఛాభంగ సంగీత సు
స్వర భృంగీతతి మందమారుతము ప
ద్మం గ్రుమ్మరున్ దిక్కురన్.

(అపూర్వ వైకుంఠము)

స్వభావవర్ణనమున నీతని ప్రావీణ్య మద్వితీయము:

పరభృతచంచు సంచలిత
పల్లవముల్ మధులోల బంభరో
త్కరగతిగూనముల్ శుక ము
ఖ ప్రవిభిన్న ఫలంబుఁ గేలి సం
చరదబలాప్రియ ప్రసవ
సద్మమునై సకలర్తు యుక్తమై
పురివనవైభవం బలరు
భూరి మనోహర సౌరభస్థితిన్.

స్త్రీవర్ణనమున నితని ప్రతిభ:—

ముత్తైపుఁ జెఱఁగుల చిత్తంబు నిండించుఁ
గనకాంశుకంబుల కట్టు దనరఁ
బసపుకుంకుమచాయ నెసఁగుకుచంబుల
మందార పుష్పదామములు వ్రేల
నెలవంక తిరుణామముగల నెన్నుదుట్లఁ గెం
పుల చుక్కబొట్టులు చెలువుమీఱఁ

దాటంకవజ్రాంకుధాళధళ్యంబుతోఁ
  జెక్కుల చిఱునవ్వు చెంగలింప
శంఖచక్రాంకభుజలతల్ చారుముఖులు
పురపురంధ్రులు సంభ్రమంబునను వచ్చి
నిలయచత్వరవేదుల నిలిచి చూచి
రద్రిజాశంకరులను నెయ్యంబుతోడ.

బోయెత వర్ణనము:

పచ్చగాజులయొప్పు పచరించు చేతుల
  సంకుటుంగరములచాయ లెసఁగ
నిగనిగల్ దొలకాడు బిసువుచన్నులమీఁద
  గురువిందపూసల సరముదనర
ధవళతాళపలాశతాటంకరుచి మించు
  చెక్కులఁ జిఱునవ్వు జీరవాఱ
గొప్పున కందని కురులు నించుకదోఁచు
  నుగుటిజీవురుబొట్టు కుదురు మెఱయ
సన్నవలిపెంపుటొల్లియ సగము గట్టి
సగము ముసుకిడి యొయ్యారముగ మెఱుఁగు
కంచుమెట్టెలు మొరయంగఁ గడకవచ్చు
నవ్విలాసినిఁ దగ మెచ్చె నవనిసురుఁడు.

ఆబోయకాంత కన్నులకుకట్టున ట్లున్నది యీవర్ణనము. దీనిని జదివిన రసజ్ఞుఁ డెవ్వఁ డాకాంత ఎదుటఁగలదని చేసాఁచి బయలును గౌఁగలించి పరిహాసమునకు పాత్రుఁడు కాకుండును?

ప్రవరునివలె 'ఇనుపకచ్చడము' కట్టుకొనని బ్రాహ్మణుఁ డీపుండరీకుఁడు దానినిగాంచి,

ఎవ్వఁ డాన వెక్కసికి
  నేగెద వాయితపాటుతోడ నీ
విచ్చల నొంటిపాటున య
  థేచ్ఛ రతీశవిహారరేఖఁ దో
డెవ్వరులేక ప్రాణవిభుఁ
  డెవ్వఁడు నీకుల పెద్ది చెప్పవే
జవ్వని, నిన్నుఁ జూచి మది
  చాలక వేడుక తొంగలించెడున్.

ఆహా, మదిచాలక వేడుక తొంగలించెనట. ఎంత చక్కఁగ చెప్పినాఁడు.

ఎల్లనార్యుని రసవత్తరవర్ణనములలో మఱొక్కటి; నందికేశ్వరుఁడు వైకుంఠమున—

మృగమదాలేపము మెఱయువేదిక నద్రి
  కూలభాగంబని కొమ్ముఁజిమ్ము
మరకతసౌధకోమలకుచులకుఁ దృణ
  ప్రీతిమై నందంద మూఁతిఁజాచు
నాపణరత్నదివ్యచ్ఛాయ నిర్ఝరా
  కృతియైన నుఱుక లంఘింపఁ జూచుఁ
దననీడ మణిభిత్తిఁ గని ప్రతిపక్షబుద్ధ్య
  దాశంకఁ గనలి ఘల్లనుచుఁ దిరుగు
పండితగతిన నిరిచివవీథులందు
తాండవము సూపు నూపురధ్వనులతోడఁ
బసిఁడిమువ్వలపేరుఁ జొంపంబు మెఱయ
నందికేశ్వరుఁ డీశ్వరానందలీల.

ఇట్లు చూపుటకు మొదలిడిన ప్రతిపద్య రసోదయమైన యీగ్రంథమంతయు వ్రాయవలసియుండును.

రాధామాధవకవి గ్రంథరచనయందు కాలవ్యత్యయములను విషయములు దొరలినవి.

శివుఁడు పార్వతీసమేతుఁడై వైకుంఠమునకు వెళ్లినపుడు చూచినదృశ్యములలో—

భూరిబలోగ్రహేమక శి
  పుప్రముఖాసురులం జయించి య
వ్వీరులు బొమ్మపెండెమున
  వ్రేలఁగ నంఘ్రుల దిగ్విలీనని
స్సారవిరోధులై సుభట
  సంజ్ఞకు మోహన చక్రలాంఛనో
దారభుజాకలాపులయి
  తన్పురిఁ గాల్వురువొల్తు రిమ్ములన్.

మత్స్యావతారకాలమున విష్ణువు మోహినీరూపధరుఁడైనసంగతి నారదుఁడు శివునకుఁ జెప్పెను. శివుఁడప్పుడే వైకుంఠమున కేగెను. అచ్చట "హేమకశిపు

ప్రముఖాసురుల జయించిన" సంగతిని జూచెనట! ఇట్టివి మన పురాణేతిహాసములందును గలవు. మనకవులవీని కాలవ్యత్యయదోషమును దోషములలో లెక్కింపలేదు.

విష్ణుమాయానాటకమున కావ్యలక్షణములన్నియు స్వాభావికముగనే పొందింపఁబడియున్నవి. నవరసములును సందర్భోచితముగా నాయాయిఘట్టములందు పట్టింపఁబడియున్నవి. ప్రతి ఆశ్వాసమునను శృంగార రసమే యొక్కటిగా చిప్పిలుచున్నది. ఉత్తమకావ్యమనిపించుకొనుటకుఁ గావలసిన లక్షణము లన్నియు నించుమించు నేకొలఁతయు లేక సమకూర్పఁబడియున్నవి.

ముద్రణాస్ఖాలిత్యము లందందు విశేషముగా కన్పడుచున్నవి. నిర్దోషముగా ముద్రింపఁజేయుట కర్తవ్యము.

ఇట్టి రసవత్ప్రబంధమును ముద్రింపించి యాంధ్రలోకమునకుఁ బంచి పెట్టిన చెన్నపురి విశ్వవిద్యాలయమువా రెంతయు నభినందింపఁబడవలసియున్నారు.



ఒడగేవు వంతెన, పుదుచ్చేరి S. S. A.

# అంబ్బీరదేవుని ఓరుగంటి శాసనము

నేలటూరి వెంకటరమణయ్య



1. ప్రమాదిసంవత్సరమా
2. ఘ శు ౧౦ శు* గజపతి క
3. పిలేంద్రమహారాయ
4. లకుమారుండ[*,]అం
5. బ్బీరాదేవకుమారమహా
6. పాత్రుండువారు [గ*]ంట్టి
7. కోటగొనెను.

* ప్రతిబింబమును స్థూలముగ దిలకించిన నీయక్షరము 'వ' వలె గన్పించుచున్నది. కాని సూక్ష్మదృష్టితో జూచిన నది 'శు' అని తెల్లము కాగలదు.

శాసనమును ప్రకటించుటకుగలయవసరము:

ఈశాసనము ౧౫-వ శతాబ్దమునాటి తెలింగాణ కళింగదేశముల పరస్పర సంబంధమును దెలియజేయుచున్నది. మఱియు, బహమనీసుల్తానుల నోడించి కళింగ గజపతులు హిందువుల యధికారము నెట్లు తెలింగాణమున పునరుద్ధారణ గావించినదియును ఇందుమూలమున గొంచెము దెలియగలదు. ఈ శాసనమును నింతకుపూర్వము మెకంజి సాహెబుగారి సర్వేయరులును, తరువాత చెన్నపురి శాసనపరిశోధక శాఖవారును పరామర్శించియున్నారు. శాసనగ్రంథమును సదరు శాసనపరిశోధకశాఖవారు తమ 'సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్సు' అనుగ్రంథమాల ౭-వ సంపుటము 3౭౨-వ పుటయందు బ్రకటించియున్నారు. కాని శాసనప్రతిబింబమును చదివినవారు దానిని చక్కగ గమనించక పోవుటచేతనో లేక తెలుగక్షరముల పరిచయము లేకపోవుటవల్లనో యపపాఠములను పెక్కింటిని బ్రచురించిరి. వానిని ఈ క్రింద దెలుపుచున్నాను:

| శాసనపరిశోధన శాఖవారి పాఠము | నా ప్రతిబింబము లోని పాఠము | మెకంజీ సర్వేయరుల పాఠము |
|---|---|---|
| 1. మాఘశు౧[3] వ\| | మాఘశు౧౦శు | మాఘశు ౧౦ వ\| |
| 2. కపిళేంద్రమహారాయల కుమారుండు [ఈ]చ్వర దేవడు మాధమహాపాత్రుండు. | కపిలేంద్రమహారాయలకుమారుండ[J] అంబీరా దేవకుమార మహాపాత్రుండు. | కపిలేంద్ర మహారాజులకొమారుండు బఽర దేవకొమార మహాపాత్రుండు. |
| 3. వారుగ[ంట్టె] | వారు [గ]ంట్టి | వారించ్చి |

ఏతత్కారణముచేత ఈ శాసనము నిచ్చట బ్రకటింపవలసివచ్చినది.

స్థలము:

ఈశాసనము ఓరుగంటికోట పశ్చిమ ప్రాకారము దర్వాజాకు లోపలిభాగమునందు జెక్కబడియున్నది. దీని ప్రతిబింబమును నా కొసగిన మిత్రులు డాక్టరు పి. శ్రీనివాసాచార్యులు, యం. యే. పి. హెచ్ డి. గారికి నా కృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాను.

లిపి:

ఈశాసనమునందు లిపివిశేషములేవియు లేవు. అక్షరములు పదునైదవ శతాబ్దమునందు సామాన్యముగ వాడుకయందుండినవే. అప్పటి యక్షరములకును, నిప్పటి యక్షరములకును గొంచెము భేదము గన్పడుచున్నది. ఈభేదము ముఖ్యముగ 'క', 'త', 'శ' అను నక్షరములయందు పొడకట్టుచున్నది. 'ర' వ్రాసి దానిమీద శిరస్సునకు తగులనీయక తలకట్టు వ్రాసిన (క*) క యగుచున్నది (చూ. రెండవపంక్తి కడపటి యక్షరము). కన్నడమున నేటికిని 'క'ను యిట్లే వ్రాయుచున్నారు; కాని ౫-వ పంక్తియందలి 'కుమార'లోని 'క' దీనికి కొంచెము భిన్నముగ గాన్పించుచున్నది. బిందువును వ్రాసి దానిపైని, తలకు అంటనీయక తలకట్టు నిచ్చి (ర) యున్నది. 'ద' ఇప్పటివలె వ్రాయబడలేదు. అక్షరముయొక్క కుడిభుజము తలకట్టు పర్యంతమును బోక పొక్కిలికి సమముగ

నిలిచిపోయియున్నది. అనగా 'డ' యొక్క కుడిభుజమునకు గుడిచుట్టక యూరక నిలిపిన 'ద' యగును. ఇప్పటి 'త'కును అప్పటి 'త' కును వ్యత్యాసము కలదు. (చూ: పం: ౧, సంవత్సరము: పంక్తి: ౨ గజపతి) ఇప్పుడు మనము వ్రాయు 'త'యొక్క కుడిభుజము మధ్యయందున్న సున్నను వ్రాయక, తల కట్టును నక్షరము నంటనీయక అక్షరమునకు పైన వ్రాసి, కుడిభుజమును ఎడమభుజముగను ఎడమభుజమును కుడిభుజముగను మార్చిన యప్పటి 'త' యగును. 'శ'యొక్క యెడమ భుజము ఇప్పటివలె క్రిందినుంచి కుడిభుజమును దాటి కుడిప్రక్కకు బోయి తలకట్టుతో గలి యక, యెడమవైపుననే తలకట్టున కధోభాగ మున నిలిచి కుడిప్రక్కకు గుడివలె దిరిగి యున్నది. ఇప్పటి యప్పటి యక్షరములకును గలభేదము ప్రస్తుతపు శాసనమువల్ల దెలియ వచ్చినంతమట్టుకు ఇంతియ.

క్రిందిపట్టికవల్ల నీభేదము స్పష్టముకాగలదు:

| ఇప్పటి అక్షరము | అప్పటి అక్షరము |
|---|---|
| క | క, ర |
| త | త |
| ద | డ |
| శ | గ |

భాష:

౧. శాసన మంతయు తెనుగుభాష యందు వ్రాయబడియున్నది. వచనము—ఒకటేవాక్యము. ౫-వపంక్తియందు 'అంబ్బీర' యనుటకు బదులు 'అంబ్బీరా' యని వ్రాయబడియున్నది. ౬-వ పంక్తియందు 'పాత్రుండు' అనివ్రాయబడియున్నది. ఇది 'పాత్రుండు' అనియుండవలయును. ఈతప్పు వ్రాయసకానిదై యుండవలయును. ఇవితప్ప శాసనమునందు వేరుతప్పులులేవు. శాసన మును చెక్కినయతడు కొన్నిపొరబాట్లను చెక్కియున్నాడు. ౪-వ పంక్తిలో 'కుమా రుండు' అనుటకుమారు 'కుమారుండ' అని యు, 'ఓరుగంటికోట' యని చేర్చుటకు మారు 'వారుంట్టికోట' యని చెక్కి యున్నాడు. 'ర' కును 'ం' కును మధ్య 'గ'ను చెక్కక విడిచినాడు. 'ఓరు' ఆకాలపు వాడుకభాషయందు 'వారు' అని మారినది. అదియే ఇప్పటి 'పరంగ'లై పరిణమించినది.

శాసనకాలము:

ఈ శాసనమున ప్రమాదిసంవత్సరము మాఘ శుద్ధ ౧౦ శుక్రవారమునాడు యోరుగంటికోట సాధింపబడినట్లు వ్రాయ బడియున్నది; శకాబ్ద మం దుదాహరింప బడలేదు. కాని శాసనము కపిలేంద్రగజపతి వారి కాలముదగుటచేత ప్రమాదికి సరియైన శకాబ్దమేదో కనుగొనుట యసాధ్యముగాదు. కపిలేంద్రగజపతికాలమున నతనియనుచరుడు గాణదేవుడు శా. శ. ౧౩౭౭ నకు సరియగు యువసంవత్సరమున కొండవీటిని పాలింపుచు చావలియను గ్రామమును బ్రా హ్మణులకు దానము చేసియున్నాడు (ఇండి.

ఆంటి XX pp 390 - 93) శా. శ. ౧౩౮౧ నకు సరియగు విక్రమసంవత్సరమున కపిలేంద్రుడు శ్రీకూర్మము దేవాలయమునకు కంచుతో జేసిన దీపము మోచెడి విగ్రహము నొకదానిని దానము జేసియున్నాడు [M. E. R 284 of 1896]. ఇంతేకాక, రఘువంశజుడు 'పరశురామతనయుండు వీరభద్రదేవేంద్రుండు' కలియుగము ౪౫౬౧-వ సంనకు సరియగు శాలివాహనశకవర్షంబులు ౧౩౮౧ ప్రమాదసంవత్సర ఉత్తరాయణమునందు శశిఋతువున మాఘమాసశుక్లపక్షమున దశమీ భృగువారమునాడు మృగశిరా నక్షత్రమున* నేకశిలానగరమును గొన్నట్లు ఓరుగంటికోట యందొక శాసనమునందున్నది [M. Mss 15-4-5 p 106]. ఈశాసనమును, అంబీర దేవకుమారపాత్రుని శాసనమును నొక్కనాడు చెక్కించినవే యని తలచెదను. ఇట్లే మెకంజీదొరగారి సర్వేయరులును అభిప్రాయమును సూచించియున్నారు.

'యిందులో వ్రాశ్ని గజపతికపిలేంద్ర మహారాజులకొమారుండు బీర దేవకొమార మహాపాత్రుండున్ను పైన వ్రాశ్ని రఘువంశం పరశురామతనయుండు వీరభద్రరాజున్ను వీరువుభయులు ఏకశిలానగరంబుపై యుద్ధంబుజేశి కోటతీస్కుని వోరుగంటిరాతికోట పూర్వ పశ్చిమద్వారములయందున్ను వకు సంవత్సరంలోనే శాసనం వేయించినారు.' [M. Mss 15-4-5 p 107].

కావున అంబీరదేవుని శాసనములోని ప్రమాదికి సరియైన శకవత్సరము ౧౩౮౧ అగుట నిశ్చయము. ఓరుగంటిని అంబీర దేవకుమారపాత్రుడు క్రీ. శ. ౧౪౬౦ ఫిబ్రవరి నెల తే ౧ ది శుక్రవారమునాడు స్వాధీనము జేసుకొనెను.†

చరిత్రాంశములు :

పై శాసనమున పేర్కొనబడిన కపిలేంద్రుడును అతని కొమారుడగు అంబీర దేవుడును ఎవ్వరు? వీరు ఓరుగంటిని యెవ్వరికడనుంచి యెట్లు సాధించిరి? అను ప్రశ్నలకు ఇచ్చట సమాధానము జెప్పవలసియున్నది.

కపిలేశ్వరుడు :

రాజ్యాభిషేకమునకు పూర్వము ఇతని యొక్క చరిత్ర మిట్టిదని నిర్ధారించి చెప్పుటకు వీలు లేదు. ఇతడు సూర్యవంశజుడగు క్షత్రియుడు. అనాదిగ కళింగదేశము నేలుచున్న గంగవంశపు రాజులను దరిమివేసి క్రీ. శ. ౧౪౩౪-౩౫ సంవత్సరమున సింహాసనము నాక్రమించుకొనెను. తదారభ్య, దక్షిణమున నున్న రెడ్డిరాజ్యమును గబళింప దరుణము వేచియుండెను. క్రీ. శ. ౧౪౩౮వ సంవత్సర పర్యంతము వేమ వీరభద్రారెడ్లు రాజమహేంద్రవరమున రాజ్యము సల్పుచున్నట్లు

* ఇందుకు క్రీ. శ. 1459-వ సంవత్సరము ఫిబ్రవరి 1-వ తేది శుక్రవారము సరిపోవుచున్నది.

† మాఘ శు ౧౦ మి వర్ధవారమైన, హూణమానమున క్రీ. శ. ౧౪౬౦ ఫిబ్రవరి నెల తే ౨ ది శనివార మగుచున్నది.

శాసనములవల్ల దెలియుచున్నది. తరువాత వీరిపొడ గానరాదు. క్రీ. శ. ౧౪౪౧-వ సం॥ జనవరి నెలయందు విజయనగరచక్రవర్తియగు ప్రౌఢదేవరాయలయొక్క మహాప్రధానుడగు నాగభూపాలుని పుత్రుడగు మల్లభూపాలుడు రాజమహేంద్రవరమును బాలించుచుండెను. క్రీ. శ. ౧౪౩౮ వఱకు రాజ్యము చేయుచున్న రెడ్లేమైరో, ప్రౌఢదేవరాయల యధికారముక్రిందికి రాజమహేంద్రవర మెట్లు వచ్చినదో తెలియదు. రాజమహేంద్రవరపు రెడ్లకు విజయనగర రాజులకును మైత్రియు, బంధుత్వమును ఉన్నట్లు శాసనములవల్లను, శ్రీనాథకృతగ్రంథములవల్లను దెలియుచుండుటచేతను, గంగాదాసవిలాస మను గ్రంథమున ప్రౌఢదేవరాయలు గజపతిని నిర్జించినట్లు జెప్పియుండుటచేతను, రాజమహేంద్రవరపు రెడ్లపై గపిలేశ్వరుడు యుద్ధమునకు రాగా ప్రౌఢదేవరాయలు వారికి బాసటనై నిలచి గజపతిని ఓడించెనని యూహించవచ్చును. ఇందు కనుకూలముగ నొకానొక కైఫీతునందు వేమవీరభద్రారెడ్లను గజపతి జయించి వారి రాజ్యమును ఆక్రమించినట్లు వ్రాసియున్నది.

'శాలివాహనం ౧౩౦౦ శకంలో లారుగు సింహాసనాధీశ్వరుడైన లాంగూల గజపతి సమస్తమైన రెడ్లకు చివర పురుషుడైన వీరభద్రవేమారెడ్డిగారిని జయించి యే స్థలాలు గిరిదుర్గాలు ఆక్రమించి... ప్రభుత్వం చేసిరి.'

ఇందలి శకవర్షసంఖ్య కపిలేశ్వరునికి సరిపడదు. వేమ వీరభద్రారెడ్ల సమకాలికుడగు గజపతిపేరు 'లాంగూలుడు' గాదు. అయినప్పటికిని ఇందు కొంత నిజముండుననినమ్ముచున్నాను. నిజము భావిపరిశోధనవల్ల గాని బయల్పడదు.

ఏది యెట్లున్నను కపిలేశ్వరుడు క్రీ. శ. ౧౪౫౫వ సంవత్సరమునకు పూర్వమే తూర్పు సముద్రతీరముననున్న యావత్తు తెలుగుదేశమును ఆక్రమించుకొనుటయే గాక విద్యానగరచక్రవర్తియగు మల్లికార్జున రాయలను నిజరాజధానియందు ముట్టడించి కప్పము గొనెను. అతని నెదరించగల రాజు హిందూస్థానమున నాకాలమున గాన రాడాయెను.

అంబీరదేవకుమారమహాపాత్రుడు :

ఇతడు గజపతి కపిలేశ్వరుని కుమారుడని మనశాసనము దెల్పుచున్నది గదా. ఈ విషయ మితరశాసనములవల్లను దెలియవచ్చుచున్నది.

బెజవాడ తాలూకాలోని జక్కంపూడియందలి శాసనమున (M. E. R. 148 of 1913) కపిలేశ్వర మహారాయల కుమారుడగు అంబిదేవరాజు పాపవినాశేశ్వర రుద్రదేవులకు జక్కిరెడ్డిపల్లెను దానము చేసెను. ఇతనికి హంబీర, (M. E. R. 833 of 1922)

కుమార హాంవీర దేవ మహాపాత్రుడను (M. E. R. 157 of 1913) పేర్లను గలవు. మహమ్మదీయ చరిత్రకారుడగు ఫెరిష్టా యితనినే అంబర్ రాయ్ అని పేర్కొనియున్నాడు. (Brigg's Ferishta ii p 487). ఇతనికి దక్షిణకపిలేశ్వరకుమార మహాపాత్రుడను పుత్రుడొక డుండెను. అంబీర దేవుడు మహాశూరుడు. కపిలేశ్వరుని దక్షిణదిగ్విజయయాత్రయందు శత్రువుల నోడించి దేశమును తండ్రికి స్వాధీనపఱచెను. అతడు క్రీ. శ. ౧౪౫౮ సంవత్సరప్రాంతమున కొండవీడు కొండపల్లెలపై నధికారము చెల్లించుచుండెనని తోచుచున్నది.

బహమనీరాజులు - కపిలేశ్వరుడు:

మాదళాపంజియను ఓడ్రగంథమున కపిలేశ్వరుడు 'బహమనీసుల్తానుల సాయమువలన సింహాసనము నధిష్ఠించెనని చెప్పబడి యున్నది*. గంగాదాసప్రతాపవిలాసమున బహమనీసుల్తానునితో గూడి కపిలేశ్వరుడు కర్ణాటకముపై దండయాత్ర వెడలి, విజయనగరమును ముట్టడించినట్లు వ్రాయబడియున్నది. ఈవ్రాత లెంతవఱకునిజమో దెలిసికొనుటకు దగిన యాధారము లెవ్వియు గాన్పింపవు. మనకు ఎఱుకపడు పరికరములను తఱచిచూడ, కపిలేశ్వరుడు తెలుగుదేశమున నడుగిడినది మొదలు బహమనీరాజులతో నతనికి వైర ముండినట్లు తోచుచున్నది. ఈవైరమునకు కారణములు రెండు: బహమనీరాజులును, వారి యధికారులును హిందువులను హింసించుచు, వారిని బలాత్కారముగ మహమ్మదీయమతమున గలుపుకొనుట. ఇందుకొక యుదాహరణము. సుల్తాన్ అల్లాఉద్దీన్ అహమదు బహమనీ రాజ్యకాలమున నగని నవుకరియందు సంజరుఖాన్ అను గొప్పసర్దా రొక డుండెను: ఇతడు తెలింగాణపు హిందువులతో యుద్ధముజేయుచు వారిని చెరపట్టి సుల్తాను సముఖమునకు బంపుచుండువాడు. సుల్తాను వారిని మహమ్మదీయమతమునగలుపుచుండెడివాడు. (ఇండి. ఆంటి xxviii. p 237).

మహమ్మదీయు లిట్లు చేయుచుండుటను జూచి, హిందూమతాభిమానియు, హిందూనాయకుడును నగు కపిలేశ్వరుడు తురుష్కులను తెలింగాణమునుంచి వెడలగొట్టుటకు నిశ్చయించుకొనెను. రెండవది: బహమనీ రాజులకు తెలింగాణమంతయు అప్పటికి స్వాధీనముకాలేదు. తురకరాజులయొత్తిడికి ఓర్చుకొనలేక తెలింగాణములోని హిందూరాజులు కపిలేశ్వరునిసాయము నపేక్షించుచువచ్చిరి. కపిలేశ్వరుడును వారికి వలసినపుడెల్ల సాయమంపుచుండెను. కావున కపిలేశ్వరునికిని తురకరాజులకును గల వైషమ్యము దినదినప్రవర్ధమాన మగుచుండెను.

ఇక కపిలేశ్వరుడు క్రీ. శ. ౧౪౬౧-వ సంవత్సరమున ఓరుగంటిపై దండు వెడలుటకు

* Proceedings of the Asiatic Society of Bengal, 1900. p 182.

సన్నిహితకారణమేమో కనుగొనవలసి యున్నది. మహమ్మదీయచరిత్రకారులు ఈ విషయమై కొంత వ్రాసియున్నారు.

"సుల్తాన్ హుమయూన్‌షా తెలింగాణము హిందువులమీద మతయుద్ధమును బ్రకటింప నిశ్చయించెను. సైన్యమునం దొకభాగముపైని యధికారమును ఖ్వాజా జహాన్ తురక కిచ్చి వానిని కొందఱు అమీరులతోను సేనాధిపతులతోను ముందంపెను. తక్కిన సేనతోగూడ తాను వెనుక బయలుదేరెను.

"ఖ్వాజా జహాన్ రమారమి 20,000 గుఱ్ఱపు దళముతోడను, 40 గజములును అసంఖ్యాకము లగు పదాతివర్గముతోడను బయలువెడలి సుల్తానుసైన్యమునకు ముందు నడచి, కాలక్రమమున నితఃపూర్వము స్వబలముచేత శత్రువులకు గైవసము గాని దేవరకొండ దుర్గమును సమీపించెను. ఖ్వాజా జహానుడు అచ్చటవిడిసి కోటనుముట్టడించెను. కొంతకాలము గడచిన పిమ్మట, కోటను సంరక్షించువారి సంకటము అతిశయించగా, వారు ఆకాలమున మతద్రోహులకు నాయకుడగు ఉరియాదేశపురాజునకు వర్తమానము నంపిరి. వారు తమ దిక్కులేనితనమును చక్కగా వర్ణించి, తమకు సహాయమొనర్చి కష్టములనుండి విముక్తులను జేయుటకు ఒక సైన్యమునంపిన, దానికిప్రత్యామ్నాయముగ విశేషధనము నొసగెద మని వ్రాసిరి. ఆ పాపిష్ఠుడు ధనముపైని ఆశచేతను, హిందూమత సంరక్షణకొఱకును, కోటలోని మతద్రోహులను సంరక్షించుట తన విధి యని తలచెను; కావున కోటసంరక్షణకు ప్రాపుగ నతడు అపారమైన సైన్యమును నూరుయేనుగులతో గూడ నంపెను." (ఇం. ఆం. XXVIII P 244.)

ఈసైన్యము వచ్చి చేరగనే మహమ్మదీయసైన్యముయొక్క దురవస్థ యతిశయించెను. కోటలోనివారికిని, కపిలేశ్వరునిసైన్యమునకును మధ్య జిక్కుటచే అడకొత్తులోని పోకవలె తురకలు చిదిగిపోయిరి. హిందువులు యుద్ధరంగమునందు తురుష్కులను పూర్ణాహుతి గావించిరి.

కపిలేశ్వరుని సైన్యమునకు అధిపతి యతనికుమారుడు అంబ్బీర దేవుడు. అతడు కంబముమెట్టుదగ్గిర యవనుల నోడించినట్లు ఈ క్రింది సీసపద్యపాదమువల్ల దెలియుచున్నది :

'యవనుల గెల్వఁడే యంబరాయలు జూడ నెట్టైనకంబముమెట్ట బయల?'

ఇచ్చటి నుండిపోయి యోరుగంటిని ముట్టడించి మనశాసనమున జెప్పినట్లు దానిని గైవసము జేసికొనెను.

ఈవిషయముగూడ నొకచాటుపద్యమువల్ల దెలియుచున్నది :

"కటకంబులోపలి గజవాడబెజవాడ,
యొద్దిబండారిల్లు యోరుగల్లు
* * * *
ఇట్టి గజరాజుశౌర్యంబు లెన్నిచూడ
కొలదిమీరిన దేవరకొండ కొండ
నీదు కోర్కంటి సింహంబు నిఖలబిరుదు
దిశల ములుసూపు దామెర తిమ్మభూప."

# ౧

కాంతారా విక లోపలఉండలేక బయటి కొచ్చేశాడు. వావిలాలవారి పెరట్లో చెట్లమీదినించి చంద్రు డప్పుడే ఉదయిస్తు న్నాడు. లోపల తన జీవితాన్ని రెండేళ్ల పాటు వెలిగించిన మణిముఖచంద్రబింబం అస్తమించుతున్నది.

ఆ గదినిండా జనం కిటకిట లాడుతూ కూర్చున్నారు. డాక్టరు యమధర్మరాజు. మణిజీవితం నిమిషాల్లో ఉందని చెబుతూనే ఎవరైనా గట్టిగా ఊపిరి విడిస్తే కేసువదిలి బయటికి నడుస్తానన్నాడు. క్షణాల్లో ఉంది. తనమణి చివరసారి ఊపిరివిడిచేస్తుంది. వాళ్ల దుఃఖం ఉప్పెనల్లేవచ్చి పడుతుంది. దాంతో తనగుండెకూడా బద్దలైపోతుంది. తనుకూడా మణితోకలిసి వెళ్లిపోవచ్చును.

మణి!

ఎక్కడా మంచివాళ్లు—ప్రేమించదగిన వాళ్లు లేరా? వాళ్లలో లోపాలుండవా? మణిలోకూడా ఒక్కలోపం, అలంకారార్థం ఉండరాదా? నాలుగైదేళ్లుకాలేదే తననోటి మీదిగా "మంచిగుణాలను ప్రేమించేదేమిటి? లోపాలనే ప్రేమించాలి!" అని. "మణీ! ఇంత అదృష్టం నాకెట్లా దొరికింది? నీవంటి దేవత నాకుపెళ్లాంకావటానికి నేనేంపుణ్యం చేసి ఉంటాను?" అని తను మణిని అడిగి నప్పుడు మణి ఇట్లా అవుతుందని పాపం, ఎట్లా ఊహించగలదు?

అందరుపెళ్లాలంటి పెళ్లాం కాదే తన మణి! తల్లిపోయిన్నాటినించీ తన జీవితానికి మాతృత్వమన్నది లేక, అష్టకష్టాలూపడి తన హృదయం అలిసినప్పుడు దాన్ని సమదాయించి చల్లగా నిద్రపుచ్చేవాళ్లు లేక తనొక పద్మవ్యూహంలో చిక్కిపోయి, బోగం కొంపల్లో పడిఉండి, ఓడానని చెప్పటం ఇష్టం లేక, ప్రజ్ఞకు పెనుగులాడుతూ, లోకాన్ని యావత్తూ ఎదుర్కొని నానాయాతనలూ పడుతున్నప్పుడు మణి దేవతామూర్తల్లేవచ్చి తన్ను నరకంలోనించి మొకామొకీ స్వర్గం చేర్చిందే! పదమూడేళ్లపిల్ల! అర్భకురాలు! లోకం తెలియనిది! ఎంత ఓర్పు! ఎంతనిదానం! ఇంతా ఇందుకా? ఆహా! పరమేశ్వరా!

తనకు భగవంతుడిలోగూడా నమ్మకం పుట్టించిందే మణి! భగవంతుడు కాకపోతే తన కటువంటి భార్య నెవరిస్తారు? భగవంతుడుంటే ఇట్లా ఎందుకు జరుగుతుంది? మనుష్యులే చెయ్యరే, భగవంతు డిచ్చి పుచ్చుకుంటాడా?

ఒక్కసారిగా లోపలివాళ్లంతా గొల్లుమన్నారు. అయిపోయింది. మణి అస్తమిం

ధింది. ఇక లోకం పాడే! ఆచంద్రుడు తన్ను చూసి నవ్వుతున్నాడు. అనుకున్న ప్రకారం తనగుండె బద్దలైపోలేదు.

అయినా తనకు మణితో ఏంపని? త నెక్కడ, మణి యెక్కడ? కాంతారావుకు త నేం చేస్తున్నదీ తెలేదు. అతను బయటి కొచ్చాడు. వాకిట్లో డాక్టరుకారు నిర్జీవంగా నిలిచిఉంది. డ్రైవరు కారులోపల అస్పష్ట మైన ఆకారంతో కూ మని "అయిపోయిందా?" అన్నాడు. కాంతారావు విననివాడల్లే నిర్మా నుష్యంగా ఉన్న వీధివెంటబడి పిచ్చివాడల్లే నడవటం మొదలుపెట్టాడు.

౨

ఉదయం ఏడూ ఏడున్నరప్పుడు నాళం వారి సత్రంముందు ఒక దయ్యం తారట్లాడు తున్నది. ఆవ్యక్తి కింకోపేరు కుదరక దయ్య మనవలసి వచ్చింది. మొహాన ఒక నెత్తురు చుక్క ఉన్నట్టు లేదు. కళ్లల్లో జీవం ఎంత మాత్రమూ లేదు. మనిషి సన్నగా, పొడు గ్గా, నాజూకుగానే ఉన్నాడు. గుడ్డలు చాలా మాసిఉన్నై. మొహాన ఏభావమూ కనపడ లేదు. వెంకట్రావు సత్రంలోనించి ఎదురుగా ఉన్న హోటలుకు పోతూ చూశా డా దయ్యాన్ని. అతను కాఫీ తాగి వస్తుండగా ఇంకా ఆదయ్యం తారట్లాడుతునే ఉంది. ఈ సారి వెంకట్రావు వెనక్కు తియ్యకుండా ఆ వ్యక్తిని సమీపించి "ఎవరు మీరు?" అన్నాడు.

"న న్నేమీ అడక్కండి. నేను —నే నేమీ చెప్పేస్థితిలో లేను!" అన్నాడు కాంతారావు మొహాన బాధసూచిస్తూ.

"సత్రంలో బస చేస్తారా?" అన్నాడు వెంకట్రావు.

కాంతారావు చేస్తా నన్నట్టు తల ఊపాడు. వెంకట్రావు రమ్మని సత్రంలోకి దారితీశాడు.

గుమాస్తాగారు సత్రంలో బస చేసిన వారికి పాత్రసామగ్రీ అవీ చూసిపెడు తున్నాడు. వెంకట్రావు గుమాస్తాగారి గది లోకి వెళ్లి "ఏమండీ గుమాస్తాగారూ, వీరికి గది ఒకటి ఇప్పించగల రా?" అన్నాడు.

"వారిపేరు?" అన్నాడు గుమాస్తా తలఎత్తకుండానే.

వెంకట్రావు ఒకసారి కాంతారావువంక చూసి "సుబ్బారావుగాడు. గుంటూరుసుబ్బా రావుగారు" అన్నాడు తడుముకోకుండా.

గుమాస్తా తలమెత్తి "గదులు ఖాళీలేన ట్టుందే!" అన్నాడు పరధ్యానంగా.

"రెండోమూడో ఖాళీగానే ఉన్నట్టు న్నదే!" అన్నాడు వెంకట్రావు. "నాటకం సమాజంవా రెవరో మాట్లాడుకున్నా" రని చెప్పాడు గుమాస్తా.

"పోనీ, నా గదిలోనే ఉంటకూడదూ మీరు?" అన్నాడు వెంకట్రావు కాంతా రావువంక తిరిగి. కాంతారావు ఉంటా నని

తల ఊపాడు. ఆభావకూడా అతనికి చాలా బాధకరంగా ఉన్నట్టుంది.

## 3

వెంకట్రావు సరదామనిషి. అతనికి ప్రపంచం యావత్తూ ఆనందమయంగా ఉండాలి. తనచేత సుబ్బారావని నామకరణం చెయ్యబడ్డ కాంతారావు ఆవిధంగా సీరియస్‌గ్లే ఉండటం అతనికేమీ నచ్చలేదు. అతన్ని నవ్విద్దామని అనేక హాస్యాలు చెప్పాడు. భమిడిపాటి కామేశ్వర్రావు పోల్గు కూడా ఏమీ చెయ్యలేక. అతను నవ్వలేదు సరే కదా, వినిపించుకుంటున్నట్టు కూడా లేదు. ఒకొక్క ప్రయత్నమూ వ్యర్థమౌతున్న కొద్దీ ఈమనిషిని రెచ్చగొట్టి మనిషిలోకి జీవం తీసుకురావాలని వెంకట్రావు తీర్మానం జాస్తికాసాగింది.

రంకు పురాణంలోకి దిగితే ఎట్లా ఉంటుందో ?

“గాలివానవచ్చిన సంవత్సరంలోనండీ! నేనప్పుడు మచిలీబందరులో ఉంటుండగా నండి, నాకు మణి అని ఒకపిల్లతో స్నేహమైంది. పిల్ల చాలా బాగుండేది సుమండీ. మొగుడు వెధవ ఉత్తధనాసరి పీనుగని చెప్పకునేవారు. వాడెప్పుడూ ముండలవెంట తిరిగే వాడుట. సరిగా రెండునెల్లు. ఇంతలో నేను అపూర్నుంచి వెళ్ళిపోవలిసొచ్చింది. నేను వెళ్ళిపోతుంటే ఆపిల్ల ఎంత ఏడిచిం దనుకున్నారు. మనం బాధ్యత నెత్తిమీద వేసుకుని పెళ్ళిళ్లు చేస్తామే గానండి, అసలు పెళ్ళిళ్లు—”

వెంకట్రావుగారి సుబ్బారావు విచిత్రంగా ప్రవర్తించటం మొదలుపెట్టాడు. అతని మొహం ముందర ఎర్రగా అయింది. తరవాత అతనికళ్లు చలించటం మొదలు పెట్టినై జీవంతో. చివర కతను దెబ్బ తిన్నవాడల్లే చివాలున లేచి వెంకట్రావువంక ఒక్కక్షణం తీవ్రంగా చూసి చరచరా బయటికి వెళ్లాడు.

వెంకట్రావు, పాపం, నిర్ఘాంతపోయినాడు. అతనికేమీ అర్థంకాలేదు. అతను బయటికొచ్చాడు. సుబ్బారావు లేడు. గబగబా వీథిలోకి వెళ్లి చూశాడు. సుబ్బారావు ఎక్కడా కనిపించలేదు......

స్టేషనుకు పోయేదారిలో ఒక పెద్దమనిషికి వెనకనించి వచ్చి ఏదో బలంగా టాకీ యిచ్చింది. ఆయన వెనక్కు తిరిగి చూస్తే సన్నటి పొడుగాటిమనిషి కనపడ్డాడు. ఇంకా ఏదోక్షమాపణ వస్తుందని చూస్తున్నా డా పెద్దమనిషి. ఏదో గాలివానవిషయం గొణుక్కుంటూ ఆసన్నటిమనిషి ఏమీ జరగనట్టే సాగిపోయినాడు. ఆవిధంగానే స్టేషనులో టిక్కెట్టుసరిచూస్తున్న మనిషికూడా టిక్కెట్లు సరిచూస్తూ ఈసన్నని పొడుగాటి మనిషినే టిక్కెట్టు చూపించమని అడిగి టిక్కెట్టుకు బదులు గాలివానవిషయం ఏదో వినపడీ వినపడకుండా తెలుసుకున్నాడు......

కాంతారావు నిర్మానుష్యమైన బజారు వెంట చరచరా నడుస్తూ తన ఇంటికి కొద్ది దూరంలో అకస్మాత్తుగా ఆగాడు.

"గాలివాన వచ్చిన సంవత్సరం! పందొమ్మిదివందల ఇరవైఅయిదు! మణి ఏడేళ్లది!"

అతని శరీరం ఒక్కసారి బిగుసుకుపోయింది. కాలు కదల్లేదు. ఎంతసేపట్లా నిలబడి ఉన్నాడో తెలేదు!

"కాంతం!"

కాంతారావుశరీరం జల్లుమంది.ఆగొంతు తన నాయనమ్మది. ఉత్తరక్షణంలో ఆవిడే కనిపించింది. ఆవిడచేతులో మందుసీసా! ఇంకెవరికి మందు?

"ఇదేమిట్రా కాంతం? ఎక్కడికెళ్లావు! పాపం, అది ఒళ్లు తెలిసినప్పటినించీ నీకోసం ఒకటే కలవరిస్తున్నదిగదా!"

"ఎవరు?" ఆమాట అడిగేటప్పుడు కాంతం గొంతు వణికింది, గాలికి ఆకల్లే.

"నీపెళ్లాం!"

అతనికళ్లవెంబడి నీళ్లు గిర్రున తిరిగినై. అది ఆనందమో, దుఃఖమో, లేక రెండూనో కాని అది భరించటాని కసాధ్యంగా ఉంది. మైకం కమ్ముతుందేమో నన్నట్టు కాంతారావు గట్టిగా తొడగిల్లుకున్నాడు. వావిలాలవారి పెరట్లో చెట్లమీద చంద్రు డుదయిస్తున్నాడు. "పోరా, పాపం, మేలుకునే ఉంది. దాని కష్టపడు! కుర్రనాగమ్మా!" అంటున్నది. నాయనమ్మ వెనకనించి. అతని కళ్లు పిండినబట్టల్లే నీళ్లోడుతునై ౨.

చంద్రోదయాన్ని వదిలిపెట్టి పారిపోయిన వాడికి లేం దీచంద్రోదయాని కెదురు పరిగెత్తేవాడి కెందు కీదుఃఖం?

## పోతనకవి

చిలుకూరి నారాయణరావు

'రామచంద్రసాక్షాత్కారరమ్యహృదయ
జనిత భవ్యభావోత్ఫుల్లసరసవచన
గుంఫితాశ్లేషకవితా నిగూఢభక్తి
పరవశా! పోతనా! నీకువందనంబు.'

కొందరికి తెనుగే గుణంబగు
కొందరికి సంస్కృతము గుణమగు
కొందరికి నుభయంబు గుణమగు
నంచు మదినెంచి,

అందరికి నందంబు హృదయా
నందమును చందంబు వీనుల
విందుగా గానంబునేసిన
కవికి వందనము.

పలుకునది భాగవతమంచును
పలుకజేసెడివాడు రాముడు
పలికినను భవహారమటంచును
పలికితివి సుకవీ!

పలుకుపలుకుల కలికితనమున
నొలికిజులజుల వెలికివెలలుచు
నలలుగా కలిగినవి తలపుల
యొలపు వెల్లువలు.

ఒలపు వెల్లులు వలపు పెల్లులు
తలపు జల్లులు పలుకు వల్లులు
పోలుపుగొలుపుచు తెలుగువెలదికి
కులుకులై వెలసెగా
మెలపుతోఁ, నానందమయమగు
నొలపుతోఁ, తియ్యందనంబగు
పలుకుతోఁ, ఆనాటినుండియు
నులుకు గలిగినది.

ఉలుకుతోనే కులుకుగలిగెను
కులుకుతోనే తలపుకదలెను
తలపుతోనే పలుకువెడలెను
పలుకు పాటయ్యెగా
ఉలుకుకులుకులు తలపుపలుకులు
మెలికలై యేకమై వెలయుచు
తెలుగునాటిని వలపువెల్లుల
నోలలాడించెగా.

పొరలె కాటుకనీరు కంటను
దొరలె వెల్లిగ వారి చన్నుల,
నొరలె హృదయము నాంధ్రభారతి
కరము భీతిల్లెగా.

వెరపుదీర్చితి బాసయిచ్చుచు
పరపితివి లోకమున గీతము
కరపితివి స్వాతంత్ర్యలక్షణ
మాంధ్రకవులకును.

మడకపట్టుచు దున్నుకొన్నను
అడవిగెణుసుల మెసవుచున్నను
కడుపునిండునటంచు భోగము
కడకుపోకుండ
కడుపుకూటికి నాసజెందక
వెడగుకూళల కప్పగింపక
తడబడక మాతెలుగుకవితకు
జడుపుతీర్చితివి
భక్తిఅంటే ఏమిటో, అను
రక్తిఅంటే ఏమిటో, ఆ
భక్తిరక్తుల మేళవించిన
శక్తియేమిటియో,
భుక్తిలో సుఖమున్నదో, మరి
ముక్తిలో సుఖమున్నదో, ఆ
భుక్తిముక్తుల తారతమ్యము
వ్యక్తపరచితివి.

తెలుగుకన్నెగ రుక్మిణిని, మా
తెలుగుభామగ సత్యభామను
తెలుగువెలదులయట్లు గోపిక
లను సృజించితివి;
తెలుగుసృష్టిని సంచరింపగ
తెలుగుహృదయము పల్లవింపగ
తెలుగుకృష్ణుని వేణుగానము
వెలయజేసితివి.

* * * *

"నీచకర్ణాటరాజన్య కీచకప్ర
దాస్యమానోపదాన దధఃక్రియాప్ర
శాంతవాగీశ్వరీ సుప్రసాదలబ్ధ
వాగ్వశా! పోతనా! నీకు వందనంబు."



“నమస్కారాన్ సమర్పయామి”

—పి. బ్రహ్మాం.

# ఆంధ్రదేశమున పిండారీదండులనాటి కథలు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ అడవి శంకరరావుగారు ౧౯౩౮-వ సంవత్సరము డిశంబరు మాసపు 'భారతి'లో 'ఆంధ్రదేశము - పిండారీదండులు' అను వ్యాసమును గవర్నమెంటురిపోర్టు ననుసరించి వ్రాసియున్నారు. నేను నా చిన్నతనమున పిండారీదండులు పెట్టిన బాధలను కళ్లార చూచినట్టియు, అనుభవించినట్టియు నిద్దఱివలన విన్న రెండంశముల నిందు వ్రాయుచున్నాను.

గుంటూరుప్రాంతమున 'పిండారీలు' దోఁచుకొనుచుండుసమయమున పిండారీ లిదుగో గోదావరి దాటివచ్చిరనియు, అదిగో పెద్దాపురముద్వారా వచ్చుచున్నారనియు రామచంద్రపుర (గోదావరిజిల్లా) ప్రాంతమున వార్తలు వ్యాపించెనఁట! జనులు అరచేతులలోఁ బ్రాణములుంచుకొని వస్తువాహనాదులను భూమిలోఁ బాతివేసియు, నూతులలోఁ బారవేసియు, రాత్రులు గ్రామస్థులు గస్తీలు తిరుగుచు గృహస్థులకు జాగ్రత్తం జెప్పుచు మెలఁకువతో నుండెడివారఁట! అట్టి కాలమున పిండారీ లీగోదావరీమండల దక్షిణభాగమునం బ్రవేశింపకపోయినను, రాజమండ్రి, పెద్దాపురతాలూకాలలో నిప్పటికిని దొంగతనమే వృత్తిగాఁగల 'నక్కల' వాండ్రు గుంపులుగూడి కొన్ని చిన్నగ్రామములపై హఠాత్తుపడి దోఁచుకొనుచుండిరఁట! ఆనక్కలవాండ్రతోఁ జెలిమిచేయు తక్కువవర్ణములవారును జేరుచుండిరఁట! ఇట్లుండఁగా నొకగుంపు దాక్షారామదేవాలయముపైఁబడి కొంతధనమును పోలీసువారి సన్నిధినే కలిగించి చుట్టుప్రక్కలగ్రామములకు భీతి గలిగించెనఁట.

## అంబికపల్ల్యగ్రహార కథ

మావంశస్థులందఱికిఁ బ్రాచీనగ్రామము 'అంబికపల్లి'యై యొకగుంపువచ్చు నూఱవ [illegible] కాలమున నగ్రహారస్థులకుఁ జరిగినదఁట!

అగ్రహారమున, పదిపండ్రెండు బ్రాహ్మణగృహములు, రెండు చాకలివాండ్రయిండ్లు, రెండు 'ఈడిగ' కులస్థుల యిండ్లు మాత్రమె కలవు. ఆయగ్రహారమునకుఁ దూర్పుదిక్కున, నొకమైలు దూరమున 'నరసాపురపేట', పశ్చిమమున నంతేటిమార్గమున నే 'చోడవరము' అను గ్రామములుగలవు. ఆబ్రాహ్మణులలోఁ బెక్కండ్రు మా 'పెండ్యాలవారే.' అది పెండ్యాలవారికి, పెద్దాపురసంస్థానస్థాపకులగు 'చతుర్భుజతిమ్మజగపతిమహారాజావా' రిచ్చియున్నారు. అప్పుడుండిన చాకలివాండ్ర యింటిపేరు మరచితినిగాని 'ఈడిగవాండ్ర' యింటిపేరు 'నక్కల'వాండ్రందురు. అప్పటి యీడిగపెద్ద 'నక్కలగురవడు' అని మాతాతగారు చెప్పుచుండువారు. గురవడే యెట్లో తెలిసికొని నేఁటిరాత్రి దోపుడుగాండ్రు వత్తురని యగ్రహారస్థులకుఁ జెప్పెనఁట! అగ్రహారస్థులిప్పటివలె దుర్బలులుగారు; అందు 'పెదకామన్న' (ఈయన పౌత్రుఁడిప్పుడు పిఠాపురమున నున్నాఁడు), చినకామన్న (నాకుఁ బెదతాతకుమారుఁడు) అనువారిద్దఱిని భీమార్జునులని మా తాతగారును, వారినెఱిఁగియుండినవారును చెప్పుచుండువారు. అగ్రహారస్థు లాత్మసంరక్షణార్థము సాముగరిడీలం జేయుచుండుటయు, వేదవేత్తలై, సూర్యనమస్కారములలోఁ బ్రాథమ్యం గల్గించుకొనుటయు నను రెండింటఁ బ్రసిద్ధులైయుండిరి. (సూర్యనమస్కారములును శరీరసాధనములలో నొకటి) 'లక్ష్మన్న' గారను నొకయాయన 'అరుణ' విధానమున సూర్యనమస్కారములొనర్చుటలో నొంటికాలిపైఁ బ్రదక్షిణములొనర్చు చేర్పరియని ప్రసిద్ధి. (ఆ 'లక్ష్మన్న' గారి దౌహిత్రులిప్పుడు డెబ్బదియేండ్ల వృద్ధులై పిఠాపురమున నున్నారు. ఈయన పేరిట 'లక్ష్మీనారాయణ' కంపెనీ యొకటి 'కాకినాడ'లో [illegible]

నెదుర్కొన నగ్రహారస్థులు తగుప్రయత్నముం జేసిరఁట! చోడవరము, నరసాపుర పేటలకు సహాయార్థము వర్తమానమంపిరి. ఒక్క చోడవరమునుండి కొక్కెర్లపాటి నరసరాజుగారును, వారి పాలికాపులిద్దఱు మాత్రమె సహాయమునకువచ్చిరఁట! మొత్తమునకు నలువదిమంది చేరిరఁట! గ్రామములోని స్త్రీబాలవృద్ధులను గ్రామమునకు వాయవ్యమునన్న యొక మురుగుకాల్వసమీపమునకుం జేర్చి యచట కాపుండుటకు పదిమంది సాధారణులను నిలిపి తక్కిన ముప్పదిమందియు గ్రామసంరక్షణమునకై యుండిరఁట!

దోపిడిగాండ్రీయగ్రహారముపైకే వచ్చుటకుఁ గారణమేమనఁగా, అంతకుఁబూర్వవత్సరము పంటలు లేవు. నీటికట్టులో నగ్రహారస్థు లితరులఁ ద్రోసివేసి 'తుల్యానదీప్రవాహమును' దమపొలములలోఁ బ్రవహింపఁ జేసికొని బాగుగాఁ బండింపఁ గల్గిరఁట! ఆయసూయకుఁ బోతుతనముచేతను, భీతిచేతనుగూడ పరిసరగ్రామస్థులీదోపిడిలో వీరికి సహాయులుకాలేదు. అగ్రహారమున నూటయేఁబదిగరిసెలవఱకు ధాన్యము నిల్వకలదఁట! స్వల్పసంఖ్యాకలితులు, కొంతధనవంతులు నగుటచేత నే వీరిపై దోపిడిగాండ్రు దాడివెడలిరి. ఏనాఁ డగ్రహారముపై దోపిడిగాండ్రు పడఁదలఁచిరో ఆనాఁడె పెదపేరుభట్టుగారనువారి భార్యకు ప్రసవవేదన లారంభమైనవఁట! అగ్రహారస్థుల కీయిక్కట్టు భయంకరముగా నున్నది. ఆమె నెచటికిని గదప వీలుకలుగలేదు. ప్రాణములను త్యజించిరయోన నామెను గాపాడ నందఱు నిశ్చయించుకొనిరఁట! ఆపెదపేరుభట్టుగారు వయస్సున, తపస్సున, విద్యను, యోగ్యతను గూడ నందఱియభిమానమునకుఁ బాత్రుఁడగుటచే నందఱి కంతటి యభిమానముకల్గినదఁట!

ఆగ్రామమునకుఁగల 'ప్రహరీనందఱు' సూర్యాస్తమయసమయమునుండియుఁ గాపాడుచుండిరి.[౧]

రాత్రి పదిగంటలైనది. ఉత్తరపుగుమ్మముకడ నొక తుపాకిని దోపిడుగాండ్రు కాల్చిరఁట! ఒకకాఁగడా, డప్పు కలవఁట! సుమారు నూరుమంది దోపిడీగాండ్రున్నారఁట! కొందఱు దోపిడిగాండ్రు రెండుతలుపులను బ్రద్దలుకొట్ట గొడ్డళ్లు, గునపములు నుపయోగించిరి. మఱికొందరు గోడలపై నెగఁబ్రాకి లోనికిం దిగనారంభించిరి. గోడలపైనెక్కిన ప్రతివానిని కఱ్ఱలతో నగ్రహారస్థులు తెగబాదుచుండిరి. ఎట్లయిననేమి, యుత్తరద్వారమును భేదించి దోపిడిగాండ్ర నాయకుఁడు పదిమందితో 'పెదపేరిభట్టు' గారింటనే చొరఁబడినాఁడఁట! 'లక్ష్మన్న' గారు పురిటింటి గుమ్మమున కడ్డముగా నిలిచి కఱ్ఱతోఁ గొంతసేపు పోరి దండునాయకుని బల్లెపుపోటుతిని బోరగిలంబడుచుఁ బెద్దకేకవేయఁగా తక్కిన యగ్రహారస్థులందఱు నచటికిఁ జేరి కేంద్రీకరించి ఘోరముగాఁ బోరుటలో కొక్కెర్లపాటి నరసరాజుగారు చొరవచేసి వెనుకనుండి దోపిడినాయకుని సందిటంబట్టుకొనిరఁట! వాడు గింజుకొనుటలో రాజుగారికిఁ గొన్ని బల్లెపుపోటులు తగిలినవి. ఇంతలోఁ దక్కిన బ్రాహ్మణులు వానిపైఁబడి బోరగిలం ద్రోసి కదలనీయరైరి. ఇద్దఱు కామన్నలు దోపిడినాయకుని కితరులు సహాయమురాకుండఁగఁ దక్కినదోపిడిమూఁకను బాదుచుండుటయు, దోపిడినాయకుఁడు దొరికెనని బ్రాహ్మణులు కేకలువేయుటయు విని వానిసహాయులు పికాపికలై పరుగిడ నారంభించిరి. వారిలో నలువదిమందికిఁ గాళ్లువిరిగినవఁట! ఇంతలో తుక్కఁగురవడు త్రాళ్లతో దోపిడినాయకుని బంధింపఁ దక్కినవారు వాని నీవలకీడ్చి త్రాఁటిచెట్టునకు బంధించిరి. అకట్టునకు దాదాపుడు

౧. ప్రతిగ్రామమునకుఁ బ్రాచీనకాలమునఁ బెద్దప్రహరీగోడ యొకటి యుండెడిది. ఆచిహ్నము లిప్పుడును దత్తమండలములలోను, నైజాంరాజ్యమునను గాన్పించును. నైజాంరాజ్యమునఁగల ప్రహరీలిప్పుడును సింహద్వారము, పాణిద్వారములుగలిగి, ద్వారస్థమగు బురుజుపై 'నగారా' యను వాద్యవిశేషముండుటయు, రాత్రి గస్తీవాండ్రాద్వారములందుండి గ్రామస్థులకు జాగ్రత్తం దెలుపుచుండుటయుం జూచితిని. గోదావరీ కృష్ణామండలములలోని గ్రామప్రహరీలిప్పుడు నాశనమైనవి.

నాయకుఁడు 'నేనీ బ్రదికియుండిన యీయగ్రహారమును నేలమట్టముచేయకపోతే 'మాలి' గాడిని కాను.' అని కేకవేసియున్నాఁడఁట! ఆకేకతో నగ్రహారస్థుల కతి భీతికల్గినది. కారణమేమనఁగా వాఁడు పెక్కు గ్రామములను దోఁచినవాఁడనియు, దాక్షారామభీమేశ్వరాలయముపైఁబడి కొంతనష్టము నంతకు ముందువారమే చేసియున్నాఁడనియు భయంకర వార్తలలో వాని పేరు ప్రసిద్ధిగా వినుచుండినదఁట! వాఁడు నక్కలవాఁడని చెప్పుదురు. లక్ష్మన్నగారు బల్లెపుపోటుదిని ప్రాణాపాయస్థితిలో నుండుట, రాజుగారికిఁ గొంతస్పృహ తప్పుచున్నను రెండుగట్టిదెబ్బలు తినుటచేఁ జాల బాధ నొందుచుండుట అను కారణములచేఁ దక్కినవారికిఁ గ్రోధము మెండగుటయే కాక, వీనిని వదలిన వీఁడుమఱొకని నంత పని చేయువాఁడనుభీతిఁగూడ కలిగి వీనిం జంపుటయే యుక్తమని చెప్పుట తడవుగా గునపముతో గురవను 'మాలి' గాని హృదయవిదారణముం జేసినాఁడఁట!

కాని అగ్రహారస్థులు సౌమ్యులుగారు. గవర్నమెంటువారికీ కథ తెలిసిన వారేమిచేయుదురో యను భీతి బాధించుటచే నాఁటిరాత్రికిరాత్రియే 'మాలి' గాని కగ్నిసంస్కారముం జేయించి, కాళ్లువిరిగి కదలలేక పడియున్న వాని యనుచరులను, రమారమి ముప్పదిమందిని నాఁటిరాత్రియే నడిమికావళ్లుగట్టి 'నరసాపురపేట' ఆవలో విడిచిపెట్టిరఁట! లక్ష్మన్నగారొక సంవత్సరమునకుఁ గాని మంచమునుండి లేవలేకపోయిరఁట! 'లక్ష్మన్నగారి' తపోమహిమచేతనే, ఆయన జీవించియున్నారుగాని, తీవ్రముగాఁ గ్రుచ్చుకొనిన బల్లెపు పోటుచే నాయన జీవింపఁడనియే చాలమంది యనుకొనువారఁట! రాజుగారును నాల్గయిదుమాసములకు లేచి తిరుగసాగిరఁట! ఈశ్వరానుగ్రహమువలన నగ్రహారస్థులలో నెవరికిని ప్రాణభంగము కలుఁగలేదు సరికదా, ఈ 'మాలి' గాఁడు చచ్చుటచేతను, చచ్చినవార్త వాని యనుచరులద్వారా నితరప్రదేశములకుఁ బ్రాకుటచేతను, అదిమొదలుగ నా చుట్టుపట్టుల నెవ్వఁడు దోపిడి మాత్రము లేకపోయినదఁట! నరసాపురపేట యానలోఁ చేర్పఁబడినవారిలో ముగ్గురో నల్గురో చచ్చినట్లు తెలిసినదఁట! అగ్రహారపు దోపిడీవృత్తాంతము 'దాక్షారామ' లోనుండిన తహసీల్దారుగారికి తెలిసి (ఇప్పటి రామచంద్రపురము తాలూకాకు నాఁడు దాక్షారామ తాలూకా యనుచుండిరఁట!) మఱి పదిదినాల కగ్రహారమునకుఁగా నగ్రహారస్థులు మానీకేసు విచారణమునకు వచ్చిరేమో యని చాల జడిసిరిగాని తహసీల్దారుగారు వారిజకుపు నడిపి, పదునల్గురు పోలీసుకానిస్టేబిలులకును నలుబదియేఁబదిమంది గ్రామస్థులకును మా దాక్షారాముకడి దోపిడియందు లొంగని 'మాలి' గానిని మీరు జయించుట ప్రశంసనీయమని మెచ్చి 'కలెక్టరు'కు వ్రాసి యగ్రహారస్థుల కొక తుపాకినిప్పించి రాత్రులు తొమ్మిది గంటలైనపిమ్మట నగ్రహారపుప్రాంతమునుండి యెవరైన రెండుసారులు పిలిచినను మాటలాడకపోయినయెడల వానిపైఁ దుపాకికాల్చుట కార్డరిప్పించిరఁట! అదిమొదలగ్రహారమనినఁ జోరులకు గర్భనిర్భేదముగా నుండెడిదఁట! మా తాత చినపేరుభట్టుగారి కాపోరాటములో నెడమ కంటిపై ఈటెయో, కత్తియో గీసికొనిపోయినది. ఆమచ్చ నాయన నాకుఁ జూపుచుండువారు. కెండ్యాల పంతులనువారిని దోపిడిగాండ్రు మోకాలిపైఁ గొట్టిన దెబ్బచే వారు జీవితాంతమువఱకు కుంటుచుండియే నడుచుచుండువారు. ఆయనను మాతండ్రిగారు 'జాంబవంతుఁడు' అనిపిలుచువారు. అనఁగా, అట్లు కుంటుచుండినను ఎంతటిపెద్దచెట్టునైన నెక్కి రెండుచేతులతోను విస్తరాకులు గోయుట, దినమునకుఁ బదిపండ్రెండు క్రోశములదూరము నడచుట మొదలగు బలవత్కార్యముల నాపంతులుగారు చేయుచుండువారు. నూఱేండ్లు జీవించిన యాయనను నేను బాగుగ నెఱుఁగుదును. ఈయనపౌత్రు లిప్పుడు మద్రాసునందలి 'రాయపురపు' రైస్‌మిల్లు కంట్రాక్టరుగా నున్నారు. ఈకథను మా తాత పేరుభట్టుగారివల్ల నే వింటిని.

ఇంక నొకవిశేషము. తమకు మహోపదలో సహాయముచేసిన రాజుగారిని, కుక్కలగురవని, చాకలివానిని అగ్రహారస్థులందఱు సోదరులవలెం జూచిరి, చూచుటయేకాదు, అన్నదమ్ములవావితోఁ బిలుచు

కొనుచుండిరి. అయినాధికకులస్థులు కొందఱు బ్రాహ్మణులవలె వ్రతములు, ఉపవాసములు మొదలగు పుణ్యకార్యములం జేయుటను నేనెఱుంగుదును.

## రెండవకథ - గుంసూరుదోపిడి

నాకుఁ బదిపండ్రెండేండ్లు వచ్చువఱకు మాస్వగ్రామమగు పేదపాడునందు, పసుపులేటి కామిసెట్టి అను నొకవృద్ధుఁడు, బీదయగు కోమటి యుండువాఁడు. అతనికెవరును లేరు. మాతండ్రిగారు చాల కాలము మాయింటనే వాని కన్నవస్త్రము లిచ్చి పోషించుచుండువారు. అతని మరణకాలమునకు రమారమి నూఱేండ్లవాఁడని వాడుక. కాని యువకునితో సమానముగా నడుచుచుండువాఁడు. నాకుఁ జిన్నతనమున కథలం జెప్పుచుండువాఁడు. 'గుంసూరు'ను మరాటీలు దోచినపుడు తా నాపట్టణమున నుండినట్లును, తన్ను పిండారీలు బాధించినట్లును జెప్పువాఁడు. అతఁడు చెప్పిన కథయిది:

తాను చిన్నతనమున అల్లరిగా సంచరించుచు, తలిదండ్రులు లేనివాఁడగుటచే రాజమహేంద్రవరమున 'నాళం' వారింటికిఁ జేరి వారికంపెనీతోఁ బిమ్మట బరంపురము వెళ్లినాఁడఁట! అక్కడఁగూడ స్థిరుఁడు గాక, ఎవరితోనో 'గుంసూరు' (గంజాముజిల్లా) చేరి, ఒకవర్తకుని యుల్లిపాయల కొట్టులో పనిచేయువాఁడఁట! ఇట్లు రెండుమూఁడునెల లక్కడ నుండఁగా 'మరాటీదండు వచ్చుచున్నది. ఆయూరు దోఁచిరి, ఈయూరు దోఁచిరి.' అను భయంకరవార్తలు వ్యాపింపఁగాఁ గుంసూరుజమీందారు వర్తకులనందఱిని బిలిపించి చందాలువేయించి తానుగూడఁ గొంతధనము ఖర్చుచేసి, అడవివాండ్రను (సవరలు కావచ్చును) అమ్ములు, ఈఁటెలు గలవారిని బిలిపించి కోటగోడలపై గాపుపెట్టియు, తనస్వంతబలమును గ్రామపరిసరములం గాపుంచియుఁ దగిన కట్టుదిట్టములం జేసినను, తనబలముపై నమ్మకము లేక, తనకోటలోని బంగారువెండివస్తువులను నూతులలోఁ బారవేయించి కొంతసాహుకారుల, ఉప్పుబస్తాలలోను, మిరపకాయ కొట్లలోను, ఉల్లిపాయ కొట్లలోను లెక్కపెట్టి దాచుటకు సాహుకార్ల వశము చేసినాఁడఁట!

మనకామిసెట్టియున్న ఉల్లిపాయల కొట్టులో నుల్లిపాయలక్రింద కొన్ని బంగరుకణికలను దాఁచిరఁట. కొట్లనందఱును మూసివేసి సమీపారణ్యమునకు గ్రామస్థులును, సాహుకార్లును, పిండారీలు గుంసూరునకు రెండుమూఁడుక్రోశములదూరమున నుండఁగనే పరుగెత్తిరఁట! కామిసెట్టి దేశద్రిమ్మరి, నిర్భీతిగలవాఁడు నగుటచే పిండారీలు గ్రామములోఁ బ్రవేశించి యేమిచేయుదురో చూతమని యొకపెద్దమఱ్ఱిచెట్టుపై చిఱుకొమ్మలమాటున దాఁగొని చూచుచున్నాఁడఁట! గుంపులవాండ్రు గ్రామమునఁ బ్రవేశించునపుడు రాజభటులకును, పిండారీలకును గొంత పోరాటమైనది. రాజభటులకంటె పిండారీమూఁక లెక్కువగుటయే కాక శూరులుగాఁగూడ నుండుటచే రాజభటులం దఱిమి గ్రామముం గొల్లగొట్టి పిమ్మట కోటపైఁబడి సవరలను, రాజభటులంగూడ నోడించియుఁ, గొందఱం జంపియుఁ గోటలోఁ గొంతభాగమును దోఁచుకొనిరఁట! పిండారీగుంపు గ్రామముం దోఁచికొనుచున్నప్పుడే వారి తాలూకు కొందఱు కామిసెట్టియెక్కిన చెట్టుక్రింద వంటలారంభించి పైకిఁ జూడ మనకామిసెట్టి వారికిం గాన్పింప, దిగుమని వారితనిపై రాలువిసర బడియుచు కామిసెట్టి దిగ వానిని నఱకఁగొట్టి గ్రామపుగుట్టు చెప్పకపోయిన నిన్ను జంపుదుమని వచ్చిరాని తెనుఁగుతో మాటలాడుచు, ఇనుపగరిటను గాల్చి యంటింప సిద్ధపడఁగా భయపడి కామిసెట్టి 'ఉల్లిపాయలకొట్టు' రహస్యముం జెప్పినాఁడఁట! అంతకుముందే పిండారీ లుల్లిపాయలకొట్టు బ్రద్దలుగొట్టి కొన్ని యుల్లిపాయలం దీసికొని కొన్నింటిని విరజిమ్మినారుగాని, అడుగుననున్న బంగరుకణికలం జూడలేదు. ఆకొట్టులోఁ బదిపండ్రెండు పుట్ల యుల్లిపాయలున్నవఁట! కామిసెట్టి యీగుట్టును జెప్ప నుల్లిపాయల నన్నింటిఁ దొలఁగించి బంగరుకణికల సంచిని దీసికొని, మిరపకాయలు, ఉప్పు మొదలగు సరకులుగల కొట్లను గూడ పూర్తిగా శోధించి యందందు దాఁచిన వస్తువులను గ్రిందికిఁ దీసికొనిరఁట! కోట వంటకే స్వాధీనము

కాకుండినను, యేవేవో రాజావారి కొన్నికోట్లు స్వాధీనమగుటచే రాజావారికిఁ జాలనష్టము కల్గినదఁట! గుంపులవాండ్రు కోటను సంపూర్తిగ స్వాధీనముచేసి కొనుటకు రెండుదినములు గుంటూరును ముట్టడించి యుండిరఁట! ఇంతలో గవర్నమెంటుపటాలము బరంపురమునుండి వచ్చుచున్న జాడతెలిసి గుంపులవాండ్రొకనాఁటి వెన్నెలలో గుంటూరునువిడిచి దోఁచుకొన్న సామగ్రిని గొంత మోయించుకొని కొండలవారిని బోయిరఁట! కామిసెట్టిని గొట్టిన దెబ్బలంతగా నొప్పిగావుగాని, ఒకనాఁడు వాని కన్నము, నీరు నీయక బాధించి త్రాళ్లతోఁ గట్టుబడుఁగట్టి మఱునాఁడన్నము పెట్టి వీని నెత్తిపై యేదియో మూటనుంచి మోయించుకొని ౪, ౫ ఆమడలదూరము తీసికొనిపోయి యొక యడవిలో విడిచిరఁట! అక్కడనుండి కామిసెట్టి దారి తెలియక చాల బాధపడుచు రెండుమూఁడు దినములకు బరంపురముచేరి, ఓమ్మట నొకనెలకు విశాఖపట్టణము 'గరుడా' వారింట నేరకుఁడుగాఁ బ్రవేశించినాఁడఁట! గుంటూరు తిరిగి వెళ్లలేదఁట!

మరాఠీలన నొకజాతివారుకారనియు, కొందఱు తురకలు, అడవిజాతివారు, తెలుఁగువారుకూడ నందుండువారనియు, గుంటూరున నుండు రెండు దినాలలోను కొందఱు పిండారీరౌతులు చుట్టుప్రక్కల కెక్కడికో పోయి యేదియో భాషలో గుంపునాయకులకుం జెప్పుచుండువారనియు, ఆభాష మరాటీభాష కావచ్చుననియు కామిసెట్టి చెప్పువాఁడు. మొదటికథ క్రిందటి స్వభాను సంవత్సరమున నైనదని మాతాతగారు చెప్పువారు. అనఁగా నేఁటికి నూటపదునొకండు సంవత్సరములకుఁ బూర్వమై ౧౯౩౪—౧౧౧ = ౧౮౨౩ లేక ౧౮౨౨ సంవత్సరమునాఁటిదిగా నున్నది. రెండవకథ ౧౮౧౮ సంవత్సరపుదిగా శ్రీ శంకరరావు గారి వ్రాఁతవల్లనే తెల్లమగుచున్నది. పిండారీదండులను మనవారు మరాటీదండని చెప్పుచుండిరి. పునా, సతారాలమధ్య నొకయడవిలో నిట్టిదొంగలచే బాధనొందిన యొకపండితుఁడీయాంధ్రదేశమున నామరాటీసంబంధ మొకనింగని భీతితో, తనశిష్యులకు వేదము చెప్పుచున్నట్లె క్రిందె 'పనసం' గూర్చి చెప్పినాఁడఁట!

సంహిత-పునాసాతవామధ్యే వటావృక్షం క్రింద చోరగ్రహణం వీడే.

పైదాని సస్వరముగా 'ఘన, జటలఁ' జెప్పిన నీపనస యింపుగానే యుండును. గ్రంథవిస్తరభీతిచే నాఁటియితరాంశములను వ్రాయలేదు.



# క్షయాంకుశము

టి. శివశంకరం

"చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ"
(గీత)

"జనహితకారియై కడు సాత్వికయోగమనంగఁ జొప్పడున్." (భాగవతము-తృతీయస్కంధము)

మనదేశమున క్షయరోగము కర్మవ్యాధులలోఁ జేర్పఁబడియున్నది. ఇది చికిత్సకు లొంగనిదనియు, పూర్వకర్మకృతమనియు తరచు మన జనుల నమ్మకము. శరీరమును క్షణక్షణము క్షీణింపఁజేసి దానిని మృత్యువు నోట పెట్టునదగుటచే క్షయరోగమని దీనికి సార్థకనామము. మనుష్యరక్తమంతయు చిన్న పురుగులతోఁ జేరినదనుట వైద్యశాస్త్రవిజ్ఞానుల మతము. ఈ పురుగులు అమృతపూరితములును, విషపూరితములును రెండువిధములై యున్నవందురు. ఇవి పుంఖానుపుంఖములై క్షణక్షణము సంఖ్యాతీతముగ పెరుగుచుండు నట్టియు ప్రతీతి. విషపూరితములగు పురుగులు అమృతపూరితములగు క్రిమిజాలమును తీవ్రముగఁ జంపి తినివేయుచుండును. క్షయరోగ వ్యాప్తికిని ఇదియే కార్యసరణి యఁట. అమృతపూరితములగు క్రిమిజాలము సంఖ్యయందు క్షీణించుకొలఁది రక్తమందలి ఎఱుపుదనము తగ్గి రానురాను దేహమే తెల్లబాఱి పోవును. క్షయరోగుల శరీరపు వర్ణ్నియందు తెలుపెక్కువచ్చుటకును, క్రమేణ శుష్కించుటకును కారణమిదియే. ఈ రోగమునకు ఔషధప్రాయమైన చికిత్స లేనేలేదనియు, కేవలము మంచి గాలి, చులకనయై బలమునిచ్చు నాహారము లే దీనికి ప్రతీకారములనియు యిప్పటి విజ్ఞానుల నిర్ణయము. ఇట్టి చికిత్సను రోగులకు నొడగూర్చుటకునై మదనపల్లెసమీపమున 'ఆరోగ్యపుర' మను పేరితో నీరోగము నివారించుటకయ్యే ఆతురాలయమొకటి క్రైస్తవవైదీకులచే ఈశ్వరప్రీత్యర్థము సాగింపబడుచున్నది. వ్యాధియుదురకముందే యీ ఆరోగ్యపురమునకు వెళ్లినపుడు కడతేరినవారిసంఖ్య యెక్కువయందురు. వ్యాధి బలిసిన రోగులకు మఱికొన్నాళ్లు కాలము గడుపనగునే కాని మృత్యువువాతఁబడక తప్పించుకొనుట యసంభవమే.

అమెరికాదేశపు వైద్యశాస్త్రజ్ఞాని యొకఁడు ఈ విషక్రిములఁ జంపి ఆతురాలయున రోగమును నిరోధించుటకు ఒకవిధమైన వస (Serum) ను కనిపెట్టియున్నాఁడు. ఇది సూదిగొట్టముచే శరీరపు రక్తనాళమున ఎక్కించినపుడు విషక్రిములను మాత్రము తీవ్రముగ చంపుశక్తి దీనికి కలదఁట. కలరా, ప్లేగు, స్ఫోటకము—ఈవ్యాధుల కిదియే చికిత్సయై యుండునట యనేకు లెంచుచున్నారు. ఈ క్రొత్తవస (Serum) ను కనిపెట్టిన విజ్ఞానుని పేరు హ్యారీ ఝాన్ కార్పర్ (Dr. Harry John Corper). అమెరికాసంయుక్త రాష్ట్రమందలి కొలరాడో (Colorado) స్టేటుకు చేరిన డెన్వర్ (Denver) నగరమున నుండు ఆస్పత్రి యందు పరిశోధనశాఖను అధిష్ఠించియున్నవాఁడు. లోకమున క్షయరోగమును నిరోధించుటకే చికిత్సను కనిపెట్టవలయు ననుట యీయనకు తీవ్రమైన గురి. క్షయరోగబాధితులగు మానవవర్గమునే తరింపఁజేయవలెననుట ఆయనజీవితదీక్ష. దీనికై ౧౫ వత్సరములుగ శోధనలఁ జేసి యీ క్రొత్తవస నిపుడిపుడే కనిపెట్టియున్నవాఁడు. ఈవస (Serum) యొక్క శక్తిని కనుగొనుటకై జరిగిన పరీక్షయొక్క కథ మిక్కిలి చిత్రమైనది. అది యిది.

డాక్టరు కార్పరు కొలరాడో మండలపు గవర్నరును చూచి తనమందును పరీక్షించుటకునై ఒకరిద్దరు జన్మఖైదీలు తనకు కావలయునని విన్నవించుకొనెను. మొదట తీవ్రమైన క్షయరోగపు విషక్రిములను సూదిగొట్టములచే వారి శరీరరక్తమునందు చొప్పించుటయు, ఆటుపిమ్మట క్రొత్త చికిత్సను అట్లే సూదిగొట్టములచే లోనికి ప్రయోగించి పరీక్షించవలెననుటయు ఆడాక్టరు యొక్క సంకల్పము. అతితీవ్రమైన క్షయరోగపు క్రిములు శరీరమున వ్యాపించినపుడు చావు తప్పనిదని

జన్మఖైదీలకు ముందుగ తెలియపరచిరి. అవిమమునకు తప్పిబ్రతికిరేని అట్టివారికి క్రిస్మస్ (Christmas) పండుగనాఁడు విడుదలయే పారితోషికమని ప్రకటించిరి. ఇట్టి ప్రాణాపాయమునకైనను తెగించి చెఱవదలించుకొనవలెననువారితో ౪౦౦ మంది పరీక్ష కియ్యకొని ముందుకువచ్చిరి. డాక్టరు కార్పరును, చెఱసాల యధికారులును ఇంతమందిని ఒక్కొక్కనిగా శోధించి యిద్దఱినిమాత్రము పరీక్షకు వెలిగాఁ దీసిరి. స్మిట్ (Schmidt), ఎరిక్సన్ (Erickson) అనుట వీరి పేర్లు. మొదటివాఁడు తనకూఁతురిని పట్టిచెఱచినపాపి. పత్నీఘాతి రెండవవాఁడు. జన్మఖైదీలగుటకిదియే కారణము. డాక్టరు కార్పరు వీరిద్దఱి భుజములఁబట్టి సూదిగొట్టములతో క్షయక్రిముల మొదట నెక్కించెను. ఈపురుగులమొత్తము ౧౨ మంది ఆరోగ్యవంతులను చంపునంతటి తీవ్రశక్తికలదై యుండెనట. అటుపిమ్మట తాను క్రొత్తగ కనిపెట్టిన వస (Serum) ను వారి రక్తమునందు పదేతీరున నెక్కించినవాఁడాయె. దీనిఫలముగ వారిద్దఱు చావుతప్పి బ్రతికిరి. కార్పరు (Corper) తపస్వి యీకార్యసిద్ధియందు నిర్లిప్తుఁడై యుండుట యొకవిశేషము. తనసహచరులుమాత్రము ఈక్రొత్త ఘటనచే క్షయరోగమునకు అంకుశమే యొకటి ప్రత్యక్షమగునని యూహించుచున్నారు. క్రిస్మస్ దినమున చావునకు తెగించి నిలచినట్టి యిద్దఱు జన్మఖైదీలు చెఱనుండి వదలింపఁబడిరి.

ఈవృత్తాంతము విచారయోగ్యము. శ్రీకృష్ణభగవానుఁడు గీతయందు తన్ను భజించువారిని నాలుగు తరగతులుగ విభజించియున్నాఁడు. ఆర్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థి జ్ఞాని యనుట యీ తెగలకు నామకరణము. డాక్టరు కార్పరు (Corper) ఈనాలుగు తెగలలో దేనికి చేరతగినవాఁడనుట విచారాంశము. ౧౫ సంవత్సరములుగ క్షయమునకు ప్రతీకారము చిక్కలేదను దుఃఖ మామహనీయునికి ఆర్తి కాదా? అట్లయిన కార్పరు పైశ్లోకమునఁ జెప్పిన ఆర్తుఁడెందుకు కాను? తదేకధ్యానమున ఆచికిత్సను కనిపెట్టుటకై ఆయన చేయుచువచ్చిన శోధనయంతయు జిజ్ఞాసకాదా? అట్లయినచో ఆయన జిజ్ఞాసువెందుకుకాఁడు? అర్థార్థి అనుట మూఁడవరకము. అర్థమను పదమునకు గీతాభాష్యకారులు ధనమని మాత్రము టీకవ్రాసియున్నారు. దానికన్న ప్రయోజనమని సమర్థించుట యుక్తియుక్తమై యుండదా? క్షయరోగబాధితులకు చికిత్సను ఘటించుటయే ఆయన నిరీక్షించుకొన్న ప్రయోజనమన్నపుడు అర్థార్థియెందుకుకాఁడు? "జనహితకారియై నెగడు సాత్త్వికయోగమునంగఁ జొప్పడున్" ఇది కపిలమహాముని వచనము. తల్లి దేవహూతికి బోధించినట్టిది. ఇట్టి యౌషధము ఘటించి క్షయబాధితులను జనవర్గమునకు కావించిన మహోపకారముచే డాక్టరు కార్పరు (Dr. Corper) సాత్త్వికభక్తుఁడెందుకు కాఁడు?

తనకు స్వర్గము కావలెనని కాని దీనికి పారితోషికముగ తనకు సద్గతి కావలెననుట కాని, ఆయన సంకల్పమై యుండదు. ఇట్టివానియెడల సర్వేశ్వరునిదృష్టి యెట్టిదై యుండవలెను? ఈప్రశ్న లొక్కొక్కటిగా విచారించినపుడు "ననుబొందు వంకఁగొనక పవనవశమున పువ్వుల పరిమళంబు ఘ్రాణము నావరించిన కరణి మెరసి" (కపిలదేవహూతిసంవాదము - భాగవతము - తృతీయస్కంధము) అను తత్త్వము మనసునకు వచ్చుచున్నది.




## సిరా బుడ్డి

కో. నరసింహాచారి

1 పటమునందలి a b c d అనునొక సమచతురపు కాగితమును తీసికొనవలసినది. దానిని a d అనుమూలలకు మడిచి యామడతను విప్పి c b అనుమూలలకును మడువవలెను. పిమ్మట c b మూలలకు మడిచినదానిని 2 పటమునందలి విధముగ o అను మధ్యభాగమున కిరుప్రక్కలను సమీపమున పట్టుకొనవలెను. అట్లు పట్టుకొని చేతులను కొంచెము పైకిఅదుముచు వచ్చినయెడల a d అను మూలలు ఎడముగా చీలును. a అనుమూల c తోను, d అనుమూల b తోను చేరునట్లు 3 పటమునందలి విధముగ మడువవలెను. అపుడు 2 పటములో b d ప్రక్కలోని e అను మధ్యభాగమును c d ప్రక్కలోని f అను మధ్యభాగమును 3 పటమునందలివిధముగ మడువబడినకాగితములో నడుమ వచ్చును. కాగితపుమడత





లను చక్కగాతీర్చి 4 పటము వలె చేయవలెను.

పిమ్మట c d అనుమూలలను ఒకప్రక్కగా o వద్దకును, a b అనుమూలలను వెనుకప్రక్కగా o వద్దకును వచ్చునట్లు మడువవలెను. (పటములు 5, 6) అప్పుడుg h i j అనుమూలలు కుడియెడమలలో ఏర్పడును. పిమ్మట 7 పటము నందలి రీతిగ. o x అను మధ్యరేఖవద్దకు g, h అను మూలలను మడువవలెను. అదే రీతిగ ji అను మూలలను వెనుకప్రక్కగా o x అను మధ్యరేఖవద్దకు మడువవలెను. అపుడు g h అను మూలలను మడుచుటవలన వాటిలో s t అను సందులు ఏర్పడును. ఈ విధమగు సందులు i j ల యందుగూడ కలవు. పిమ్మట c అను మూలను g యొక్క సందులోనికిని, d అను మూలను h యొక్క సందులోనికిని దూర్చవలెను (పటము 8). ఈ విధముగనే వెనుకప్రక్క నుండు i యొక్క సందులోనికి aఅను మూలనున్ను, j యొక్కసందులోనికి b అను మూలనున్ను దూర్చవలెను.

తర్వాత g, h, i, j అను మూలలపై వ్రేల్లుంచి పట్టుకొని x వద్దగల రంధ్రము గుండా గాలిని లోనికిఊదినయెడల కాగితము ఉబికి సిరాబుడ్డి యేర్పడును.



# కొండవీడు

కల్లపాలెం కృష్ణరావు

ఎందగారాని భోగభాగ్యాదు లంద
　పౌరుషజ్ఞానకీర్తుల వరలి రాంధ్రు
లొక్కనాడని పరులకు నొక్కిచెప్ప
కొండవీ డిప్పటికిగూడ నుండెగాదె ?

ఆమహాభోగి కవిసార్వభౌము డెంత
మురిసియుండెనో ఆనాటిసిరిని గాంచి,
తనను ప్రేమించి లాలించు ధారుణీంద్రు
నేమి యాశీర్వదించెనో యింతెరుగ ?

అంతయెత్తైనకొండలయందు గ్రాలు
బురుజులే చాలు-ఆంధ్రులగరువమునకు,
యెన్నిలక్షలు పట్టెనో? యెంతలేసి
శిల్పులుండిరో యట, నగిషీలు దిద్ద.

నేతికొట్లలు, ధనమును నింపుకొట్లు
ఆయుధము లుంచుకొట్లును నమరునట్లు,
అలవిగానట్టి పెనురాళ్ళ తొలిచిరిగద?
మరఫిరంగీలకును నూరుమసలునట్లు.

ఎంత వెచ్చించినగా మఱి యంతకంత
వృద్ధియగుచుండు వరహాలు — వేనవేలు
పదిలమునుజేయు "మొహిరీలగదులు" నేటి
కుడిగిపోయినసిరి చాటనుండెనేమొ?

ఎన్న డేదేశమున నెవ్వ రెఱుగనట్టి
తెలుగువారల పనితనంబులను జాట
రెడ్డిరాజులు కొలువుండురీతి దోచు
నా సభామంటపమె చాలు అన్యమేల ?

# దేశోద్ధారక, విశ్వదాత: నాగేశ్వరరావు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఆత్మకురుక్షేత్రమున జీవనత్తమును పూరించి, మందరి పాత్రలై ప్రవర్తించుచున్నారు.* వీరిలో నరుడు విజయుడుకావలెనని జగదీశుని ఆశయము. నానేకుల రూపులు రంగులు కలవి. కాని వీరి మనసులు ధనంజయుడు కావొల్లని వానికి పరంజ్యోతి కానం బడదు. ఇత డంతరంగమున నంధకారమును ప్రోగొనరించుకొని, అందు పొరలాడ గోరినను కోరును. ఆదర్శ ప్రదీపముపై కన్నుంచువాడు విజయకేతన మెత్తినాడు. విలంబమైననేమి? నిష్ఠురజీవనము గడపువాడు పతితుడగును. ఆలస్యమైననేమి?

నిష్ఠురులకును, దుర్మతులకును విశేషముగ నేడు భూగోళము కార్యస్థానమైనది. ఆశను ఆశయమును, ఆలోకమును కమల నింపి విలోకించినను కంపుగొట్టు జఘన్యదృశ్యములే నేడధికముగా కానవచ్చుచున్నవి. చిత్రమేమన? మహామేధావులును, కొందఱు ప్రసిద్ధపురుషులును ఈ దృశ్య



దేశోద్ధారక, విశ్వదాత, కా. నాగేశ్వరరావు.

ప్రకటు ల్వ్యాలు. వీరికి ధనమున్నది; అధికారమున్నది. కావున దమ దుష్క్రియలపై జెండా నిలుపగలుగుచున్నారు. నైతిక దార్ఢ్యము గలిగి ఆర్థికముగ కృశించిన వా రదురై నలుపు పొగ స్ఫురముపై పిప్పిగంతులు వేయు నీమహనీయుడు వాడి తూపులచే నా యుభాగులను తూట్లుచేసి విడచెదరు. కాలక్రమమున సదాశయములే సర్వసాములుకాగలవను నాస హృదయమందు మిణుకు మిణుకుమనుచుండుటచే, అల్పసఖ్యాకులైన సత్పురుషులు నేను సేలగూలినను, తమ జపమాలను పుటుక్కున త్రెంపి, తమదీక్షకు దిగదుడుపనుట లేదు. కాని, యేయుద లును లేక దుర్మతులు విజృంభించును, ఢంకా కొట్టుచున్నారు. నేటి వసుంధరను

* ప్రత్యక్షదృష్టాంతములనుజూడ, న్యూమేన్ వాకొనిన నుడువులు సత్యదూరములు కావని రూఢియగుచున్నది. " Knowledge is one thing and virtue is another......It is well to have a cultivated, intellect and a delicate taste......but they are no guarantee for sanctity or even for conscientiousness; they may attach to the man of the world, to the profligate, to the heart-less,—pleasant, alas, and attractive as he shows when decked out in them ......It is a real mis- take to burden knowledge with virtue." (Vide Cardinal Newman's " Knowledge, its own End.")

జూచిన నెవరికైన నొడలు కంపింపదా? ఎంతటి దృఢచిత్తుడైన నిట్టూరుపు నిగిడింపకుండునా? ఒడలుమండి, మనసు రవిలి "ఛీ! ఏటి బ్రతుకు!! తూ! ఏటిలోక!!" మని యీడూకుమడుపులు వెడలగ్రక్కుచుండ, నిరాశ యందు దొరలుచుండ నెందుండియో ఎగసివచ్చి సౌదామిని కనులం దాశను తళుక్కొత్తించుచున్నది. సచ్చరిత్రు లల్పసంఖ్యాకులైన నేమి? వీరి హృదాకాశమునుండి వెడలు మహితభావవిద్యోతమే నేటి చీకటిని చీల్చివేయుచున్నది. మనుష్యహృదయమున నేడు పిశాచము ప్రవేశించినను, అందుండి జగదీశుడు పాఱిపోలేదని ఈమెఱుపువెలుగు తెలుపుచున్నది. సద్భావమందును, సద్వాక్కునందును, సత్క్రియయందును నీవెలుగు గోచరించును. ఈవెలుగుతీవలే పృథ్విని స్వర్గమును గలుపు ప్రభాకలితప్రణయసూత్రములు. ఈయాలోకసూత్రములే మహాపురుషుల జీవనచరిత్రలందలి భాస్వంతస్వర్ణపంక్తులు. సద్భావమును నెమకువారు నాగేశ్వరరావును గానకమానరు. సద్వాక్కును వినగోరువారు నాగేశ్వరరావును జేరకమానరు. సత్క్రియ నెఱుగబూనువారు నాగేశ్వరరావును జూడకమానరు. కాంతివంతమగు చరిత్రము నాగేశ్వరరావుదని గుర్తింపకమానరు. సంతతసంతప్తహృదయమున శీతలభావసేచనమొనరించు అమృతమయహృదయము దేశోద్ధారకునిది. అభాగులపై నగ్నిగురిపించు దుర్విధి నెదుర్కొని, హృదయవిదారకమగు వ్యథ నణచి, జీవనయుద్ధాంగణమున తెగిపడిన గుండియలను బలయుతభావసూత్రములచే గుట్టి, మనసున నాదరాంజన మిడి, ఆత్మనందనమున నసువులు నిలిపి, అవిరళముగ కారుణ్యమునొడ్డించు దొడ్డహృదయము విశ్వదాతది.

ఘనకార్యములకు వలయు భావశబలతయు, కళోపాసనమునకు వలసిన భావావేశమును హృదయమందే పెంపారును. కళకును ఆదర్శజీవనమునకును సన్నిహితసంబంధమున్నది. కళోపాసనమున నాగేశ్వరరావునకు మక్కువ ఎక్కువ. ప్రజాసేవపై అతనికి ప్రీతిమెండు. కళోపాసనాదేశసేవలు గంగాయమునల ట్లాతని జీవనభూమియందు వెలసినవి.

శైశవమందే దేశోద్ధారకుని హృదయకుంజము ఆశయప్రసూనములతో ప్రస్ఫుటించినది.

తానుచేరవలయు ఆదర్శమును బాల్యమున నూహయందే ప్రతిష్ఠించి, భాసమానమగుచున్న గమ్యస్థానము దెస నడుగులువేయుచు, మిడత్రాలు పిడుగులను పిడికిట బట్టి, ఆత్మజీవనమున విజయధ్వజమెత్తుట మహాపురుష లక్షణము.

ఊహ బూటకముకాదు. పొగమంచువలె నర్థాయుష్యముగలది కాదు. కృష్ణపక్షకౌముదివలెనది ఏ ముహూర్తమందో గభీరనిశీథినీసంతమసమున బుడుంగు మనునదికాదు. ఎండినఆకులీల నేలరాలి, తీవ్రావర్తఝంఝయం దెగసిపోదు. అది మనుజుని చిరాస్తి. జన్మజన్మలం దది వానినుండి కదలిపోదు. అదృశ్యమను ప్యాంతరంగమున దానికి మజిలీలున్నవి. అంతియే. మానసదిగ్వలయమున పొడసూపిన భావము మరణము నెఱుగదు. సూర్యునట్లు కొండొకవేళ నది యస్తమింపవచ్చును. అస్తమించునాదిత్యుడు అంతమయ్యెనని ఎవ రందురు? నేడు తరలిన తరణి రేపు తన కిరణవితానమును వెదజల్లులీల, భాస్వంతభావము నేడు మానసదివిపై గోచరింపకున్నను, ఎడందపొడుపుకొండనుండి రేపు మయూఖవర్షమును గురిపించితీరును. అనంతవిశ్వమున వసువు వెలుంగు టొక్క వసుమతియందే కాదు. అంతరంగమహావిశ్వమున నూహయు ననారతము స్మృతివియత్తలమందే వెలుగొందును. నిహితమైన భావము ఆత్మచే నాహూయమానమై అంతరంగాంతరిక్షమున ప్రత్యక్షమగును. ఆహ్వానమందనితఱి ఈభావము అంతరంగమందే మఱింతలోతుగ దిగజారును. భావభ్రమణమున ఘట్టములున్నవి. వీనినే మనశ్శాస్త్రము Conscious, Unconscious, Subconscious అని పేర్కొనుచున్నదని నాతలంపు.

మహాపురుషుడు నిహితభావమును తఱచుగ నెమరువేయుచుండును. ఆత్మశక్తిని అద్భుతముగ వృద్ధిజేసిన ఋషులు గతభవభావములను స్మృతిపీఠమున నేజరిల్లుట జూచువారని వినుదుము.

భావము బీజమువంటిదనినను అనవచ్చును. అది మడియనుకావున నదృశ్యదివ్యవటవృక్షమై అనంతకాలమున దన శాఖలను వ్యాపింపజేయును. ఈచెట్టుపాలు అద్భుతార్థముగల భావదుగ్ధము. ఈచెట్టుయూడల జిగి మిగుల నబ్బురమైనది. మనుజుని హృదయమున శైశవమునందే చూపట్టు భావము గతభవమందే నాటుకొనిన గట్టి యూడయైన గావచ్చును; లేకున్న నిపుడుదయించిన పిల్లయూడయై, భావిజీవనమున, భావిభవమున ముదురునట్టిదైన గావచ్చును. బాలకుడైన నాగేశ్వరరావు హృదయకుజమున బుట్టిన తలపుటూడలు నానాటికి పెరిగినవి; శక్తినందినవి. పిచ్చివానితలపు లనునో, తడపలట్టివి ఈతఱిలోనే తునకలయ్యెడివి. ఇవి క్రమవృద్ధి నందినవి కావున నేడంతేని నీడనిచ్చుచున్నవి. నీడకై ప్రజలు నాగేశ్వరరావునే ఏలచేరెదరు?

ఉత్తమాశయము శూరశిఖామణినే వరించును. వ్యక్తిశక్తిని పరీక్షించిగాని, వాని తపఃఫలమును పరిశీలించిగాని ఆశయ మాతనికి చిక్కక శుక్రతారవలె సెంతో వెలుంగును. నారమునుండి పృథ్వీదికలను రాల్చుఆశయము పరీక్షయందు సౌధము మున్గ్రిన్గను కాగనే, చివాలున గదలి ఆతని కంఠరసీమయందు శమంతకమై కాంతిలును.

పరీక్షనెఱుగక నాగేశ్వరరావు పెద్దకాలేదు. అయినచో, నీతని పెద్దతీకముపై సుమవర్షము కురియకుండెడిది ఈతని నిశ్చితాభిప్రాయమును అట్టిటులాడింపనెంచిన నిష్ఠురపరిస్థితులు శైశవమున నాగేశ్వరరావును మార్కొనినవి. ఈయభిప్రాయము నైసర్గికమైన ఊడగాక ఎఱవుబడనిదయ్యెనచో దూఃపింజవలె నాటితుపానులో నెగిరిపోయెడిది వెనుకంజవేయకగుండెను గట్టిచేసికొని నాగేశ్వరరావు నెగ్గెదనని పట్టుపట్టినాడు. ఇచ్ఛాశక్తిని శివలింగమట్లు అంతరంగమున ప్రతిష్ఠించినాడు. ఇచ్ఛాశక్తిమ్రోల యమకింకరులబోలు నరిష్టములెంత? పాశముజేబూనిన జముడెంత? నాగేశ్వరరావు ఈశ్వరసాహాయ్య మందినాడు. ఇక్కట్టులను నెట్టివేసినాడు. నాటి యద్భుతానుభవము ఈతనిప్రకృతియందు మఱికొన్ని గురుగుణములను పుట్టించినది. అదియే ఈతని కర్థాంగలక్ష్మియై నిరుపేదల కీతని గన్నతండ్రి జేసినది.

మనుష్యజీవనమందలి సంఘటనములు గాలియందెగురు గుఱ్ఱప్రోవులవంటివి కావు. ఇవి గభీరార్థ బంధురములు. ఈసంఘటనములు మూలవిరాట్టువలె నిజరూపమును మనకు వ్యక్తీకరింపవు. వీని యంగప్రత్యంగములు భూతభవిష్యద్వర్తమానములందు వ్యాపించినవి. పరిమితజ్ఞానమే మనయదికావున కట్టెదుటదోచు అంగభాగమును చూచి, "అమ్మో!" అందుము. ఓపికపట్టితిమేని, శుద్ధబుద్ధమునస్వరూపము కాకున్న, విశ్వరూపమైన మనకు ప్రత్యక్షమగును. మన సహనమే మనకీరూపును చూపు దివ్యచక్షువగును. వికృతములట్లు తోచిన సంఘటనములు కాలక్రమమున సౌందర్యసందీప్తములైన అనుభవములై చూపట్టును. సామాన్యుల కీవిషయము హృదయంగమము కాకపోవచ్చును. కన్నుగలిగి మనుష్యజీవనతత్త్వమును పరిశీలించువాని కివి క్రొత్తపాఠము కాదు. కట్టెదుట కష్టమే చూపట్టలేదని పల్కువాడు అబద్ధపు బ్రతుకు కడపు అల్పుడు. కష్టమెఱుగనివాడు మనుష్యుడనిపించుకొనుటకు కర్హుడుకాడు. మహాకష్టముల బడనివాడు మహాపురుషు డెట్లగును? పల్వురు గూడి ఒకబొట్టబొమ్మను తయారుచేయగలరు. ఒక్క మహాపురుషుని నిర్మించునవి భీకరపరిస్థితులే! వీనియందు నిష్ఠురమైన విశ్వామిత్ర ముండును. సామాన్యమానవుని కింద్రపదవి నిచ్చున దీవిశ్వామిత్రమే! సామాన్యమానవుని దిగంత విశ్రాంత కీర్తిమంతుని జేయున దీవిశ్వామిత్రమే! మహాపురుషుల జీవనములను పురాదులతోకూడ పరీక్షించినగాని సత్యము కండ్లపడదు. పైనదోచు శిఖరముపై గీతికావితానము గుప్పువాడు మనసుగాని, బుద్ధిగాని, ఆత్మగౌరవముగాని లేని భట్రాజుమాత్రమే. సత్యమునకు మూలబంధములైన అంశములను పరిశీలింపనివారు ఆసత్యము భూతకివంటి అబద్ధమని అపోహపడుదురు. అందేదో స్వార్థము నిహితమైయున్నదను చవుకయూహను తేల్చెదరు. లోకచెరుగుడు మఱొక్కనిపట్ల చెల్లునేమోకాని మహాపురుషునిపట్ల కాదు. ఈగ్రంథభూమియందు నేజేర్కొనువ్యక్తులు

ఆటబొమ్మలట్లు నేనుండి శేపు ముక్కలగువారు కారు. వీరియం దేదేని గురుగుణము లేనిచో, నాకలము వీరిపై కన్నువేయుట కొప్పెడిదికాదు. నాగేశ్వరరావునకు నేడంతోరైశ్వర్య మున్నది; ప్రతిభ యున్నది. గారడి వలనగాక వీని నీతడు క్రమనిష్ఠవలన నందెనని తెలుపుట నాయాశయము.

ఉన్నతోద్దేశసిద్ధికి వలసిన వాతావరణము నాడాంధ్రమండలమున నంతగాలేదు. నాగేశ్వరరావు కలకత్తాకరిగెను. అందుండి బొంబాయియేగి భావిజీవనమునకు వలసిన మూలబంధము నందు స్థాపించుకొనెను.

వాణిజ్యాంగణమున వెలుగొందు కాసులరాసులు యువకుడైన నాగేశ్వరరావుకన్నుగుట్టినవి. స్వాతంత్ర్య కాంక్షికి వాణిజ్య మనుకూలమైనదని గుర్తించినాడు. అచిరములో దానితో సంపర్కముగలిగించుకొనినాడు. నాగేశ్వరరావుచేత జిక్కుట అమృతాంజనముయొక్క అదృష్టము. అమృతాంజనమును జగద్ధితముజేసినది నాగేశ్వరరావు దృఢనిశ్చయము. ఈతడు కాక మఱొక్కండాయంజనమును గేలబూనియున్నచో నేకిరాయికొట్టునందో బిక్కమొగముచేసికొని కూర్చుండువాడు. నాగేశ్వరరావుఐశ్వర్యమున కాతని అమృతాంజనము నిమిత్తమాత్రమే. అమృతాంజనము కాకున్న వేఱొకసుధాంజన మాతని యుద్దేశఫలమునకు సాధనమయ్యెడిది. నాగేశ్వరరావుఘనత ఆతని యమృతాంజనమందుగాని, అధికవిభూతియందుగాని లేదు. ఈవిభూతికిని, ఆయంజనమునకును మూలకందమైన దృఢహృదయశక్తి ఆతని జీవనమండపమున జేగంట మ్రోగించినది! అంజనకర్తలెందఱులేరు? ఐశ్వర్యవంతు లెందఱులేరు? వీరందఱు మనుష్యత్వముగల మానవులనుట దబ్బర. స్వార్థము నారాధించి, ఉత్తమాశయములకు నిప్పంటించి, వీరిలో పల్వురు తమ బ్రతుకుల వడలుపుట్టించు కొరకంచులు చేసికొనలేదా?

ధనసంపాదనము నాగేశ్వరరావునకు పరమాశయమేయైనచో, అతడు దేశోద్ధారకుడు కాకయుండును; విశ్వదాతయను నామాంతర మాతనికి చెల్లకపోయెడిది. పరుసవేది తాకినంతన లోహము బంగారగునట. ఆపర్కజీవనమునకు చెఱుపుదెచ్చు ధనము నాగేశ్వరరావు హృదయస్పర్శకతన అపూర్వరూపము నందినది: అధునాతన ఆంధ్రపృథ్వికి ఆయువును, ఆశను, ఆలోకమును ఒసగినది తనసంస్థలతో తెలుగునేలనుండి ఒక్కదినము నాగేశ్వరరావు సెలవుదీసికొనుచో, కారుచీకటు లీనేలను మూర్కొనితీఱును అర్వాచీన ఆంధ్రజాతికి కొంతవిజ్ఞానభిక్ష పెట్టినవాడు నాగేశ్వరరావు. అర్వాచీన ఆంధ్రజాతి! ఉత్సాహమును, తేజమును ప్రసాదించినవాడు నాగేశ్వరరావు. అర్వాచీన ఆంధ్రజాతికి వ్యక్తిత్వ మిచ్చినవాడు నాగేశ్వరరావు. అర్వాచీనఆంధ్రజాతికి ఆయువుపోసినవాడు నాగేశ్వరరావు. ఇట్లని నిరూపింపగలిగనేని, నా లేఖిని అసృతమయమైన సిరాయందుగాక అమృతమయమైన సత్యమున తానమాడిన ట్లానందించును

ఆంధ్రహృదయమున స్పందనముతోచినది౧౯౦౬, ౧౯౦౭, ౧౯౦౮ లలో. ఆంధ్రపత్రికపుట్టిన దీసమయమందే. నాసికయందుబుట్టి, మధురసామగానమట్లు ఆంధ్రావనియందు ప్రవహించి, ఆంధ్రకవిత్వమునకు అవిరళధారను, ఆంధ్రజాతికి అమృతజీవనమిచ్చిన గోదావరిశైవలినిలీల, నాసికసమీపమున జనించి, విజ్ఞానవీచికల నాంధ్రలోకమున పాటించి, ఆంధ్రపత్రిక ఆంధ్రులకు నూతనజీవ మొసగినది. వినువీథినుండి వసుమతిని సమీపించు సర్వభగవానుడు మఱింతపెద్దయై, వసతశోభను పృథ్విపై కలువడించులీల, పుట్టినచోటునుండి కదలివచ్చిన ఆంధ్రపత్రిక మఱింతపెద్దయై, ఆంధ్రవసుంధరయందు విజ్ఞానవసుచ్ఛటలనువెలారించుచున్నది. ఆంధ్రుల ఏకైకదైనికపత్రికయై ఆంధ్రరాష్ట్రమునందే కాక అన్యరాష్ట్రములందుగూడ నూరూరను, ఇంటింటను దినదినము చేరుచు, రెండుకోట్ల ఏబదిలక్షల ఆంధ్రులకు చెలియై, చుట్టమై మెలంగినది ఆంధ్రపత్రిక. అధునాతనమనుష్యజీవనమునకు సంచలనమిచ్చునది పత్రికయని ఆంధ్రులకు తొలుతనుద్బోధించి, ఏపుక్కిటిపురాణములందో, ఏ విస్తారపు కథలందో, ఏవింతకబురులందో, ఏసంతరొదయందో కాలముగడపు ఆంధ్ర

బాధులకు రాజకీయాంశములను ప్రబోధించి, వారికి క్రొత్తకన్నొసగినది ఆంధ్రపత్రిక. అధునాతన ఆంధ్ర జాతికిని, ఆంధ్రపత్రికకును అవినాభావసంబంధ మున్న దనుట అనృతము కాదు.

ఆంధ్రపత్రికను స్థాపించియేకాదు, కాంగ్రెసు ఉద్యమమున విశేషకృషిసలిపి నాగేశ్వరరావాంధ్రు లందు రాజకీయసంచలనము గలిగించినాడు. గాంధిజీ పాంచజన్యమును పూరించినంతనే ముందంజవేసిన ఆంధ్ర ప్రముఖులలో నీత డొకడు. గాంధిజీపై నీతనికి గల ప్రేమ అనల్పమైనది. ఈతనిపై వారికి గల వాత్సల్య మవ్యాజమైనది. మెచ్చు వ్యక్తియు, మెప్పువడయు వ్యక్తియు నేకైకభావ డోలికయందే ఊగులాడుదురు. ప్రజాకాంక్షియై తనువుగ నుపవలెనని నాగేశ్వరరావు వాంఛించినాడు. కుంచములలో దూకలను కొలుచు కోనువ్యక్తి హంసతూలికాతల్పమందే జీవనము గడుప గలుగును. నిరాడంబర జీవనమును, సమయసమయము లందు దీర్ఘోపవాసాభ్యాసమును, ప్రజల కష్టనిష్ఠురము లను మాచి దురంతసంతాపమొందు వ్యక్తికి సహజ మైనవి. గులాబు లొరులకును, ముండ్లు తనకును అని ప్రవర్తించువాడే పరార్థజీవి. వితరణమునుగుఱించి గురు గంభీరోపన్యాసము లొసగి, ఉన్నతాశయములపై నా శుకవనమల్లి ప్రత్యేకపరీక్షాసమయమున కాళ్లు ముడుచు కొని, తమపరపతిని, తమపలుకుబడిని పురస్కరించు కొని నిరుపేదలను, నిర్భాగ్యులను ఆటుగోతులందు గూలద్రోసి, బొగ్గుబోలు మనసు మొగమున ప్రతిఫలింప కుండుటకై చక్కని కళాయిని పూసికొని, రంగస్థల మున తెయ్యిమను పాపులు పెద్దతలకాయలలో కొంద రున్నారు. వీరికిని నాగేశ్వరరావునకును కనుమాపులు లేవు. స్వార్థముపై గుడిగోపురము గట్టువారికిని ఈతని కిని మాటలులేవు. పరార్థజీవి నాగేశ్వరరావని గుర్తిం పనివా రాంధ్రావనియందు లేరు.

జాతీయత్వమన కట్టె గారడియనియు, చక్కని మోళీయనియు, ధనకాకొట్టుటకు పనికివచ్చు ఉపాయ మనియు అన్యదేశీయు లర్థముచెప్పవచ్చును. భారత భూమియందు జాతీయత్వమునకు ప్రత్యేకార్థము కలదు. ఉన్నతఆధ్యాత్మికాశయమును, జాతీయత్వమును పార్వతీపరమేశులట్లు మననేలయందు వెలయుచున్నవి. గాంధి యుగమున నీభావ మెంతేని ప్రాముఖ్యము నందినది. త్యాగము కాంగ్రెసునకు తారకమంత్రమైనది. భారతాంబ అధిష్ఠానదేవియై, గాంధీసంయమి ప్రధానాచార్యుడై స్వాతంత్ర్యోపాసకులకు నూతనబలమును, అపూర్వతేజమును ఒసగిరి. కావుననే స్త్రీ పురుషులును, బాలబాలికలును కిక్కురుమనకుండ దుస్సహాగారమును ననుభవించిరి. గాంధియుద్బోధించిన రాజకీయములందలి మహత్త్వమే నాగేశ్వరరావు నాతనిదిక్కుగ నాకర్షించినది. ముక్తిమంత్రమును జపించుచు, అతడు కారాగృహమున ప్రవేశించినాడు. దేశోద్ధరణమునకై కాయకష్టములుపడినాడు.

కాంగ్రెసు భక్తుడని ఇత డితరరాజకీయవాదుల నీసడించి యెఱుగడు. అభిప్రాయభేదములు కొందఱి మైత్రియందు నిప్పునెరసులగును. సముద్రముపై భయంకరతరంగములు విజృంభించుచున్నను సింధుగర్భమున ననంతశాంతి విరాజిల్లునట్లు, అభిప్రాయభేదములు—అభిప్రాయభేదములేకాదు తీవ్రవాదములును, తీవ్రతర వాక్కలహములును సమయసమయములందు రేకెత్తినను మహాపురుషుల జీవనములందు గభీరశాంతి వెలయుచునే యుండును. ఈప్రత్యేకగుణమందు వన్నెకెక్కినవారిలో నాగేశ్వరరా వొకడు. క్రోధభావమును ఒంటబట్టించు కొనుట ఈతనిప్రకృతికి ప్రతికూలము. కావుననే ఈతని కెవ్వరును శత్రువులులేరు. అన్యపక్షీయులును, అన్య అన్యజాతీయులును ఈతని ప్రేమింతురు. శ్రీనివాసశాస్త్రి కీతనిపై ప్రీతిమెండు. వంగేతరుల నంతగా మెచ్చుకొనని ప్రఫుల్లచంద్రరాయ్ తఱచుగ నాగేశ్వరరావును ప్రశంసించుచుండును. హిందూమహమ్మదీయులును, క్రైస్తవులును ఈతని యాదరానురాగ ములందుచు నీతనియెడల మిగుల నమరక్తులై యుందురు.

ప్రజాభ్యుదయమును కాంక్షించినాడు కావున నాగేశ్వరరావు ప్రజాపురోభివృద్ధి కాశయముగాగల ఉద్యమములన్నిటికి బుజమొడ్డినాడు. పాఠశాలస్థాపనమునడు, భాండాగారనిర్మాణమునడు, దేవమందిర

సంస్థాపనమునకు నాగేశ్వరరావు సాహాయ్యమందితీరెను. ఆంధ్రభావనియం దీతని పైకముండని సంస్థయే లేదని చెప్పవచ్చును. ఉచితవిద్య నొసగు లోయర్ సెకండరీపాఠశాలను చాలకాలమునకును స్నీతడు తనపల్లెయందు నెలకొలిపినాడు. పల్లెవాసులపై నీతనికి గల ప్రేమ అనూనము. ఇండ్లుకట్టుకొనుటకును, పేరంటముజేసికొనుటకును పల్లెవాసులు తామడిగినదాని నీతనికడ బడయుచుందురు. ఈతనితోడ్పాటున విద్యాధికులైనవా రెందరో ఉన్నారు. ఈతని దేశసేవ దేశోద్ధారకుడనియు, వితరణము విశ్వదాతయనియు నీతనికి నామాంతరముల నొసగినవి.

మేధావుల మన్ననలకై కావింపబడు క్రియలపై శుభాశుభతలు పడుట కాలస్వభావముపట్టును. వక్రసృష్టివలననేమి, అర్థానుస్వారజ్ఞానమువలననేమి కొందరు విమర్శకులు మహాపీరులను, మహాకవులను చెడతిట్టిరి తీవ్రవిమర్శ కీట్సుకవిగుండెలను బ్రద్ధలుచేసి అతని జంపివేసినది. దశాబ్దులును, శతాబ్దులును కడచినపిదప నేత్రమును, హృదయమునుగల మనీషి సద్విమర్శనమున సత్యము వచించినంతన నొకప్పుడు గోడ్డిలముండయ్యె వికృతస్వర మొనరించిన జనసామాన్యము క్షతమనస్కుడై చచ్చిన అభాగునుగూర్చి గీతగోవిందములు పాడును. గాంధి వలెనే నాగేశ్వరరావు మహామేధావుల మన్ననలకై ప్రాకులాడలేదు. వారియాశీస్సుల నపేక్షించి ఏకృత్యమును కావింపలేదు. జనసామాన్యము కాంక్షించు క్రియలకే తమజీవనముల నుత్సర్గమొనరింప గోరుకొనిరి. కావున వీరు సత్వరఫలము నందగలిగిరి. దుర్విమర్శనము పల్లెప్రజలకు చేతకాదు. అసంఖ్యాకులైన గ్రామవాసులు నాగేశ్వరరావును బాగుగ గుర్తించిరి. అతనికి పుష్పాంజలి సమర్పించిరి. భారతసీమయం దేజాతీయవాదియు నందని ఓట్లు నితడవల నాగేశ్వరరావందుట ఇందులకు ప్రబలతార్కాణము.

రాజకీయమహోద్యమమందేకాక, సాంఘికోద్యమము లన్నింటియందును దేశోద్ధారకుడు పాల్గొనినాడు. మూఢవిలుపులకు జంకక, కన్నెత్తులకు గొంకక, సొంతయింట శంఖముపూరించి, విజయవివాహమును జరపినాడు. హరిజనోద్యమమున విశ్వదాత విశేషకృషి సలుపుచుండెను. చాలయేండ్లకుముస్నే తన యారిబడిలోనికి వీరికి స్వాగతమనినాడు. స్త్రీపురోభివృద్ధి యెడల విశేషాదరముగలిగి స్త్రీస్వత్వములు నెగ్గితీరవలెనని ఈతడు పట్టుపట్టుచున్నాడు.

ప్రజాసేవయు, భాషాసేవయు నీత డారాధించు ఉత్కృష్టాశయము లంటినిగదా! ఈసేవలందు పూర్వాధునికముల నీత డాదరించినాడు. ఆంధ్రనాయకులందు ఆంధ్రభాషాపరిశ్రమజేసిన దిట్ట లెందరో లేరు. అట్లొనరించిన కొలదిమందిలో నీతడు ప్రధానుడు. మదరాసు క్రిష్టియన్ కళాశాలయం దున్నతవిద్యనంది, ఆంగ్లముతోబాటు ఆంధ్రమందు విశేషపరిశ్రమ సల్పినాడు. ప్లాటుఫారములపై మాతృభాషనే ప్రయోగింపవలెనను దీక్ష వంగీయులలో సుప్రసిద్ధము. వింధ్యపర్వతముల కివ్వలితట్టున నిట్టిదీక్ష ఇంచుమించుగ బండిసున్నయైయున్నదని చెప్పవచ్చును. రంగస్థలములందు తల్లిమాటకే గుసకట్ను మాయ సంకల్పించిన దాక్షిణాత్య డొక్కనాగేశ్వరరావేమో! కాంగ్రెస్‌ను ఆంధ్రసీమ కావాహ్వనించుచు, ఒకప్పు డీతడు కాంగ్రెస్ ప్లాట్‌ఫారముపై నాంగ్లమున మాట్లాడు టెఱుగుడును. మరల నీత డాంగ్లమున నుపన్యసించు టెఱుగను. బహుళగ్రంథముల కీతడు వ్రాసిన ఆంధ్రపీఠికలను పరిశీలించితిమేని, వివిధవిజ్ఞానవిషయము లీతని పిడికిటనున్నవని పఠితగుర్తింపకపోడు. జాతసజాతీకలన్నియు నొకపాత్రమైనవి. తనపీఠిక లన్నింటి నచ్చొత్తించినచో ఆంధ్రభాషామోదకు దేశోద్ధారకుడు చక్కనైనవగ నియ్యగలడు. ఈతనిశైలి నిర్దుష్టమైనది; విశేషదార్ఢ్యము గలది; ప్రాచీవిజ్ఞానమున నీతనికి గల పత్తువను ప్రకటించునది. హిందీసంస్కృతములందు దేశోద్ధారకుడు చక్కనిపరిశ్రమ సలిపినాడు.

చేవగల కళోపాసకుడే చేవగల పండితులను, కవులను గుర్తింపగలడు. విజ్ఞానధనము గలిగి, జీవననిర్వాహణమునకు వలసిన ధనములేక అల్లాడువారిని జూచి అవజ్ఞచూపు ఉన్నతపదస్థు లెందరోని ఉన్నారు. కాని,

యిట్టి యభాగులను గౌరవించుటకు దేశోద్ధారకుడు ముందంజవేయును. ఇతడు పామరులకేకాక పండితుల కును కేడుగడయని ఆంధ్రులు తెలియుదురు.

నూతనవిజ్ఞానవృద్ధికై విశ్వదాత విశేషధనమును వెచ్చించుచున్నాడు. ప్రజ్ఞాధురీణుడైన లక్ష్మణరావు మనీషి అస్తమించినపిదప ఆంధ్రవిజ్ఞానసర్వస్వమునకై ఈతడెంతేనికృషి సలుపుచున్నాడు. కళోపాసనదేశ సేవలకై సర్వశక్తులను వినియోగించు యోధులే ఈతని ఛత్రముక్రింద నిలిచిరి. ఈతడు నెలకొలిపిన 'భారతి' కళోపాసకులకు పూజాగృహమై వెలయుచున్నది. నాట్య కళపై నీతనికి గల అనురాగమును 'దుర్గాకళామంది రము' వేనోళులజాటుచున్నది. దేశసేవభాషాసేవలపై పువ్వుచెండులు విసరు సహృదయులు, దేశోద్ధారకుని గూర్చి జేజేగీతికలు పాడు ఆంధ్రులు ఈతనియండ నుండి ప్రతిముసెఱపు సేవకులను గుర్తించియేయున్నారు.

రాజకీయోద్యమమనుదు, సాంఘికోద్యమమనుదు, సారస్వతోద్యమమనుదు, సంకల్పభావనమోచనాశక్తు లట్లు పరస్పరసంబంధముగలవి. ఈయుద్యమములందు దేశో ద్ధారకుడు కొంతదగ్గుడల నందినాడు. కాని గమ్య స్థానము లింకను దూరస్థములైయున్నవి.

మూడు ఉద్యమములందు ముఖ్యమైనది రాజ కీయోద్యమము. స్వాతంత్ర్యము లభించినగాని జీవన రంగ మెద్దియు విజయమునుగాంచనేరదు. స్వాతంత్ర్య మును చేపట్టసమకట్టిన రథికునకువలసినవి అనన్యసామాన్య గురుగుణములు. కనులెదుట నగ్నివర్షము కురియుచుండ, హృదయమును సుధామయము నొనరించుకొని, ఆపదను దాటించు వెరవును తేయగలవాడే రథికునకు తోడ్పడు సారథి కావలెను. ఎట్టి కురుక్షేత్రమందైనను ఇతడే విజయధ్వజమును నిలుపగలడు.

ఆత్మజీవనవిజయమునకు తోడ్పడిన ధృతిసహన ములనే దేశజీవనవిజయమునకై దేశోద్ధారకుడు నేడు వినియోగించుచున్నాడు. పురోభాగమున ప్రతికూల శక్తులు విజృంభించుచున్నవి. స్వాతంత్ర్యప్రతమున ధార వోయబడిన సర్వశక్తులు అఖండజ్యోతియై వెలిగినవి. జ్యోతిపై ఇసుకవాన కురియదొడగినది. నరకులధ నైరాశ్యము మహోత్తరకాలము ప్రతనేతహృదయమును బట్టిపెట్టినది. విషాదయోగము తలచూపినది. నాయ కుడు నిట్టూరుపువిడువ దేశోద్ధారకుడు "ఎన్నబడితిని. ముందేమున్నదో యెఱుగను" అనినాడు. కాని అఖం డము వెలుగుచునేయున్నది. వేయితెఱగున ప్రతదీక్ష బరుగుచునేయున్నది. ఉద్యమముయొక్క హృదయ మున నిచ్ఛాశక్తి స్పందించునంతకాలము, వాడియందు దృఢనిశ్చయము కొట్టుకొనునంతదనుక భారతమాత కట్టి యడలును లేదు. మహాత్ముడును, దేశోద్ధారకుడును, తక్కుంగల స్వాతంత్ర్యోపాసకులును తమమణికట్టులకు కట్టుకొనిన కంకణములను మఱింత బిగించుకొందురని నాయాశ.

రాజకీయములందు దేశోద్ధారకునకును, తక్కిన జాతీయవాదులకును ఎక్కనికోలిక లున్నవి. కాని ఒక్కయంశమం దీతని ప్రత్యేకింపక తప్పదు. భారత జాత్యుద్ధరణమునకై నడుముగట్టి, ఆంధ్రజాతిపురోభి వృద్ధిపై కన్నువేయని ఆంధ్రనాయకులు చాలమంది యున్నారు. ఇట్లనిన వీరికి గమనున్నపై జుగుప్సయని కాదు. తెలుగుసమస్య తక్కినపెద్దసమస్యలప్రోల నం తగా పాటింపదగినది కాదని వీ రూహించియుందురు. అన్యరాష్ట్రములును, అన్యదేశములును, వీరి హృత్పీ ఠిపై పూజాకలశములై వెలయ, నాంధ్రరాష్ట్రము వీరి శుభాశంసల నందలేదు. ఇంటగెలిచి రచ్చగెలువవలెనని గుర్తించిన ఆంధ్రమహాశయుల సంఖ్య పెద్దదైనచో ఆంధ్రావనికి నేడిట్టి దుర్గతి పట్టియుండకుండెడిది. తెలుగుతల్లియాడిగమునకై విశేషధనమును, సమయ మును వెచ్చించిన దొడ్డవ్యక్తి దేశోద్ధారకుడు. ఆంధ్ర పత్రికకుకాక ఒక ఆంగ్లపత్రిక కీతడు జనకుడై యుండుచో, నీతని కీర్తిచంద్రికలు విదేశముల కెగ ప్రాకెడివి. కన్నీరుకార్చుచు తన్నుజేరు నిర్భాగ్యులకు గాక, పత్రికాముఖమున స్వర్ణాక్షరములుచెక్కు సంస్థ లకే ఈతడు తన వితరణమును నిర్దిష్టమొనరించియుం డుచో, ఆన్నార్తుల యెడ్లంయందుగాకపోయి, పణ్య వీథులం దీతనికుజెందిన ప్రతిభావాద్యము మోయకలంగ

డిది. చీరసింగారించుకొని, రంగస్థలములందు బంగారు వాయనము లిచ్చి మఱుగున పేదలకు మొండిచేయి చూపు పోతుముత్తయిదువుల కీతడు బహుయోజనముల దూరమందున్నాడు. త్యాగబుద్ధిగల వ్యక్తి నాగేశ్వర రావు. నిస్వార్థప్రేమగల పురుషుడు నాగేశ్వరరావు. నిష్కామయోగి నామాతురము లే నిరుపేదల నిత్య కీర్తనలందమరవాహినీవీచికలట్లు ప్రసరించును.

నిజరాష్ట్రమునకు తాను తెలుపవలయు కర్తవ్యమును తెలిపిన దేశోద్ధారకు డిక పెద్దంజవేయవలెను. ఆంధ్రపత్రికతోపాటు ఒకయాంగ్లదైనికపత్రిక ఈతని చేతియందు పెరుగవలెనని నాయుద్దేశము. ఇట్టిపత్రిక యొకటి చిరంజీవియై సేవసలుపకున్న నాంధ్రప్రజ్ఞగాని ఆంధ్రవ్యక్తిత్వముగాని ఆంధ్రరాష్ట్రమునకవ్వల గుర్తింపబడుట కల్ల.

మహాత్ముని వలెనే దేశోద్ధారకుడు యువకులను విశేషముగా ప్రేమించును. దేశసేవభాషాసేవలకై అసువులను నివాళులనుజేయనిశ్చయించిన విద్యార్థులైన యువకులు నేడెందఱో ఉన్నారు. పెంటపాలైన మణిపూసలట్లు వీరు నేడు వ్యర్థులైయున్నారు. బహుకాలము విస్తృతజ్ఞానకేదారమును పండింపగల భావబీజములు నేడు రిత్తవోవుచున్నవి. ఈయువకు లారాధించునవి ఆశయములు. కళకు ఆయువును, మనుష్య జీవనమునకు ఆశయ నిచ్చున వీయాశయములని నమ్మి, ముందంజను ప్రతిఘటించు ప్రతికూలపరిస్థితులందు భాస్వంతమైన తత్త్వార్థము నుపలక్షించుచు కూలక వీరు నిలిచియుండిరి. * కానివేడిగాడ్పులు విశేషముగ విజృంభించుచున్నవి. హద్దుపద్దులుకల మనుష్యసహనము చిరిగి చిందరవందరయగుచున్నది. యువజనుల దృష్టియందున్న ఆశయములే వీరి ఆయువునుదీయు భూతములైనయెడల, సర్వశక్తులు ధారవోసి వీరు చేబట్టినవిజ్ఞానము వీరిమచ్చ మాపు పిశాచమైనయెడల, జ్యోతులట్లు వెలుగు మహాపురుషుల జీవనములపై కన్నులను, మనసులను నిలిపి, ఐశ్వర్యముమీది ఆసను పోద్రోలి, ఆదర్శజీవనమునకై అశ్రాంతము శ్రమింపవలెనను నుద్దేశముతే వీరిని కంకాళములు చేసి, రాబందులట్లు పైనవ్రాలు నరిష్టములకు వీరి నప్పనమొనరించునెడల, ఘోరయాతనము నోర్చియోర్చి, చావుమూడుచున్నను తమ ఆశయములకు చెఱుపు రారాదని తున్కతున్కలగు తనువులను నిలువబెట్టుచు, బ్రదికియు చచ్చినట్లుండి, కనులనుండి వేడినీరుకాక వేడినెత్తురును గ్రుమ్మరించుచు, రుద్ధకంఠులై, క్షతచిత్తులై యుంట వీరికి తప్పనిసరియగు స్థితియగునెడల, వీరునమ్మిన ఆదర్శములే వీరి నింతకుదెచ్చునెడల, జగదీశుడన శుద్ధఅబద్ధమనియు, సృష్టియన పెద్దకుట్రయనియు, 'ఓహో!' అనిపించుకొనిన బ్రహ్మాండము బోర్లపడినదనియు' * మనుష్యజన్మమహత్త్వము బూటకమనియు, నీతినియమములు దబ్బరలనియు దిక్కులను రచ్చలుచేసికొని గొంతెత్తి వీరు వచింతురు. కత్తినాటునకు రక్తము క్రక్కని శరీర మేది? దురంత దుర్దాంతదుస్సహవ్యథకు తున్కతున్కలుకాని మనసేది? యువజనుల హృదయములనుండి సెగలును పొగలును

---

* కనుకొలుకులందు ఆశయద్యుతిగలవారు అడ్డంకులనుండియే సుగంభీరపాఠములను గ్రహింతురు. రవీంద్రుడేమనినాడో తిలకింపుడు. "The obstacles are like blocks of marble with which those who are artists among men fashion the best living imges of truth." (Vide: a Tagore's address delivered at the fifth Punjab Students' Conference.)

* మహామేధావి రాధాకృష్ణు డేమనినాడో గమనింపుడు:

"If one human soul fails to reach its divine destiny, to that extent the universe is a failure"

"If the infinite love of God is not a myth, universal salvation is a certainty." (Vide: Radhakrishnan's famous book "The Hindu view of Life" page 125.)

లేచుచుండ 'నోరయ్యలూ!' యని పెద్దలు సుద్దులాలాపించుట, తన తొంటిస్థితినుండి గుభిల్లుమనిన ఒక్క భారతసీమయందే అసంభవముకాదని తెల్లమగుచున్నది. పాశ్చాత్యసీమలందు యువజనుల నివేదనలు ఆదరాంకిత వ్యవస్థలను గాంచినవి. మనదేశమందలి యువజనుల గగ్గోలు యువజనులగోల అడవిలోని గోడగుచున్నది. మహామహులైన నాయకులే మహదాశయములకై ములను బలిదానములొనరింప సిద్ధపడు మహానాయకులే ఎదుటిప్రజ్ఞను గుర్తింపక, ఎదుటిదుస్థితి నుపలక్షింపక, ఎదుటి రోదనము వినక, ఎదుటి యారాటమునకు చలింపలేని, ఇక సామాన్యులును, చిరుగాలికన్న చెట్లును చేమలును, పుట్టలును పొదలును, రాళ్లును రప్పలును కూలుచు, ఆయువులకు చిచ్చంటించుకొనుచున్న యువజనుల నుద్ధరించుటకు నడుముగట్టునా? "నాయనలారా! నీరు మాభావియాశ" లనికదా మహానాయకులు గీతగోవిందములు పాడుచున్నారు. వీరికన్నులెదుటే వీ 'భావియాశలు' అడుగంటుచుండ, నిక నీయాశకు వనమెందులకు? ఈయాశలు నేడు క్షుధాగ్నియందు మిసుతలై మాడుచుండ, నేటి మహాపురుషుల సంతతి నేటితోనే కడముట్టదా? రాజకీయరంగములనుండు, సాంఘికాంగణములనుండు, సారస్వతక్షేత్రములనుండు, మతక్షేత్రాంగణములనుండు భావిభాగ్యమునకు, భావిసభ్యతకు తంత్రువులైన యువజనుల పురోభివృద్ధిని పురస్కరించుకొనియేకదా మహోద్యమస్యందనములను వహించుచున్నవి! తమజీవనములలో నవినాభావసంబంధ మేర్పరుచుకొనిన యువజనజీవనములకు తునకలుకాకుండ వీరు కాపాడకున్న, వీరు తమకే చెఱుపుదెచ్చుకొనరా? తమ గురుతరోద్దేశములకే తలవంపులు తెచ్చుకొనరా?

తక్కిన సమస్యలవెస తమదృష్టినంతయు కేంద్రీకరించుచు నీముఖ్యసమస్య కొఱవారచూపైన వీరు ప్రసాదింపకున్నారు. హరిజనసమస్యకై భూమ్యాకాశములు జయవిజయులట్లు కృషి సలుపుచున్నవి. సంతోషము. యువజనసమస్యకై ఇట్టికృషి జరుగనిచో హరిజనసమస్యనుగాని, మతోద్ధారసమస్యనుగాని తేవెగు ర్కొనజాలు మహారథు లెవ్వరుందురు?

రూకలరాసులను గవ్వలట్లు వెచ్చించుట దేశోద్ధారకున కలవాటు. నిరుపేదలకు కల్పద్రుమమనియు, నిర్భాగ్యులకు మందారమనియు, నిరీహులకు పారిజాతమనియు నితడు కీర్తినందినాడు. భారతసేవకసమితి బోలు లోకసమితికి ఆచార్యుడై, ఆదర్శజీవననిర్వాహాభిలాషుల కింత యండదీర్పగల దిట్ట యితడే. ఈయుత్కృష్టోద్దేశ నిర్వహణమునకు వలసిన ఆర్థిక, నైతిక, ఆధ్యాత్మికశక్తు లితని కొక్కనికే కలవు. ఇతడు రంగస్థలిపై నిలిచి ఈయుద్దేశమును ప్రకటించుచు శంఖమును పూరించినయెడల, ఈతని కేతనము చుట్టు పలువురు చేరుట నిశ్చయము. ఇట్టిసమితి కాటపందిరియగు ఘనసంస్థ భారతభావికల్యాణమునకు వేదిక కాగలదు! ఇట్టిసంస్థపై నక్షత్రములు శుభాక్షతలై రాగలవు! ఇట్టిసంస్థచుట్టు దశాబ్దులును, శతాబ్దులును తన్మయనృత్యము సలుపగలవు! ఇట్టిసంస్థపై గాంగధారవలె నీశ్వరాశీర్వాదము కురియగలదు! ఇట్టిసంస్థకు ప్రతిష్ఠాపకుడై, మణిముకుటధారియై, దేశోద్ధారకుడు భావియుగముల చేమోడ్పుల నందునా?

# చెరకురసము శుభ్రపరచుట

పూడిపెద్ది వెంకటరమణయ్య

ఇప్పటి చక్కెరవంటవిధానమును చెప్పవలసివచ్చి నప్పు డాయాయంత్రసంపత్తిని కొలదిగ సూచింప వలయును గదా!

చక్కెరవంటకర్మాగారమున వంటయిల్లు:— ఇందులో ఒకటిగాని, ఒకటికంటె నెక్కువగ గాని మరుగుడుపాత్రలు ఒకదానిప్రక్క నొక్కటిగ పేర్చబడియుండును. ఈవంటప్రొయ్యి సామాన్యపు టిటుకతోను, మట్టితోను కట్టరాదు. ఇంటిలోపలిభాగపు చెక్కపూతకుగూడ ప్రత్యేకపు మట్టి కావలయును. ఇందుకుగాను తయారుచేయబడు గట్టియిటుకలు (అగ్ని యిటుకలును, అగ్నిమట్టియును) పెద్ద వేడిమిలోనయినను చెక్కుచెదరవు. ఈప్రొయ్యి పిప్పి, బొగ్గు, కట్టెలు కూడ లోగొనునట్లు నిర్మింపబడును ఈప్రొయ్యి మండునపుడు ౧౨౦౦°C మొ. ౧౫౦౦°C వరకు నుష్ణముత్పన్నమగును. ఈయుష్ణవాయువు మరుగుడుపాత్రలను చుట్టి దాన నమర్పబడిన గొట్టములద్వారా పోయి పైని పొగగొట్టమున కెక్కి వెలువడును. ఈవేడివలన గలుగు ఆవిరిబలమును కర్మాగారములోని యంత్రమును, నీటి చిమ్మనలను నడుపుటకును, (Water Pumps) విద్యుచ్ఛక్తిని రగిల్చి కర్మాగారమున దీపములు మున్నగునవి వెలిగించుటకును ఉపయోగింతురు. ఈ యావిరిబలము కొంతతగ్గినవెనుక దానిని గొట్టములద్వారా తీసికొని చెరకురసము మరగించి దించుట కుపయోగింతురు

గానుగ:— బండ్లమీదగాని, రైళ్లమీదగాని, మోటారులారీలమీదగాని కోసిన పంటచెరకును కర్మాగారమునకు తెత్తురు. అప్పుడది తూచి, మూడేసిపాత్రములుగల గానుగలలో ఆడుదురు. ఇప్పటి గానుగలకు ౧౪ పాత్రములుండును. దానికే చెరకందించు యంత్రమును, పిప్పినుమియు యంత్రమును తగిల్చియుంతురు. చెరకుఅందించుయంత్రమును నింపుచున్నకొలది అది దానిని పైకిగొనిపోయి అసలుయంత్రమున కందించును. అక్కడ గిరగిర తిరుగు కత్తులయంత్రముండును. ఆ కత్తులు వడివడిగ తిరుగుటకుగాను మిక్కిలి వడియును, బలమునుగల యంత్రసాధనము నుపయోగింతురు. అది నిమిషమునకు నాలుగుమొదలు ఆరువందలసారులువరకు గిరగిర తిరిగి యీ అందివచ్చిన చెరకుకట్టెలను చిరుముక్కలుగ కత్తిరించివిడుచును. ఈముక్కలు మొదటి గానుగలో పడును. దీనికి V ఆకృతిగల గంట్లుగల పాత్రములు రెండేసియుండును. ఈ చిన్నముక్కలిక్కడ నలిగి రసములోని చాలభాగము నిక్కడ విడచివేయును. అది రెండవగానుగ కందును అచ్చట మరికొంతరసము జారును. ఇట్లు నాల్గవగానుగవరకుపిప్పిని నడిపి అక్కడా పిప్పికి నీరెక్కింతురు. అట్లువచ్చిన పలుచని రసమును తిరుగ రెండుమూడుగానుగలకడ వచ్చిన పిప్పికెక్కించి తిరుగ నాడుదురు. ఇట్లు గానుగాడినరసములో చక్కెర పాలు నూటికి ౯౪ మొ. ౯౫ వరకును చెరకు కర్ర నుండి వచ్చిచేరును. ఇందు కలసిననీరు కట్టుబడువునుబట్టి నూటికి ౧౫ మొ. ౩౦ వరకుండును. కొసగానుగనుండి వెలువడిన పిప్పిలో నూటికి ౪౦ మొ. ౫౦ వరకు చెమ్మ ఉండును. నూటికి ౧ మొ. ౫ వరకు చక్కెరకూడ ఉండును. దీనిని పిప్పినుమియు యంత్రమున విడుతురు.

శుభ్రపరచు సాధనము:— రసమును తూచి దానిని శుభ్రపరచు యంత్రమునకు చిమ్ముదురు. అచట దానిని శుభ్రపరచువిధానములు రెండు గలవు: (౧) గంధకవిధానము, (౨) బొగ్గుపులుసు వాయు విధానము. ఇందు మొదటివిధానమున గంధకమును మరగించి దానియావిరి నుపయోగింతురు. రెండవ విధానమున సున్నపుటావమునుండి వచ్చు బొగ్గుపులుసువాయువు నుపయోగింతురు ఇందు బొగ్గువిధానమున గంధకవిధానమునకంటె ధనవ్యయము మూడింత

లధికమగునట. దీనికి యంత్రసాధనముకూడ నెక్కుడు కావలయును. అయినను దీనివలన చక్కెర పూర్తిగ శుభ్రపడి చాలతెల్లగను, భాసమానముగను ఉండును. చాలకాలము నిలువయుండును. గంధకవిధానమున శుభ్రపరచినచక్కెర దీనికంటె చౌకగాని అది ఒకయేడాదికంటె నిలువయుండదు. అది వెంటనే అమ్ముడుపోవలెను. గానుగనుండి వచ్చిన రసము మబ్బుపడి చిక్కగనుండును. దానిని శుభ్రపరచుటకుగాను ఆరసమున సున్నము కలుపుదురు. ఈ సున్నము దానిలోని ద్రావకపదార్థములను తీసివేయును. ఈ విధానములను రసముసెరిగి, వస్తుతత్త్వమెఱిగినశాస్త్రవేత్తలు నడిపించవలయును గాని ఈ లెక్క నాగికేరనివారిచేతులకిపోరాదు.

ఇట్లు తయారయిన రసము నొకపెద్దపెనమునకు నడిపి మరగించుయంత్రమున కంపుదురు. అచటి యంత్రసాధనమువలన నారసమును మరగింతురు. అమరగుటలో నది శుభ్రపడును. తేలికయైన మాలిన్యము పైకి తెట్టెగా తేలిపోవును. దానిని తేడ్లతో తీసివేయుదురు. తరువాత నారసమును స్థిరపాత్రలలోనికి విడతురు అచ్చట నది స్థిరపడి క్రిందికి మడ్డిదిగి శుభ్రమయిన రసము తేటగ తేలును. దీనికి తేతపసపురంగుండును. శుభ్రవిధానమును సరిగా నడిపించినయెడల ఇది పావుగంట మొదలు ముప్పావుగంటలోననే స్థిరపడును. ఇట్లు స్థిరపడిన శుభ్రరసమును పైకితీసి మరగింతురు. అడుగున నిలచిన మడ్డిని గుడ్డలలో పెట్టి పిడతురు. ఈమడ్డి గట్టిఅచ్చులు కట్టును.

కాని బొగ్గుపులుసువాయువిధానమున శుభ్రపరచిన రసమునకు రంగే ఉండదు. అనగా నది సంపూర్ణముగ శుభ్రపడును. ఆవిధానమున సంతటి శుభ్రరసము వచ్చినను కోటి కర్మాగారములలో ననేకము లీవిధానమును మాని గంధకవిధానముచే నడిపింతురు. చౌకయని కాబోలు. ఇప్పుడున్న ౧౫౦ కర్మాగారములలోను ఏ అయిదు పదో బొగ్గువిధానము ననుసరింతురు. తక్కిన వన్నియు గంధకవిధానమునే యనుసరించును.

పానకమును మరగించి దించు విధానము ముందు వ్యాసమున తెలుపబడును.

# స్త్రీసాహసము

గోపరాజు రాజన్న

౧

సీతమ్మ రోజూ కోనేటికి నీళ్లకి వెళ్లడం చూస్తూ ఉన్నాడు దొంగల గురువైన కామయ్య. కోనేరు ఊరికి ఫర్లాంగుదూరములో ఉన్నది. వేసవి కాలము వచ్చినప్పటినుంచీ సీతమ్మ ప్రొద్దున్నా, సాయంత్రమూ కోనేటికి వెళ్లేది. కోనేటిగట్టుమీద విశాలమైన రావిచెట్టుక్రింద డేరాలు వేసికొని కామయ్య తనగుంపుతో బసచేశాడు. ఊరివా రందరూ కామయ్య పేరు చెప్పేసరికి చిన్న మెత్తయినా బంగారము బయట ఉంచక భూమిలో పాతిపెట్టివేశారు. కామయ్య బందిపోటుదొంగతనంలో ఆరితేరిన ఆసామీ అనిన్నీ, వాని చేతిక్రింద ఉన్న పది పదిహేనుగురూ దిట్టదీరిన బందిపోటుదొంగలనిన్నీ ఊరివారందరికీ పరిచితాలే. పాపం, సీతమ్మ కీసంగతు లేవీ తెలియవు. బందిపోటుదొంగల్ని గురించి బడిలోనైనా చదువుకొనలేదు. పుట్టింటివారు భాగ్యవంతులు అత్తవారంతకన్నా భాగ్యవంతులు. ఇంక నగలకి కొదువేమున్నది? ఆపిల్ల మొయ్యలేనన్ని నగలు ఆమెను మొయ్యమని వారు శాసించినారు.

ఒకనాడు సీతమ్మ కోనేటికి వెళ్లుతూ ఉండగా పెద్ద ఉరుములు, మెరుపులు వచ్చినవి. మనిషి మనిషీ కనపడకుండా గాలిదుమారం ఊరంతా చుట్టబెట్టినది. కామయ్యడేరాలు గాలిలో ఎగిరిపోయినవి. కోనేటికి పదడుగులదూరములో ఉన్నది సీతమ్మ. కనుబొమలు చిట్లించుకుంటూ పరకాయించి సీతమ్మవైపు చూశాడు కామయ్య. సీతమ్మ తనదే అని ఉప్పొంగిపోయాడు. డేరాలు ఎగిరిపోయినా నిశ్చింతగా మత్తెక్కినట్టు కూర్చున్నాడు. ఎంతచూస్తే తనకేమి భయం అని ధిక్కరిస్తూఉన్నట్లు సీతమ్మ రెండడుగులు వేసినది. కామయ్యను ఎవరో రాళ్లతో కొట్టుతున్నట్టు వడగళ్లవాన కోనేటిగట్టుదిక్కునుంచి ప్రారంభించినది. ఆవాన సీతమ్మనుకూడా ముంచెత్తినది. కామయ్య సీతమ్మను చూడ్డం మానివేసి సామానులు సర్దుకోడం మొదలుపెట్టాడు. సీతమ్మ వెనక్కి తిరిగింది. ఇంటికి పదడుగులు దూరంలో ఉండేసరికి వాన వెలిసిపోయినది. కాని సీతమ్మగుడ్డలు తడిసి ముద్దలైపోయినవి. పొరుగింటి ముసలమ్మ సీతమ్మను చూచి. 'అమ్మాయీ, సీతమ్మా, కోనేటివద్ద కామయ్య బసచేసి ఉన్నాడు. నగల్తో కోనేటికి వెళ్లకమ్మా', అన్నది. సీతమ్మ చిన్నచిఱునవ్వు నవ్వి, 'నగలుంటేమాత్రం కామయ్యేం చెయ్యగలడు?' అని అన్నది.




“ కామయ్యకు తగినశాస్తి......అన్నది సీతమ్మ. ”

'కామయ్య దొంగలగురువు. పసిపిల్లవు, వాడి సంగతిసమాచారం నీకేం తెలుసు?'

'ఆఁ! అలాగా! కామయ్యకు తగినశాస్తి చేస్తాను చూడండి!' అన్నది సీతమ్మ. ముసలమ్మ సీతమ్మను పరిహాసించి, 'ఔను, ఔను, ఊరివారందఱూ చెయ్యలేనిపని నీవు చెయ్యగలవు!' అన్నది.

౨

కామయ్యకు మనసు మనసులో లేదు. సీతమ్మ చిక్కితే రెండులాభాలున్నాయి. ఒకటి, సీతమ్మ చక్కనిచుక్క. రెండు, సీతమ్మ ఒంటిమీద యేలాగ లేదన్నా ఐదాఱువేల నగలున్నవి. చదివిన పుస్తకాన్నే చదివినట్టు చూచిన సీతమ్మనే రోజూ చూస్తున్నాడు కామయ్య. సీతమ్మయొక్క చక్కదనం, ఆభరణములు కామయ్యకు కంఠోపాఠమైపోయినవి. ఎప్పుడు సీతమ్మను చెఱపట్టుదమా అని వాడిమనసు పరితపించి పోతూఉన్నది.

౩

సీతమ్మ గొప్పయింటిబిడ్డ. అందమైనపడుచు. చదువు, సంగీతము చక్కగా నేర్చినపిల్ల. అత్తవారింటిలో దాసీజనము సమృద్ధిగా ఉన్నప్పటికీ స్వయముగా ఇంటిపని చక్కబెట్టుకునేది.

కామయ్యపేరు చెబితే గడగడలాడిపోతున్నారు ఊరిలోని ప్రజలు. కాక, పొరుగింటిముసలమ్మ సీతమ్మకు పిరికిమందు పోసింది. ఆ పిరికిమందుకి వశీకరురాలు కాకుండా ఉండడానికి సీతమ్మ బహువిధాల ప్రయత్నిస్తున్నది. 'ఈకామయ్యను గంగలో కలపాలి' అని సీతమ్మ నిశ్చయించుకొన్నది. కాని, యేమోస్తరుగా తన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలో తనకే తెలియదు. ఒంటరిగా కోనేటికి వెళ్లినప్పుడు కామయ్య బలాత్కారంగా చెఱపట్టితే సీతమ్మ యేమిచేయగలదు? తనపోని లోకనింద అన్నట్టు అవుతుంది. ఏమైనా సరే, కామయ్యను పరాభవించి, తనప్రాణానికైనా తెగించి, వాడిప్రాణం తీసి ఊరివారందఱి అనుగ్రహానికి పాత్రురాలు కావలె ననుకొన్నది. ఒకబందిపోటుదొంగ పది మంది అనుచరులతో కోనేటియొడ్డున బసచేస్తే ఊరివారంతా వాడికి కానుకలు సమర్పించుకోవడం, వాడి పేరు చెబితే ప్రజలు పిల్లులయిపోవడం, ఇదెక్కడి న్యాయమని సీతమ్మ తనలో తాను వితర్కించుకొన్నది.

ఒకనాడు మజ్జిగకుండ ఉట్టిమీదనుండి క్రిందకు దింపి మజ్జిగచేస్తున్నది. ఒకవేళ తనభర్త లేనిసమయములో కామయ్య తనయిల్లు చొరబడితే ఏమిచెయ్యవలెనో అని ఆమెకు సందేహము తోచినది. ఆసందేహములో మజ్జిగత్రిప్పడానికి ఉద్వాసన చెప్పినది. లేచి నిలబడి వంటింట్లోనికి వచ్చినది ఇటూ అటూ చూచి పెరటిలో కొట్టుగదిలోనికి వెళ్లినది. వెళ్లి, గునపాం ఒకటి తీసుకు వచ్చినది. దానిని పాలగదిలో ఒక మూలగా ఉంచినది. 'కామయ్యకు దీనితోనే శాస్తి' అని గంభీరముగా అన్నది. ఇంతట్లో సీతమ్మభర్త భార్యను కేకవేసాడు. సీతమ్మ పలుకలేదు. కామయ్య తనకు ఎదురుగా ఉన్నట్టయితే తను గునపముతో వాడికి ఎట్లు బుద్ధిచెప్పవలెనో సీతమ్మ నాటకపాత్ర ధరించు పాత్రధారిణివలె నటన చేస్తూ ఉన్నది. పిలుపు మీద పిలుపు పిలిచినా సీతమ్మ పలుకలేదు. అసలు సీతమ్మకు ఆపిలుపులు వినిపించనేలేదు. ప్రపంచకం అంతా మరచిపోయి కామయ్యకు స్వస్తిచెప్పు రంగములో అద్భుతనటన గావించుచున్నది.

'పట్నవాసపు పిల్లలు చెప్పినమాట వింటారా' అని గొణుగుకుంటూ శ్రీనివాసం పాలగదిలోనికి సుడిగాలివలె వచ్చాడు. సీతమ్మ నిశ్చేష్టురాలయిపోయింది. ఎదురుగా ఉన్నవాడు తనభర్తగాని కామయ్యకాడు. ఆ ఉద్రేకంలో గునపాంతో ఒక్కపెట్టు పెడితే భర్త యేమైపోను!

'ఈగునపం యేమిటి?' అని శ్రీనివాసం గద్దించాడు.

ఒకమూల సగం సగం తిప్పిన మజ్జిగ. అతని గద్దనకి ఆమజ్జిగకుండలో ఉన్న కవ్వము కొం

శాము కదలినది. కాని ఇంతవరకూ సీతమ్మ ఆడిన నాటకము చెప్పలేక ఊరుకున్నది. సీతమ్మ నోరువిప్పలేదు. ఆగునపము ఒకమూల భద్రపరచి 'ఇలారండి చెప్తా' అని భర్తను పాలగదిలోనుంచి బయటకు తీసుకువచ్చి కొంచెము ఆలోచించి 'ఏమీ లేదు' అన్నది. శ్రీనివాసానికి కోపానలము మరింత ప్రజ్వరిల్లినది. నయాన్ని, భయాన్ని అడిగిచూశాడు కాని సీతమ్మ జవాబివ్వలేదు.

౪

ప్రాతఃకాలము కోనేటిరేవుదగ్గర ఏదో కలవరము బయల్దేరినట్లు ఉన్నది. ఊరిలో వింత జరిగినట్లు చెప్పుకుంటున్నారు ఆడవాళ్లు. కొందరు యువతులు కామయ్యడేరాలవైపు పదే పదే చూస్తూ గుసగుస లాడుతున్నారు. కామయ్య సుఖాసీనుడై ఒక్కడూ డేరాలో కూర్చున్నాడు. నడిమివయస్సులో ఉన్న పురుషుడొకడు డేరాదగ్గర ఆగాడు. డేరాలోనుండి వచ్చి, 'శ్రీనివాసంగారా, దయచెయ్యండి. ఏమి యాజ్ఞ,' అని కామయ్య నమస్కరించాడు.

శ్రీని: నీకు గ్రహపీడకు మంత్రము వచ్చుటకదూ!

కామ: చిత్తం, ఏలినవారిదయ. ఏదోతగుమాత్రం. ఎవరికి మంత్రం వెయ్యాలి బాబూ?

శ్రీనివాసం కొంచెముసే పాలోచించాడు. ఆలోచించి, 'తావీదేమయినా యిస్తావా? మాయింట్లోనే కావాలి...దబ్బుని ఉంటే ఇయ్యి' అని కామయ్యను తొందరపెట్టాడు. ఒక పావులాకు తావీదుకొని శ్రీనివాసం యింటికి సాగాడు. సీతమ్మకు పిచ్చపట్టినదా? గ్రహము పట్టినదా? కామయ్య ఆమెపాలిటి గ్రహమై ఆమెను పీడిస్తున్నాడు. ఈసంగతి మగనితో ఆమె చెప్పలేదు. తావీదు కట్టుకొమ్మని కామయ్య ఇచ్చిన తావీదు శ్రీనివాసం ఆమెకు ఇచ్చాడు. 'ఆతావీదు నే కట్టుకోను. కామయ్యమొఖాన్న పారెయ్యండి. నా పిచ్చిమాటలేం గాని మీకు పిచ్చి పట్టినట్టుంది!' అని సీతమ్మ బహుధీమాగా పలికింది. ఈసంగతి కామయ్యకు తెలిసింది. కామయ్య కళ్లు చింతనిప్పులవలె చేస్తున్నాడు. ఊరంతా గడగడ లాడిపోతున్నది. కామయ్యకు కోపము తెప్పించినందుకు సీతమ్మను ఇరుగింటి పొరుగింటి అమ్మలక్కలు కేకలు వేసారు కోరి కయ్యం తెచ్చుకున్నావేటని శ్రీనివాసం విచారించాడు.

దీపాలవేళయినది. సీతమ్మ పాలగదిలోకి వెళ్లినది. మూలని పెట్టిన గునపము చూసుకున్నది. 'కామయ్య దీనితోనే శాస్తి' అని నిశ్చయించుకున్నది.

౫

మరునాడు ఎండ ఫెళ్లున కాలుస్తున్నది. సూర్యుడు నెత్తిమీదకి రాకముందే శ్రీనివాసం భోజనం చేసి రైతులను వెంటబెట్టుకొని తోటలు, పొలములు చూసుకోడానికి సాగాడు. ఇంటిలో పనులు చక్కబెట్టుకొని సావిట్లో కూర్చుంది సీతమ్మ. పొరుగింటి ముసలమ్మవచ్చి, 'సీతమ్మా, ఆవెధవతో నీకెందుకమ్మా లేనిపోని కయ్యం? కామయ్య మాయింటిమీద కన్నువేశాడుట ఏదోమోస్తరుగా వాడితో మంచిగా ఉంటే మంచిది', అని హితబోధ చేసింది. సీతమ్మమనసు ఉద్రేకపూరితమయిఉన్నది. ముసలమ్మ చెప్పినమాటలు చెవి కెక్కలేదు. కాని ఆమెతో అనవసరంగా వివాదం ఎందుకని, 'నువ్వు చెప్పినది బాగానేవుంది అత్తయ్యా అన్నిటికీ భగవంతుడే ఉన్నాడు', అని సీతమ్మ అన్నది. ముసలమ్మ అక్కడ ఒకకునుకు తీసి పిమ్మట యింటికి సాగింది.

సాయంకాలం సీతమ్మ కోనేటికి వెళ్లినది. నిన్నటివరకూఉన్న కామయ్యడేరాలు అక్కడ లేవు. రావిచెట్టుక్రింద నిశ్శబ్దముగా ఉన్నది. కామయ్యగాని, వాడి యనుచరులుగాని ఎవ్వరూ లేరు. సీతమ్మ సంతోషించింది. బిందెతో నీళ్లుముంచి బుజంమీద పెట్టుకొని ఇంటికి వెళ్లింది. సూర్యుడు అప్పుడే అస్తమించాడు. వాకిట్లో పనిచేసే నౌకర్లు ఆమె సెలవుతీసికొని గృహోన్ముఖులయినారు. ఆనీళ్లబిందె వంటింట్లో తిన్నెమీద దించింది. వెనక్కితిరిగింది ............ ఇంకెవరు! ...... కామయ్య! ...... సీతమ్మగుండె గుభేలుమంది. నిర్భయంగా సీతమ్మకు దగ్గరగా నిల్చుని

ఉన్నాడు పెదిమైనా మెదల్చకుండా కామయ్య. ఒక క్షణం ఐంది. సీతమ్మ కొంచెం ధైర్యం తెచ్చుకున్నది. ధైర్యంతో పాటు లేని చిఱునగవుకూడా తెచ్చుకుంది.
'కామయ్యా, ఏం యిలా వచ్చావు? ఏంకావాలి?'

'అమ్మా! పట్టెడు అన్నం.'

సీతమ్మ గిన్నెతో అన్నం తీసుకువచ్చింది.

'అమ్మా! యిక్కడ భోంచేస్తాను. తమచేతితో వడ్డించండి.'

సీతమ్మ వడ్డించింది. కామయ్యను కూర్చోమంది. కామయ్య కూర్చున్నాడు. గబగబ భోంచేసి మజ్జిగ కావాలన్నాడు. సీతమ్మ పాలగదిలోకి వెళ్లుతున్నది. వెనకాలే కామయ్య. సీతమ్మ చీరకొంగు పట్టుకుని లాగాడు. సీతమ్మకు కాళ్లు వొణికాయి. వెనక్కి తిరిగి, 'కామయ్యా, కూర్చో, మజ్జిగ తీసుకువస్తా', అన్నది. కాని కామయ్య కూర్చోక పాలగదిగుమ్మందగ్గర నిలవబడ్డాడు. సీతమ్మ పాలగదిలోకి వెళ్లి చటుక్కున తలుపు బిడాయించుకుంది. దీప దీపాలవేళ. ఇంట్లో యెవ్వరూ లేరు. బలిగోరుకున్నట్టు సంధ్యాచీకట్లు ఇంటి నాలుగుమూలలూ అలుముకున్నాయి. గదిలో సీతమ్మ. గదియివతల కామయ్య. తలుపు శాయశక్తులా కొట్టాడు కామయ్య. కాని లాభము లేకపోయినది. చిన్నగునపములాంటి పనిముట్టు ఒకటి మొలలోనుంచి తీశాడు. దానితో గది ద్వారం అడుగునుంచి పెల్లగించాడు. ద్వారబంధం క్రింద బాగా మనిషితలకాయ దూరేటంత రంధ్రం చేశాడు. దానిలో తనతల పెట్టాడు. ఆతల క్రమంగా గదిలోపలికి పోనిచ్చాడు చలువరాతిబొమ్మ వలెఉన్న సీతమ్మ గోచర మయింది కామయ్యకు. తల, మెడ, భుజములు పోనిచ్చాడు...సీతమ్మ గది మూలని ఉన్న గునపము తీసినది. ఎంత ధైర్యం చూపడానికి తనలో శక్తి ఉన్నదో అంత ధైర్యం చూపించి. ఆగునపంతో వాడి మెడమీద పొడిచింది ... ఆ గునపపుపోటుతో ఆశరీరం అక్కడాగిపోయింది. సీతమ్మగుండె దడదడా కొట్టుకొంటున్నది. కొట్టుకుని కొట్టుకుని కామయ్యప్రాణంపోయింది.



"ఆగునపంతో వాడి మెడమీద పొడిచింది."

* * *

పోలీసులకు ఈవార్త తెలిసింది. ప్రక్కవూళ్లో కామయ్యఅనుచరులను వాళ్లు అరెస్టు చేసారు. హఠాత్తుగా కోసేటిగట్టునుంచి వాళ్లు మకాం ఎత్తివేయడం, సీతమ్మను చెఱబట్టవలెననే దురభిప్రాయంతో శ్రీనివాసం ఇంటి నౌకర్లు లేనిసమయాన్ని శ్రీనివాసంయింటికి కామయ్య వెళ్లడం, ఇందుకుగాను వాళ్లు పన్నిన పన్నుగడ, ఆదొంగలు పోలీసులకు విస్తరించి చెప్పారు. పిదప దొంగలకు కారాగారప్రాప్తి సంభవించింది. సీతమ్మ చూపిన సాహసానికి ఆమెను ఊరిలోనివారందఱూ సన్మానించారు.

# శ్రీ సింహాచలం

నిష్ఠల నరసింహారావు

(౧౪-౮-౧౯౩౮ జరిగిన వాయుమానప్రమాదమున దైవకృపచే రక్షింపబడినవారిలో నేనుగూడ నొకడనగుటచే శ్రీ సింహాచలవృత్తాంతమును కనుగొన ప్రయత్నించి నాతెలిసినకొలది వెల్లడిచేయ సాహసించితిని.)

స్థలజ్ఞులచే చెప్పబడు గాథ ఏమన, రాక్షసచక్రవర్తియగు హిరణ్యకశిపుడు హరిభక్తుడయిన తనపుత్రుడగు ప్రహ్లాదుని శిక్షింపనెంచి చిన్నకుఱ్ఱడగు ప్రహ్లాదుని పయోనిధిలో పడత్రోసి వానిపై సింహనగము నుంచెను. జగద్రక్షకుడగు మహావిష్ణువు నారసింహావతారముదాల్చి కొండ నొకప్రక్క కాలితో నొక్కి రెండవప్రక్క లేచునట్లు చేసెను. అపుడు ప్రహ్లాదుడు పైకివచ్చి స్వామి నిలుచున్నచోటున దేవతలసహాయమున నృసింహస్వామివిగ్రహమును ప్రతిష్ఠించి పూజించుచుండెను. ఆస్థలమునే ఇప్పటిప్రహ్లాదమండపమని వాడుదురు. కొంతకాలము గడచినతర్వాత పురూరవచక్రవర్తి విమానారూఢుడయి ప్రహ్లాదస్థాపితమయిన దేవాలయముపై బోవుచుండగా విమాన మాగిపోయెనట. పురూరవుడు క్రిందకుదిగి కారణమరయగా నందు ప్రహ్లాద నిర్మితమగు దేవాలయము గాంచి స్వామికి ప్రణమిల్లి తెలియకచేసిన దోషమును బాపుకొనుటకయి ప్రహ్లాదమండపముచుట్టును ప్రస్తుతము గర్భగుడిగానున్న ఆలయము కట్టించెనట. తర్వాత రాజులు, చక్రవర్తులు పైనున్న ప్రాకారములను, ప్రాంగణములను కట్టించిరి. ఈ ఆలయమున విగ్రహము సాధారణముగ వైష్ణవదేవాలయములలో విగ్రహములవలె గోడచేర్పులేక విగ్రహముచుట్టును ప్రద



౧. దేవాలయ పరిసరములు

క్షిణము చేయుటకు వీలుగానుండి గర్భగుడికి మధ్యగా నున్నది. ఇటుల శివాలయములయందు కానవగును. భగవంతుని స్వయముగా దేవతలు ప్రతిష్ఠించుటచే నట్లుండునని స్థలజ్ఞులు చెప్పుచున్నారు. ఇందు ప్రతిష్ఠించిన దైవము విష్ణువు, క్షేత్రపాలకుడు ఈశ్వరుడు, ద్వారపాలకులు హనుమంతుడు, భైరవుడను అయియున్నారు. ఇటు లుభయసంప్రదాయములవారికి పొత్తుగలుగచేసి ప్రఖ్యాతిబడసినది యీసింహాచల క్షేత్రము.

పురాణములయు, క్షేత్రవాసులయు మాటల నటుంచి ఈదేవాలయ మెప్పుడు నిర్మితమయినదో తెలుసుకొనుటకు ప్రయత్నింతము. పురాతనశాసనములలో కళింగరాజ్యమును జయించిన కులోత్తుంగచోళ దేవుని కాలమునకు చెందిన, తమిళమున నున్న శాసనమొకటి ఈదేవాలయమున నున్నది. కులోత్తుంగచోళుడు క్రీ. శ. ౧౦౯౭ - ౧౦౯౯ న కళింగరాజ్యమును జయించినటుల చరిత్రశోధకులచే నిర్ధారణచేయబడినది. అప్పటికే ఈసింహాచలక్షేత్రము ప్రసిద్ధికెక్కియుండెను. ఇంకొకశాసనమున క్రీ. శ. ౧౧౩౭ - ౫౮ వసుండిన వెలనాటిరాజు గొంక డనునాయనరాణి యీవిగ్రహమునకు బంగారు దొడవు (తొడుపు) చేయించెనని యున్నది. మరియొకశాసనమున తూర్పుగాంగవంశజుడగు నరసింహదేవుడు క్రీ. శ. ౧౨౬౭-౬౮ లో గర్భగుడి ముఖమంటపము, నాట్యమంటపము, చుట్టుగల చావిడి (Veranda) ని నల్ల 'శానపు' రాతి స్తంభములతో కట్టించెనని యున్నది. ఇటులనే వడ్డాది మత్స్యవంశజులయొక్కయు, కొండవీటి రెడ్డిరాజులయొక్కయు, విజయనగర చక్రవర్తియగు కృష్ణదేవరాయలయొక్కయు శాసనము లిందున్నవి. చరిత్రపరిశోధకులకు ఉత్సాహకరములయందున్న చరిత్రపుగని యని సింహాచలమును చెప్పవచ్చును. రాతిపై శిల్పము పేరొందనకలసిన ఆంధ్రావనియందు సింహాచలదేవాలయము మిన్నయనదగు. భారతవర్షమున పేరెన్నికగనుగలవాటిలో నొకటిగా దీని నెంచనగును. దేవళమున గర్భగుడి నలుచదరముగ నున్నది. దానిపై ఎత్తయిన



హనుమంతద్వారము, ఆకాశధార

గోపుర మున్నది. దానిముందుండు మంటపముగూడ నలు చదరముగ నుండి దానిపైన చిన్నగోపురము గలిగి యున్నది. దీనిముందు పదునారు నల్ల 'శానపు' స్తంభములు గలిగి చౌకముగ ముఖమంటప మున్నది. వీటి అన్నిటిచుట్టును నల్లరాతి స్తంభములు గల చావిడి (Veranda) యున్నది. ఈ స్తంభములయందును, గుడి పైభాగమునను చక్కని చెక్కడములు ఉన్నవి. స్తంభముల తలకట్లన్నియు తలక్రిందుచేసిన పద్మముల వలె నున్నవి. మిగిలినభాగము వైష్ణవపురాణములలో అంశములను గోచరింపచేయునట్లును, కొంతభాగ మేమి యును చెక్కడము లేక చదును గాను ఉన్నవి. వీటిలో కొన్నిటిపై శాసనములు చెక్కబడి యున్నవి. గర్భగుడి మంటపములపై గోడలు మిగుల ప్రశస్తమయిన జిలుగులతో నున్నవి. వీటిలో జిలుగుపనితనము దూరమునుండిచూచిన ఒకతీరున నున్నను ప్రతివిషయమున దగ్గర నుండి చూచినచో విశదమగును. కోవెల జిలుగుపనితనము అంతయూ వెదకినను రెండు ఒకపోలికవి దొరకవు. ఈ జిలుగుపనితనమేగాక జంతువులు వేలకొలది భంగిమములలో చెక్కబడియున్నవి. వీటిలోగూడ సంపోలినవి రెండు దొరకవు. ఇక మనుష్యులు వివిధభూషణాములతోడను, అనేక భంగిమములలోను చెక్కబడియున్నారు. వీటిలో స్త్రీపురుషుల రతిబంధములును చిత్రింపబడి యున్నవి. ఇక దేవతలయొక్కయు, రాక్షసులయొక్కయు చిత్రములు అతినిపుణముగ చెక్కబడియున్నవి. ఇవన్నియు నరసింహరాయలు చేయించినవే. శిల్పములో పలుచోటుల బలవంతముగ పాడు చేయబడినట్లు కానబడుచున్నది. (మహమ్మదీయులచే నని స్థలజ్ఞులు చెప్పుచున్నారు.) ఎక్కువ భాగము బొత్తుగ చెక్కు సున్నముచేయబడియున్నది. (శ్రీవిజయనగరంరాణులలో నొకతె దేవదర్శనమునకు వచ్చినపుడు అందుపైనున్న శృంగారరసమయ చిత్రముల చూడనోపక అటులు మరుగుపరుప నాజ్ఞాపించెనని కొందరు, దైవదర్శనార్థమయివచ్చు యాత్రికులు పైనున్న చిత్రములచూచుచు కాలవిలంబముచేయుటచే అర్చకులకు యెంతకు పని తెమలకపోవుటచే వారు జిలుగును కప్పించి



3. చందనోత్సవమునాటి విగ్రహము

వారనికొందరు చెప్పుచున్నారు. నాకులోచినదేమనగా, పురాతనమయినరాతిపేర్పుచే కట్టినదగుటచే కొన్నిరాళ్లు కాలగతిచే సడలినను ప్రమాదములేకుండ కాపాడుటకయి చెక్కసున్నము చేసియుందురు. ఇదిగాక కారణమయిన యెడల ప్రస్తుతము విరివిగా దొరకుచున్న సిమెంటును ప్రమాదమయినచోటుల వేసిన ఇకను గట్టిగా నుండును. అలయపుచెక్కడపుపనితనమును కప్ప నవసరము లేదు.) చావిడి (Verandah) లలో నున్న స్తంభములలో నొక దానిని కప్పస్తంభమని వాడుదురు. ఇది అద్భుతమహత్త్వముగలదిగా నెంచబడుచున్నది. పశువులజాడ్యములు మాన్పగల, పిల్లలులేనివారిని సంతానవతులుగ చేయగల ప్రభావముగలదని నేటికిని ఈ స్తంభమునకు మొక్కుబడులు చెల్లించుచున్నారు. ఆలయపువెనుకభాగమునను చావిడి (Verandah) వానుకొని యొకరాతిరథమున్నది. అది రెండు పరుగిడుచున్న అశ్వములు లాగుచున్నట్లు రాతిలో స్వాభావికముగ చెక్కబడియున్నది. ఈ గుర్రముల తలలుమాత్రము శిథిలమయినవి. ముఖమంటపమున శ్రీ గోవిందరాజులవారి ఉత్సవవిగ్రహము లోహమున నున్నది. ఈవిగ్రహము మిగుల అందమయినది. గర్భగుడిలోనున్న శ్రీ నృసింహస్వామి విగ్రహము, చిన్నది. అది ఒక్క చందనయాత్రదినమునతప్ప మిగిలిన అన్నిరోజులయందును చందనముతో కప్పబడి యుండును. చందనము నొలుచు రోజున నయినను సహస్రఘటాభిషేకసమయమున దప్ప ఇతర వేళలయందు పల్చని పట్టువస్త్రముచే కప్పబడి శిరస్సునందును, వక్షమునందును చందనలేపము చేయబడియుండును. ఉగ్ర నృసింహుని శాంతింపజేయుటకయి యిట్లు చందనము పూయుదురట.



ర. గోవిందరాజస్వామి ఉత్సవవిగ్రహము

దేవళమును చావిడి చుట్టియున్న ప్రాకారమున ధ్వజస్తంభము నాట్యమంటపము, వంటశాలలు గలవు. నాట్యమంటపము ఆరుస్తంభములు గల, పదునాలు వరుసలుగలిగి మొత్తము తొంబదియారుస్తంభములు గలిగియున్నది. ఈ స్తంభము లన్నియు శిల్పకళానైపుణ్యమును దెల్పునవిగ నున్నవి. ఈ మంటపముననే స్వామికల్యాణము అతివైభవముగ జరుగును.

కోనలకు సుమారునాలుగు వందలగజములదూరములో పుట్టుధార యున్నది (దీనిగంగధారయందురు)

దీనిపైన కొండలోనుండివచ్చు నీటిజలకు అడ్డుకట్టి ఆ జలాశయమును పాడుచేయకుండ మూసి పొర్లునీటిని ధారలకు విడిచి మిగతనీరు వడియగట్టి గొట్టములద్వారా దేవాలయపు పరిసరములకు, క్రిందనున్న గ్రామమునకు కుళాయిలద్వారా పారించుచున్నారు. పొర్లునీరు యాత్రికులు స్నానములుచేయుటకు వేరువేరుస్థానములకు వేరు వేరుమార్గముల విడుచుచున్నారు. యాత్రికులు స్నానము చేసిన నీరు వృక్షములకు, పూదోటకు, వ్యవసాయమునకు నుపయోగించుచున్నారు. ఈజలధార అనునిత్యము నుండును. ఎవరును ఇంతమట్టుకు ఆగిపోయినదని చెప్పినవారుగాని, విన్నవారుగాని లేరు. ఈ నీటివసతిలేనిచో సింహాచలక్షేత్రముదర్శింపనేగు యాత్రికులకష్టములు శత్రువులకయిన కోరనట్టివిగ నుండును.

రెండుశతాబ్దములనుండి ఈసింహాచల క్షేత్రము విజయనగరంరాజుల ఆధీనమునం దున్నది. వారు ఈ ఆలయమునకు సుమారు ముప్పదివేలరూపాయలు ఆదాయము సంవత్సరమునకువచ్చు వసతు లేర్పరిచియున్నారు ఇదిగాక యాత్రికులవల్ల రెండులక్షలరూపాయలవరకు వచ్చును. ఈసొమ్మంతయు దేవాలయము క్రింద యాత్రికుల సౌకర్యమునకు, విజయనగరములోనున్న సంస్కృతపాఠశాలకు, ఇంకకొన్ని ఇతరవిషయములకు సద్వినియోగము చేయుచున్నారు. క్రీ. శ. ౧౭౮౪ న విజయనగరందివానుగారగు సీతారామరాజుగారు సిం.హాచలములోని పూలతోటను వేయించినారు. అది యిప్పటికిని అందముగనున్నది. దిగువనుండి ఆలయము దరిచేరుటకు సుమారు వెయ్యికంటె నెక్కువ మెట్లు ఎక్కవలెను. ఈమెట్ల నెక్కువారికి శ్రమ తగ్గించుటకయి మధ్యమధ్య చదునగు ప్రదేశములున్నవి. మెట్ల ఇరుపార్శ్వములందు గల నానావిధ పుష్పఫలజాతుల వృక్షములు నేత్రోత్సవముచేసి శ్రమతోచనీయవు. హనుమద్ద్వారమునకు వచ్చువరకు మెట్లప్రక్క రాతితో కట్టిన కాల్వలో ఎల్లకాలములయందు నీరు పారుచుండి దప్పిగొన్నవారికి అమృతసమానముగ నుండును. హనుమద్ద్వారముయొద్ద ఆకాశధార యున్నది. యాత్రికులు ఇచట మొదట స్నానముచేయుదురు. ఈచోటుదగ్గర నుండి మనము ఆలయపరిసరములోనికి ప్రవేశించినటుల



౫. మెట్లపయినుండి కాన్పించు దృశ్యము

గాంచుకొనవచ్చును. ఈ హనుమద్ద్వారము పూర్వము దేవాలయమును గ్రామమును కాపాడుచున్న ఇరువది నాలుగు బురుజులుగల కోటయొక్క సింహద్వారమట. ఇచ్చట మెట్లు ఇరుకుగా నుండి మెలికతిరిగియున్నవి. ఈ ద్వారమున కొలదిమంది నిలిచి ఒకసైన్యమును ఎదిరించి నిరోధించుటకు తగిన సౌకర్యమున్నది. ఆకాశ ధారలో స్నానమాచరించి హనుమద్ద్వారమున నున్న హనుమంతుని దర్శించి యాత్రికులు మధ్యనున్న రెండు మూడు ధారలయందు స్నానముచేసి ఆలయముదరి చేరి అచ్చటినుండి ఆలయమునకు కొలది దూరములోనున్న గంగధారలో స్నానముచేసి ఆలయమునకు దేవదర్శనార్థమువచ్చి మొక్కుబడులున్నచో చెల్లించి విగతపాపులమయితిమని ఆనందించి సంతోషముగ దేవప్రసాదము స్వీకరించి యిండ్లకుపోయి తాము తెచ్చిన ప్రసాదము స్వకీయులకిచ్చి, చిన్నిపాపలు హృదయములలో, నూహాప్రపంచము చిగురింప, సింహాచల సోపానములతీరు, పార్శ్వములనున్న పుష్పములసొగసు, ఫలములతీరు, ధారల నీరు, స్నానములపోరు, భిక్షుకుల కంగారు, దాసులపదములందు, బసవన్న అంకె, అంగళ్ల బారులు, శిల్పముల జిలుగు, స్వాములగాంభీర్యము, ఉద్యోగుల ఔదార్యము, క్షౌరశాలయందలి మంగళ్ల తీర్పు, సకలాభీష్టములనొసగు నృసింహస్వామిరూపము మొదలగువానివర్ణనలతో రంజింప చేయుదురు. ఇక నాగరికులగువారు దేవదర్శనార్థమయి పోవనివారు చరిత్రవిషయములకు ప్రాముఖ్యమునొసగి చోళులను, గాంగులను, మాత్స్యులను, కృష్ణదేవరాయల దిగ్విజయములను మనోవీథి స్ఫురింపజేసుకొని యానందింతురు. ఇక కళోపాసకు లగు కవులు శ్రీనాథుడు చూరగొన్న శృంగారముకొరకు, జగ్గన భయపెట్టిన బూదికొరకు ప్రయత్నించి తమ మేధస్సును మథనము చేసి ప్రకృతిని వెనుక నవనీతచోరునివలె పంచిపెట్టెదరు.

ఇక దైవభక్తి గడలినవారు గూడ నిచటికి వచ్చి తీర్చుకొనదగిన విషయము లనేకములు గలవు. ఇటుల సకలమనుజులకు ఆనందము నొడగూర్చు సింహనగమున వాయువిమానగతులమగు మాకు మటుకు ఏల విచారము కలుగవలెనని స్వామి కృపచే మా ప్రాణములను గాపాడె నని యచ్చటి పెద్దలు మమ్మాశీర్వదించిరి.



౭. మెట్ల కిరుప్రక్కల పుష్ప ఫల వృక్షములు



౭. దేవాలయముందరి బజారు



౮. తెప్పకొలను

అముద్రితమారీచీపరిణయమందలి

# స్త్రీవర్ణనము

సెట్టి లక్ష్మీనరసింహము

సుందరి కన్పఁగోర్వ పురుషోత్తము విప్పటురమ్మునట్లు న
ల్లందనమూని, దివ్యమణులన్ రమణీయముగాఁ దనర్చు; "నిం
దిందిర యున్న," దంచు నళులెల్లను దాని సమాశ్రయింప, నిం
దిందిరనామ మబ్బె జగతీస్థలి వానికి మాధవాదృతిన్.

ఆజన్మంబు తదాస్యదాస్యమునయం దబ్జంబు రేయింబవల్
జేజేలట్టులు కన్ను మూయ నని రాజీయాచు, రాజాజ్ఞచే
రాజీన మ్మగుటన్, సతీపదము లారాధింప సాగెన్; భువిన్
రాజీవమ్మనుసంజ్ఞ యక్కతననే ప్రాప్తించె నత్తమ్మికిన్.

చూడఁగ రాదు భాద్రపదశుద్ధచతుర్థిని జంద్రు నన్న యా
వాదుకఁ బాపుకొంటకయి భామ లలాటముగాఁగఁ గల్గెనై
దోడు కళాచతుష్టయముతో జనియించుచుఁ జూడ నొప్పె: న
ట్లాడిన యట్టి యాకళలనుండియె చంద్రునిమచ్చ యేర్పడెన్.

భ్రూవిక్షేపముచేతనే పురుషులం బూఁబోఁడి దా భామ్మలం
గావింపంగను, భ్రూయుగమ్మును బామల్గా నేల లోక మ్మనుం?
బూవిల్కానిధనుస్సునందుఁ గల వంపుల్ సొంపుఁ బోకుండ, భా
మావక్త్రమ్మున బమ్మ చిత్రముగ బొమ్మల్ రెండు చిత్రించెనో?

"భావిని భామకన్నుఁగవ భంగి జనించి, తదాస్యచంద్రమున్
సేవ యొనర్తు; మీజననిని జెల్వ, కళంకినె కొల్వ నయ్యె: నిం
దీవరమే లభించె" ననియే సుమి కల్వలయూసులాట; యిం
దీవరమన్న పేరొదవె దీనతచే నలుపెక్కె కల్వకున్.

"నా సికఁ దన్ను నీసకియనాసిక; దీనిని నేను గెల్వఁగా
నాసిక లే" దటంచుఁ గుసుమాస్త్రుని తూపయి చంపకంబు శం
పాసమగాత్రి సెట్టులో నవశ్యము సంపఁగ నిశ్చయించె: నా
దోసమె చేసె సంపఁగెగఁ, దుట్టతుదం దనప్రాణమే చెడన్.

[దుట్టతుదం దనప్రాణమే చెడన్ = తుదియచ్చె చెడఁగా, 'సంపఁగ' 'సంపఁగె' యైనది.]

"నవలావణ్యము గల్గు నొక్కసతి నన్నా, సృష్టి గావింపు," మం
చు విరించిన్ మదనుండు గోర, మెఱమెచ్చుల్ గొల్పు నత్తన్విఁ గ్రొ
త్తవిలాసంబులతో సృజించి, నవశబ్దంబందు సందేహదం
బవుటన్, నిల్పెను దొమ్ముదుల్ చెవులుగా నబ్జాసనుండామెకున్.

అమృతము మాధురీగుణమునందు వెలందుకకమ్మమోవి చం
దము గలదన్నమాట యనృత, మ్మనృత, మ్మనృతమ్ము: దాని నా
మమనృతమే యగున్ విన సమంబుగ నంచు నెఱింగియే కదా
కొామమధురోష్ఠపానమునకున్ విబుధుల్ దమకింతు రర్థులై.

[వినసమంబుగన్ = నకార విరహితమై మకారసహితమైనయెడల, 'అనృత' 'సమృత'మగును.]

పగడంపుబరణిఁ దెఱవఁగ - నగపడియెడి మంచిముత్తియపుఁగోవగతిన్
ముగుద నగుచు వాతెఱ తెఱ - వఁగ నటఁ బల్కుమరు దోఁచుఁ బల్కుదురౌచున్.

చిఱునగ పంకురింపఁగనె చేడియ చొక్కపుఁజెక్కులందు న
త్తఱి నునులొత్తలేర్పడు; సుధారసమే తెలివవ్వ రీతి వా
తెఱ నుదయంబు నొంది, యిరుదిక్కులఁ బాఱఁగ, బుగ్గలందులోఁ
దఱచుగ బద్ధలైనగతి: దానసె చెక్కులు బుగ్గ లౌటయున్.

[బుగ్గలు = మడుగులు; చెక్కులు.]

మదవతికంధరంబు కవిమండలి కంబుసమాన మంటకుం,
దుదియు మొదల్ సమానముగఁ దోఁచుటె హేతువు: చూపఁ దగ్గ యొ
ప్పదమునఁ గాని, వీనులకు విందగు సుస్వరమందుఁ గాని, పో
లఁ దరము గామినే దర మిలన్ దరము గ్గని మున్నె నంబుధిన్.

['కంధరంబు' అనుమాటయొక్క తుదియు, మొదలును సమానముగా 'కంబు' అగును.]

"పంచమకులంబునన్ జనియించి, మధువు- లేనికాలంబునం దెల్ల హీన మూను;
సరిగ ధమని లేకెటు పాడఁ జాలు ?" నని పి-కంబును హసించుఁ గలకంఠికంఠరవము.

[పంచమకులంబు = కోకిలకులము, మాలజాతి; మధువు లేని కాలంబు = వసంతఋతువు లేని కాలము కల్లు దొరగనియప్పుడు; ధమని = కంఠము : సరిగ ధమని లేక =కంఠము సరిగాలేక, స, రి, గ, మ, ధ, ని, లేక యొక్క పంచమస్వరమే కలిగి.]

మించును దళ్కుబెళ్కులను మించును, బైఁడిని రంగునందు న
న్మించును, బూవుఁ దావిని దమించును, మార్దవమం దిగుళ్లనే

మించును, దీఁగ బాగున యమించును, మానిని మేనుఁ గానఁ, గా
మించును దా ననంగుఁడు, భ్రమించును లోకము దానిఁ గాంచినన్.

మెఱుఁగుఁబోఁడి యటంచు మెలఁతను గూర్చి పల్కంగ, మిన్నందు మెఱుంగులెల్లఁ;
జిగురుఁబోఁడి యటంచుఁ జేడెను గూర్చిపల్కఁగ, రాగముం బూను జిగురు లెల్లఁ;
బూవుఁబోఁడి యటంచుఁ బొలఁతిఁగూర్చి పలుకంగా,వికాసము గాంచుఁ బూవులెల్లఁ;
నీఁగెఁబోఁడి యటంచుఁ దెఱవఁ గూర్చి పలుక, దెసలకు నెగఁబ్రాఁకు దీఁగె లెల్ల;
బోఁటిఁ గూరిచి బంగరుఁబోఁడి యంచుఁ-బలుకమి,నసూయ బంగరు పచ్చఁబాఱె
దానిపై నభిమానమ్ము పూనిసుమ్మ, బంగరున్బొమ్మ యగుచుఁ జెలంగెఁ గొమ్మ.

వస్త్రాచ్ఛాదితనైజవైభవములై వర్ణింపఁగా రానివౌ
నాస్త్రీరత్నముమేనియంగముల సాహాయ్యంబునం జేసి పం
చాస్త్రుం డంగవిహీనుఁ డయ్యు, బల మత్యంతంబు వర్ధిల్లఁగా,
నిస్త్రింశంబును నూఱుఁ బూరుషులపై నిస్త్రింశ పాపూన్కితోఁ.

నాతిమనోజ్ఞబాహువులు నవ్యమృణాళము లంచు నెంచి, త
న్నాతురపాటుతోఁ బరమహంసలుసైతము వెంబడింప, వి
ఖ్యాతము లైనయట్టి నడకల్ సతి యోర్చున నేర్చి, బ్రహ్మచ
ర్యాతిశయత్వముం గలుగునట్లుగఁ జేయు మహోదరంబునన్.

పల్లవముల్ యథార్థముగఁ బాదలవంబు లటంచు నామమే
తెల్లము చేయుచుండ, సుదతీమణి హస్తము లంట కల్లయే:
యెల్లరు నామెఁ గొమ్మ యను హేతువునం జివరల్ చివుళ్లు కాఁ
జెల్లు నటంచుఁ దప్పగను జేతులఁ గూర్చి తలంచిరో కవుల్ ?

[పల్లవములు=పత్ × లవములు.]

బాలపదమ్ము లచ్చముగఁ బద్మము లౌట నిజమ్ము; లక్ష్మి ప
ద్మాలయ గాన, మధ్యమున మావడి వచ్చి తనంత నిల్చె: నీ
లీల ఘటిల్లకున్నయెడ, లేమపదంబులమీఁద మాటికిన్
వ్రాలఁగ నేటికిం బురుషవర్గనిరీక్షణభృంగకోటికిన్.

[లక్ష్మి పద్మాలయ గావున పద్మమే యైనపదము నడుమ, మా=లక్ష్మి, వడి=వేగముగా, వచ్చి తనంత నిలిచెను; 'పదము' అనుమాట నడుమను (అనఁగా, నడుమ నున్న 'ద' మీఁద మావడి వచ్చి నిల్చినయెడల, 'పద్మము'గాఁ దేలును గదా!]

చెలినడ లభ్యసించుటకుఁ జేరిన యేనుఁగు లామెసుందర
త్వలహరిలో మొసళ్ళగుచు వర్తిలు జంఘులఁ గాంచి పాఱె; హం
స, లట సరోరుహంబు లయి చానపదంబులు దోఁచ, నింపునన్
నిలిచి, యొకించుకించుకగ నేర్చుకొనెన్ సతియానవైఖరుల్.

తమ్ములు కొమ్మకన్నుఁగవతమ్ములు; తొల్కరికాఱుమబ్బుమొ
త్తమ్ములు చానవేణికి నతమ్ములు; తేనియలూఱు మేలిచూ
తమ్ములు కాంతమోవి కహితమ్ములు; విచ్చినయట్టి పారిజా
తమ్ములు చేడె చల్లనిస్మితమ్ములకున్ వినతమ్ములెమ్మెయిన్.

కందము జడ ; చందము మెడ ; మందము నడ ; నుడులతీపు మకరందము ; మా
కందము, వరకుందము, నరవిందము, తరళేక్షణ పెదవియును, దనుముఖముల్.

ఆదిశూన్యోపమా జఘన మయ్యాబలకభరి-మధ్యశూన్యోపమైన కబరి మానినినడ;
యంత్యశూన్యోపమా నడ యాననము గాంతకును - సర్వశూన్యోపమానకును మిన్ ; కుచము
[జఘనము.

ఒక నరుచే నిరాకరణమొందిన యూర్వశియున్, వధూరు శో
భకుఁ దలవంచు రంభయును, బాఱుగతిన్ మదిఁ గోరువాని మా
నక వెనుకొన్న మేనకయు, నచ్చట పట్టిది రోమరామణీ
యకమును గన్నవారి కన, నన్యులమాట తలంప నేటికిన్.

[నరుచేన్ = నరపురుషునిచేత ; అర్జునునిచేత. వధూరుశోభ = వధూ + ఊరుశోభ; వధూ + ఉరుశోభ. రంభ = అచ్చర; అరటిచెట్టు. పాఱుగతి మదిఁ గోరువాఁడు = పరుగెత్తి పాఱిపోవుటకుఁ జూచువాఁడు; (బ్రాహ్మణత్వము పొందఁగోరు విశ్వామిత్రుఁడు.]

వనితపెన్నెఱులు వేఁపునుఁ గప్ప నంచు, మొగమ్ము ముద్దులమూటగట్టు నంచుఁ,
చెలువవాల్గన్నులు దీర్ఘంబు లంచు, లేనగవులు సుప్రసన్నము లటంచు,
నువిదకెమ్మోవి నోరూరించు నంచు, నెన్నడు మెల్లఁ బిడికిట నడఁగు నంచు,
నతివశరీర మొయ్యారంబు గలదంచు, నాతినెన్నడలు మందము లటంచు,
మించుఁబోఁణి రతిని మించు నటంచు వర్ణించుటెల్ల నట్టి నిష్ఫలంబు:
చూచి తీరవలయు వాచామగోచర-మై చెలంగు సుందరాంగి సొగసు.

## ౭

భావ సం. కార్తికమాసపు సంచికయందలి ౬-వ వ్యాసమున కాయధాన్యములను గురించియు, చమురుగింజలను గురించియు వ్రాయబడెను. ఇందు పాలు, పెరుగు మొదలగు క్షీరద్రవ్యముల యాహారయోగ్యతను గూర్చి తెలుపబడును.

### ౬. పాలు, పెరుగు వగైరాలు

దృక్సంబంధమగు చమురుదినుసులవలెనే ఆవులు, గేదెలు, మేకలు మొదలగువాని పాలుకూడ మాంసకృత్తులను, చమురునుకూడ నొసగును. చమురుగింజల నుండి చమురును దీసి యుపయోగింపగలుగునట్లే పాల నుండి క్రీమును, వెన్నను విడదీసి వానినట్లేగాని, నేతిని తయారుచేసిగాని యుపయోగింపవచ్చును.

ఈక్రింద ఆయాజంతువుల పాలసంఘట్టనము చూపబడెను:

| | | | ఒక ఔన్సులో గల మాంసకృత్తులు (గ్రాములు) | చమురు (గ్రాములు) | కర్బనోద జనితములు (గ్రాములు) | మొత్తపు ఇంధనశక్తి (కాలరీలు) | ౧౦ ఔన్సులు లేక సుమారు ఒక పావు సేరుపాలు ఇంధనశక్తి |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ఆవుపాలు | a | ౧.౦౦ | ౧.౩౪ | ౧.౫౧ | ౨౨ | ౨౨౯ |
| ౨ | ,, | b | ౦.౯౪ | ౧.౦౨ | ౧.౩౬ | ౧౮ | ౧౮౭ |
| ౩ | ,, | c | ౧ ౦౦ | ౧.౧౬ | ౧.౪౧ | ౨౦ | ౨౦౮ |
| ౪ | గేదపాలు | a | ౧.౨౫ | ౨.౪౪ | ౧.౨౫ | ౩౨ | ౩౩౩ |
| ౫ | ,, | b | ౧.౩౫ | ౨.౧౮ | ౧.౨౪ | ౩౦ | ౩౧౨ |
| ౬ | మేకపాలు | b | ౧.౨౧ | ౧.౧౩ | ౧.౨౧ | ౨౧ | ౨౦౮ |
| ౭ | గొర్రెపాలు | b | ౧ ౫౦ | ౨.౦౦ | ౧.౪౧ | ౩౦ | ౩౧౨ |
| ౮ | మనిషిపాలు | b | ౦.౪౨ | ౧.౫౦ | ౦.౭౫ | ౧౮ | ౧౮౭ |

a. Woods fcts and figures.

b Col. me. Carrisoa.

c. American Red cross Text book.

పైయంకెలనుబట్టి ఆవుపాలు, మేకపాలు, మనిషి పాలు షుమారుగ సమానబలము నిచ్చుననియు, గేద పాలు, గొర్రెపాలు వీనికంటె సుమారు ౧½ రెట్లు బలముగలవనియు తెలియును. సులభముగ జీర్ణమగుటచేతను, విస్తారముగ లభించుటచేతను ఆవుపాలే మానవాహారమునకు విరివిగ వాడబడుచున్నవి. గేదపాలలో చమురు విస్తారముగ నుండుటచే వని వెన్నదీయుటకును, నేయి చేయుటకును అనుకూలములు.

పాలలో నీరు విస్తారముగగలదు. కావున వీనిని సంఘట్టనమున చమురుగింజలతో పోల్చిచూచుటకు సమాన యింధనశక్తిగల పరిమితులందలి మాంసపుకృత్తుల యొక్కయు, చమురుయొక్కయు, కర్బనోదజనితముల యొక్కయు పరిమాణములను లెక్కగట్టవలెను. క్రింది పట్టికను చూడుడు :

౨౦౦ కాలరీల యింధనశక్తిగల ద్రవ్యమునగల

| | ద్రవ్యము | మాంసకృత్తులు గ్రాములు | చమురు గ్రాములు | కర్బనోదజనితములు, గ్రాములు | వీని పౌనగల పరిమితి (ఔన్సులు) |
|---|---|---|---|---|---|
| ౧ | ఆవుపాలు | ౯.౧ | ౧౨.౨ | ౧౩.౬ | ౯.౧ |
| ౨ | గేదెపాలు | ౭.౮ | ౧౫.౨ | ౭.౮ | ౬.౨ |
| ౩ | మేకపాలు | ౧౨.౧ | ౧౧.౩ | ౧౨.౧ | ౧౦.౦ |
| ౪ | నూవులు | ౬.౬ | ౧౬.౯ | ౫.౪ | ౧.౧ |
| ౫ | వేరుసెనగలు | ౮.౯ | ౧౬.౧ | ౪.౩ | ౧.౧ |
| ౬ | బాదంపప్పు | ౬.౫ | ౧౬.౯ | ౫.౫ | ౧.౦ |
| ౭ | జీడిపప్పు | ౬.౦ | ౧౮.౮ | ౧.౮ | ౧.౦ |

ఒక ఔన్సు చమురుదినుసు ఇంధనశక్తియందు సుమారు ౯ ఔన్సుల ఆవుపాలకు సమానము. ఇది యొసగు మాంసకృత్తులు మొదలగు ద్రవ్యపరిమితియు కొంచె మించు మించు సమమనియే చెప్పదగును. మాంసకృత్తులును, కర్బనోదజనితములును, పాలలో చమురుదినుసులలో కంటె కొంచెము హెచ్చు. చమురు కొంచెము తక్కువ.

పాలయందలి మాంసకృత్తులు చమురుగింజలయందలిగాని, కాయధాన్యములయందలిగాని మాంసకృత్తులకంటె మానవశరీరమున హెచ్చుగ సమీకరణమగునని వెనుకటివ్యాసమున వ్రాయబడెను. కావున ఆహారమునందలి మాంసకృత్తులు కొంతవరకైనను పాలరూపమునఉండుట మంచిది కాని యిందువలన వ్యయము హెచ్చగును. ౧ దమ్మిడీ వేరుసెనగగింజలను దినుటవలన లభించు మాంసకృత్తి ౧౫.౨ అణాలపాలను త్రాగినగాని లభింపదు.

వృక్షసంబంధమగు చమురుకంటె పాలయందలి చమురు, అనగా క్రీము, వెన్న, నేయి, యివి మానవశరీరమున సులభముగ సమీకరణమగుటయేగాక ఆరోగ్యకరములుగ నెంచబడుచున్నవి.

పాలయందు కర్బనోదజనితములు చమురుగింజలందుకంటె కొంచెము హెచ్చయినను, తృణధాన్యములందుకంటెను, కాయధాన్యములందుకంటెను తక్కువయగుటచే అతిమూత్రవ్యాధిగలవారికి వీనికంటె పాలు శ్రేష్ఠమగు నాహారము.

పాలలో నితరాహారద్రవ్యములందన్నిటికంటెను సున్నమెక్కువగ గలదు. కావున దేహమునకు కావలసిన సున్నము పాలు ద్వారకుండ లభింపజేసికొనుట కష్టము. కొంత స్ఫురముగూడ గలదు. క్రింద పాలయందును, కొన్ని యితరాహారద్రవ్యములయందును గల ఖనిజముల పరిమితి చూపబడెను.

౨౦౦ కాలరీల యింధనశక్తినిచ్చు ద్రవ్యమునందు గల ఖనిజముల పరిమితి. ౧౦౦ పౌనులు తూగు మనిషి గావలసిన పరిమితిలో నూటికి-పాళ్లు

| | ఆహారద్రవ్యము | సున్నము | స్ఫురము | ఇనుము |
|---|---|---|---|---|
| ౧ | ఆవుపాలు | ౫౬.౪ | ౨౧.౮ | ౪.౬ |
| ౨ | వేరుసెనగలు | ౪.౮ | ౧౪.౧ | ౬.౨ |
| ౩ | బాదంపప్పు | ౧౧.౦ | ౧౦.౮ | ౮.౦ |
| ౪ | గోధుమలు | ౭.౪ | ౧౭.౮ | ౧౭.౮ |
| ౫ | వరిబియ్యము | ౧.౨ | ౧౨.౬ | ౧౧.౦ |
| ౬ | గోధుమపొట్టు | ౧౬.౬ | ౮౪.౪ | ౪౭.౮ |
| ౭ | వరితవుడు | ౮.౨ | ౬౯.౦ | ౬౦.౪ |
| ౮ | కాయధాన్యములు | ౧౨.౯ | ౨౫.౧ | ౩౭.౭ |

పై పట్టికనుబట్టి చూచుచో సున్నమునొసగుటలో పాలకు మరియేవస్తువును దరిరాదని తెలియును. ఇటీవల 'కల్లాసా' అనుపేరట శరీరమునకు సున్నమును మెండుగ నొసగుట కేర్పడిన మందు, పాలనుండి సున్నపుభాగమును దీసి తయారుచేసినదే. స్ఫురము నొసగుటలోగూడ పాలు, గోధుమపొట్టు, నరిశవును, కాయధాన్యములు దీనికి తప్ప తక్కినవానికి దీసిపోవు. పాలలో ఇనుము మాత్రము మిగుల తక్కువ.

పాలలో విటమినులన్నియు గలవు. అందును విటమిను A యితరాహారద్రవ్యములందుకంటె నిందు మిగుల హెచ్చు. విటమిను B మధ్యమముగగలదు. విటమిను C తక్కువ. విటమిను D గల స్వల్పద్రవ్యములలో పాలొకటి.

పాలను కాచినచో విటమిను C పోవును. తక్కినవంతగా పోవు. పరిశుద్ధమగుపాలు లభించుచో పితికిన వెంటనే (ధమ్మపాలను) పుచ్చుకొనుట శ్రేష్ఠము. కాని పాలు, పిదుకుటలోను, పితికినపిమ్మటను సులభముగ ప్రమాదకరములగు సూక్ష్మజీవుల కాస్పదమగుచుండుటచే సామాన్యముగ వీనిని కాచిపుచ్చుకొనుటయే శ్రేష్ఠము. ఏలయన, కాచకుండ పుచ్చుకొనుటవలన గలుగు నపాయములు అందువలన గలుగు గుణనష్టముకంటె చాలహెచ్చు.

పాలుపొంగువరకు కాచకుండ ౨౦-౩౦ నిమిషములుమాత్రముగ ౧౪౦°-౧౪౫° ఫ.ల.వరకు వేడి(పాస్టియురైజు) చేయుటచే నందలి అల్బుమిను విడిపోయి తరక గట్టకపోవుటయేకాక అందలి విటమినులుగూడ నంతగా నష్టపోవు. కాని యందలి రోగజనకము సూక్ష్మజీవులు చాలవరకు నశించును. పాశ్చాత్యదేశములలో నిట్టిపాలు విరివిగ వాడబడుచున్నవి.

పాలయందలి నీటిని కొంతవరకుగాని, పూర్తిగగాని యిగిరిపోవునట్లు జేసి తక్కినఘన పదార్థమును ముద్దగా (Condensed milk) గాని, పొడిగాగానిచేసి విక్రయించుటయును గలదు. ఇట్టివి మిగుల నిలువద్రవమైనవి. కాని వీనియందలి విటమినులు చాలవరకు నష్టమగుటచే వీనితో విటమినుల నిచ్చు నితరద్రవ్యములను జేర్చి పుచ్చుకొనవలసియుండును. ఇటీవల నాపాలపొడితో విటమినుల నొసగు ద్రవ్యములను జేర్చియే విక్రయించుచున్నారు.

ఉష్ణదేశములందు పులియబెట్టిన పాలు సులభముగ జీర్ణమగుననియు, ఈపులుపునకు గారణమగు క్షీరామ్లమును బుట్టించు సూక్ష్మజీవులు రోగజనకములగు నితరసూక్ష్మజీవులను బ్రతుకనీయవనియు కలనల్ మెక్కారిసన్‌గారు తమ 'ఆహారము' అనుగ్రంథమున వ్రాసిరి. ఇట్టిపాలు శరీరమునకు పుష్టిచేసి ఆయువును వృద్ధిపొందించునిగూడ వ్రాసిరి.

ఒకవిధమగు కిరణప్రసారము (Irradiation) చే పాలయందలి విటమిను D ని వృద్ధిపొందింపవచ్చునని కనుగొనబడెను.* ఇట్లు కిరణప్రసారము గావింపబడిన 'యీస్టు' (పొంగురొట్టెల జేయుట కుపయోగింపబడు ద్రవ్యము)ను ఆవులకు పెట్టుటవలనగూడ దానిపాలయందలి విటమిను D వృద్ధినొందునట.

క్రీము (Cream)తీసినపాలు (Skimmed Milk) సులభముగ జీర్ణమగును. చమురుతీసివేయబడుటయే యిందుకు కారణము. కాని యిందువలన విటమిను A తగ్గిపోవును. సామాన్యముగ ముద్దపాలు (Condensed Milk) ఇట్టి పాలతోనే తయారుచేయుదురు.

పాలనుకాచి తోడుబెట్టుటవలన దయారగు పెరుగుకూడ ఆరోగ్యకరమగు నాహారము. కాని తోడు పెట్టుటకుముందు పాలను మరగ గాచుటవలన పెరుగు జీర్ణమగుట కష్టమగును. కావున ఒకటి రెండుపొంగులవ మాత్రమే రానిచ్చి తోడుపెట్టవలెను. మిగుల పులిసిన పెరుగుకూడ జీర్ణమగుట కష్టము. ఒక్కొక్కప్పు డిట్టి పెరుగు జలుబుచేయుటయుగలదు.

పెరుగును కొంచెము నీరుచేర్చి చిలికి వెన్నదీసివేయగ మిగులుమజ్జిగ సులభముగ జీర్ణమగును. ఎంతపలుచగనున్న జీర్ణమగుట అంతసులభము. పాలనుకాచుటకు ముందే క్రీముదీసి అట్టి (Skimmed) పాలనుండి

* Nutrtiion abstracts and reviews, Vol. 3 No. 2893.

తయారుచేసిన పెరుగును, మజ్జిగయు కూడ సులభముగ జీర్ణమగును. కాని పెరుగునుండి వెన్నదీసి తయారుచేసిన మజ్జిగయే యెక్కువరుచిగా నుండును. ఆరోగ్యకరమని కూడ చెప్పవచ్చును.

మజ్జిగను కొంతసేపు కదుపకుండ నిల్వయుంచినచో అందలి ఘనపదార్థము క్రిందికిదిగి నీరు పైకి తేరును. ఈమజ్జిగతేటలో నూటికి సుమారు .౩ పాలు మాత్రము చమురును, ౭.౫ పాళ్లు ఘనపదార్థము (ముఖ్యముగ ఖనిజములు)ను ఉండును. ఇది మిగుల సులభముగ జీర్ణమయి శరీరమునకు ఖనిజముల నొసగు పానీయము. క్రీముతీసిన పాలనుండి తయారుచేసిన పెరుగునుండియు, మజ్జిగనుండియు నిట్టితేట (Whey) సులభముగ తేరును.

పెరుగుయొక్కయు, మజ్జిగయొక్కయు ఆరోగ్యమునకు ముఖ్యకారణము అందలి సూక్ష్మజీవులు (Bacterium Lacti) ప్రేగులందలి రోగజనకములగు నితరసూక్ష్మజీవులను నాశనముచేయగలుగుటయే యని కనిపెట్టబడెను. కాని పెరుగును మజ్జిగను, పుచ్చుకొనినపుడు అందలి యుపయోగకరమగు సూక్ష్మజీవులు చాలవరకు ప్రేగులలోనికి పోకముందు జీర్ణకోశము నందలి యామ్లములవలన నాశముచేయబడుటచే వాని యుపయోగము తక్కువగుచున్నదనియు, పెరుగు మజ్జిగలను అరటిపండుతోకూడగాని, కుమ్మపెట్టికాల్చిన (Baked) బంగాళాదుంపతోకూడగాని పుచ్చుకొనుచో అందలి సూక్ష్మజీవులు జీర్ణకోశమునందుగా నశింపక ప్రేగులలోనికి హెచ్చుగబోవుననియు కనిపెట్టబడెను. ఆంధ్రులభోజనమున నరటిపండును మజ్జిగఅన్నము తినునపుడే పుచ్చుకొనుట ఆచారము. ఇది మంచిపద్ధతియని యే పరిశోధనకూడ తెలుపుచున్నది. లేకరి కడచిన ౩ సంవత్సరములనుండి పెరుగును, అరటిపండ్లను ఉదయమున ప్రథమాహారముగ బుచ్చుకొని పరీక్షింపగా చాల అనుకూలముగ గనబడెను. పూర్వాహ్ణమున పాలను పనిగాని, త్రిప్పటతోగూడినయితరవృత్తిగాని కలవారు ఇట్లు తిని పరీక్షింపదగును.

పాలనుకాచి వేడిగనుండగ వేయేదైన పులుసుద్రవ్యమును తగుమాత్రము జేర్చి విరుగగొట్టి అందలి విరుగును, పైని తేరిన నీటిని పుచ్చుకొనుటవలన నవి పాలనుపుచ్చుకొనునప్పటికంటె కొంత సులభముగ జీర్ణమగునని లేకరి యనుభవము. ఇది శరీరతత్త్వము ననుసరించియుండవచ్చును. బొత్తిగా జీర్ణశక్తిలేనివారు విరుగును వదలి పైనీటినిమాత్రమే పుచ్చుకొనుటవలన శరీరమునకు ఇతరసులభవిషముల లభింపని సున్నమును, భాస్వరమును లభించును.

పాలను విరుగగొట్టుటకు సిట్రికామ్లము (నిమ్మపువ్వు) అనుకూలము. నిమ్మకాయరసమునుకూడ నుపయోగింపవచ్చును. కాని పాలయందలి ఘనపదార్థము ముఖ్యముగ కేజీను (Casein) విరిగి ముద్దగా క్రిందికిదిగి నీరు తెరుటకు అందు చేర్పబడు నమ్లద్రవ్యము నిర్ణీతమగు ప్రమాణముగలదిగ నుండవలెను. తక్కువయినచో పాలు విరుగనే విరుగవు. హెచ్చగుచే పాలు విరిగినను అందలి ఘనపదార్థము ముద్దగట్టక విడిపోయి పైనీటితో కలసిపోవుటచే నీరు తేరక అంతయు జేరి మజ్జిగవలె నగును. కావున జేర్చవలసిన యమ్లద్రవ్యపు పరిమితిని అనుభవమువలన గ్రహింపవలెను. పాలకు ౪.౬ అంశముల అమ్లత్వము (౪.౬ P.H) నిచ్చువంత యమ్లద్రవ్యమును జేర్చినపుడే పాలు సరిగా విరుగునని కనిపెట్టబడెను.

పెరుగును వేడిచేయుటవలనకూడ నది విరుగును. కాని యిట్టివిరుగు పైనిచెప్పినట్లు తయారుచేసిన విరుగంత సులభముగ జీర్ణముకాదు.

పాలను మందాగ్ని (పిడకలదాని) పై దీర్ఘకాలము కాచినచో అందలి ఆల్బుమిను చాలభాగము పైకి తేలి తరకగట్టును. దీనితో పాలయందలి చమురు పదార్థముకూడ కొంతవరకు పైకితేరును. దీనిని ప్రత్యేకముగ దీసి యాహారముగ నుపయోగింపవచ్చును. మిగుల పుష్టికరము. కాని జీర్ణమగుట కొంతకష్టము. ఇందు ఔన్సుకు సుమారు ౧౧ గ్రాములు మాంసకృత్తులును, ౧౨ గ్రాములు చమురును, ౧ గ్రాముమాత్రమే కర్బనోదజనితములును ఉండును. కర్బనోదజనితములుమిగుల తక్కువగ నుండుటచే అతిమూత్రవ్యాధిగలవారికి తగిన యాహారము.

సామాన్యముగ పెరుగువిక్రయించువారు పాలనుండి మొదట నిట్లు మీగడను చాలవరకు తీసి ప్రత్యేక

ముగ కొన్నిపాలతో కలిపి తోడుపెట్టి యందుండి వెన్నదీసికొని, తక్కినపాలను పెరుగుచేసి విక్రయింతురు. ఇట్టి పెరుగు కొంతవరకు యంత్రముతో క్రీముతీసివేసిన (Skimmed) పాలపెరుగును పోలియుండునని చెప్పవచ్చును. కాని అంతకంటె చమురు కొంత హెచ్చుగ నుండును.

పాలను ఇగరగాచి యందలి తేమను చాలవరకు పోగొట్టుచో మిగులు పదార్థము 'కోవా' యనబడును. ఇదియు కష్టముగ జీర్ణమగునాహారమగుటచే స్వల్పముగ దినదగును. కోవాను తయారుచేయుటలో తరుచు గోధుమ పిండిని, చక్కెరనుగూడ చేర్చుచుందురు. స్వచ్ఛమగు కోవాయొక్కయు, పిండి, చక్కెర చేర్చి చేయబడినకోవా యొక్కయు సంఘటన మీక్రిందిపట్టికలో జూపబడెను

ఒక ఔన్సులోగల

| | మాంసకృత్తులు (గ్రాములు) | చమురు (గ్రాములు) | కర్బనోద జనితములు (గ్రాములు) | మొత్తపు ఇంధనశక్తి |
|---|---|---|---|---|
| ౧. ఆవుపాలకోవా | ౬.౩ | ౮.౬ | ౯.౧ | ౧౩౯ |
| ౨. గేదెపాలకోవా | ౬.౫ | ౧౨.౫ | ౭.౦ | ౧౬౬ |
| ౩. ఆవుపాలకోవా (౬౪ ఔన్సుల పాలకు ౩ ఔన్సుల గోధుమపిండియు, ౧ ఔన్సు చక్కెరయు కలిపి చేసినది.) | ౫.౪ | ౬.౪ | ౧౨.౮ | ౧౩౦ |
| ౪. గేదెపాలకోవా (పైవిధముననే తయారుచేసినది.) | ౫.౬ | ౯.౬ | ౧౦.౫ | ౧౫౨ |
| ౫. ఆవుపాలపై మీగడతరక | ౧౧.౦ | ౧౨.౦ | ౧.౦ | ౧౫౬ |

ముర్రుపాలు అనగా ఆవుగాని, గేదెగాని యీనిన వెనుక ౨, ౩ పూటలవరకు నవి యిచ్చుపాలు. అందు అల్బుమిను విస్తారముగ నుండుటచే కాచినచో గడ్డకట్టును. కావున నిట్టిపాలు జున్ను తయారుచేయుటకు పనికివచ్చును. సామాన్యపుపాలయొక్కయు, ముర్రుపాలయొక్కయు సంఘటన భేద మీక్రింద జూపబడెను.

| | సామాన్యపు ఆవుపాలు | ఆవుయొక్క ముర్రుపాలు | |
|---|---|---|---|
| నీరు | ౮౭.౧౭ | ౭౪.౬౭ | |
| ఘనపదార్థము | ౧౨.౮౩ | ౨౫.౩౩ | |
| కేజేసి | ౩.౦౨ | ౪.౦౪ | |
| ఇతరమాంసకృత్తులు | ౦.౫౩ | ౧౩.౬౦ | ముఖ్యముగ అల్బుమిన్ (కోడి గ్రుడ్డువం దుంపు చొన)వంటి మాంసకృత్తు) |
| చమురు | ౩.౬౯ | ౩.౫౯ | |
| చక్కెర | ౪.౮౮ | ౨.౬౭ | |
| లవణములు | ౦.౭౧ | ౧.౫౬ | |
| మొత్తపు యింధనశక్తి (౧౦ ఔన్సులకు) | ౨౦౦ | ౩౪౦ | |

కాచినపుడు తోడుకొను అల్బుమిన్ విస్తారముగ నుండుటయేకాక ఘనపదార్థముగూడ సామాన్యపుపాలకంటె రెట్టింపుగుండుటచేతనే ఈపాలు సులభముగ గడ్డకట్టును. గేదెపాలలోని ఘనపదార్థమింకను హెచ్చుగ నుండును. కావున తరుచు ముర్రుపాలను (ముఖ్యముగ మొదటిపూట నిచ్చుపాలను) మరికొన్ని సామాన్యపు పాలతో కలిపి జున్ను చేయుదురు. లేనిచో మిగుల గట్టిపడి తిన వీలుగనుండదు. జున్ను మిగుల బలమైన

యాహారము. కావున తగుమాత్రముగ పుచ్చుకొనదగును. విరేచనకారియగుటయే బలమైన యితరాహారములకన్న కొంత హెచ్చుగ తిన్నను అంతగా హానిచేయదు.

పాశ్చాత్య దేశములలో తయారుచేయబడి విరివిగ నుపయోగింపబడు జున్ను పైని చెప్పినట్లు మీగడపాల నుండిగాక సామాన్యపుపాలనుండిగాని, స్కిమ్డుపాలనుండిగాని తయారుచేయబడును. పాలను విరుగగొట్టి అందలి ఘనపదార్థమును గట్టిపరచి నిల్వయుండు సాధనమును చేయుదురు. ఇదియు కష్టముగ జీర్ణమగునదే. మరియు నిల్వదోషముకూడ గల్గియుండును.

క్రీము, వెన్న, నేయి, ఈ మూడును పాలనుండి లభించు చమురుద్రవ్యపు రూపాంతరములు. క్రీము యంత్రసహాయమున పచ్చిపాలనుండియే తీయబడును. దీనినుండిగాని, పాలనుగాచి తోడుపెట్టిన పెరుగు నుండిగాని వెన్న దీయబడును. వెన్న నుకాచిన నేయి యగును. ఈ మూటియందును గల చమురును, వాని ఉత్పత్తియింధనశక్తియు నీక్రిందజూపబడును:

| | అందలి చమురుపదార్థము, ఔన్సుకు గ్రాములు | ౧ ఔన్సుయొక్క ఇంధనశక్తి |
|---|---|---|
| క్రీము | ౧౪.౧ | ౧౫౮ |
| వెన్న | ౨౩.౧ | ౨౦౭ |
| నేయి | ౨౭.౦ | ౨౫౨ |

పైమూడుద్రవ్యములలో నొకదానికంటె మరి యొకటి బలమైనదగుటచే జీర్ణమగుటయు కష్టతరము. కాని నిల్వయుండుటలో నొకదానికొకటి శ్రేష్ఠతరము.

క్రీమునందును, అందుండి తీసిన వెన్నయందును పాలయందలి విటమిను A అంతయు కొంచెమించుమించుగా నిలచియుండును. B, C లుండవు. D స్వల్పముగ నుండును. ఆవుపాలక్రీమునందును, వెన్నయందును విటమిను A గేదెపాలక్రీమునందుకంటెను, గేదెవెన్న కంటెను హెచ్చుగనుండును.

పాలనుకాచి తయారుచేసిన పెరుగునుండి తీసిన వెన్నలో విటమిన్ A పచ్చివెన్నలోకంటె తక్కువగ నుండును. స్వల్పకాలముమాత్రము మూతపెట్టిన పాత్రలలో చురుకుగగాచి తోడుపెట్టిన పెరుగునుండి తీసిన వెన్నలో విటమిన్ A అంతగాపోదు.

నేతిలో విటమిన్ A మరింత తక్కువ. వెన్నను గాచి, నేయిచేయునప్పుడుకూడ పాత్రపై మూతపెట్టి, గాలితగులకుండ చేయుటవలన నీవిటమినును కొంతవరకు గాపాడవచ్చును.

క్రీమును, వెన్నయు, నేయియు కేవలము చమురు ద్రవ్యములగుటచే నివి శరీరమున కింధనశక్తి నిచ్చుటకే పనికివచ్చును. కొంత విటమిన్ Aను కూడ నొసగును. వీనిని పుచ్చుకొనుచో కడుపంతగా బరువెక్కకుండగనే చాలకాలము పనిచేయగలుగును.

---

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(భావ ఫాల్గునము)

ఉత్తరము



పడమర

దక్షిణము

[ఈపటమును ఆయాదిక్కులు సరిగా చూపునట్లు తలమీదుగా పెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాదులు

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మార్చి | 8 | తేదీని | రాత్రి | 8-57 | గంటలకును, | మార్చి | 29 | తేదీని | రాత్రి | 7-34 | గంటలకును | కనబడును.] |
| ,, | 15 | ,, | ,, | 8-30 | ,, | ఏప్రిల్ | 6 | ,, | ,, | 6-2 | ,, | |
| ,, | 22 | ,, | ,, | 8-2 | ,, | | | | | | | |

"But number every grain of sand
Wherever salt wave touches land,
Number in single drops the sea,
Number the leaves on every tree,
Number Earth's living creatures all
That run, that fly, that swim, that crawl;
Of sands, drops, leaves and lives the count
Add up into one vast amount
And then for every separate one
Of all these, let a flaming Sun
Whirl in the boundless skies with Each
Its massy planets to outreach
All sight, all thought, for all we see
Encircled with infinity
Is but an island" —Allingham.

("ఈభూమండలముపై గల సమస్తసముద్రతీరము లందును గల ఇసుకరేణువులను, వివిధజలాశయములందు గల ఉదకబిందువులను, నానావిధవృక్షజీవుల ఆకులను, సరీసృపాది భూచర-ఖేచర-జలచర - జంగమజీవులను, ఈయన్నింటిని వేర్వేర లెక్కించి, కూడి మొత్తము తేల్చుకొనుము. ఆమొత్తములో నొక్కొక్క సంఖ్యకు ఒక్కొక్క సూర్యుని - మహత్తరగ్రహ, గ్రహకణ, ధూమకేతు, ఉల్కాదులతో కూడుకొనిన సూర్యు నొక్కొక్కని భావించుకొనుము. ఒక్కొక్క నక్షత్రము ఒక్కొక్క సూర్యుడని తెలిసికొనుము. అందు కొన్నింటినిమాత్రమే మనము చూడగలుగుచున్నాము. అనంతమైన ఆకాశమధ్యమున చిన్నద్వీపములవలెనున్న యీసూర్యకోటులే మననక్షత్రములు. అవియే అనంతకోటిబ్రహ్మాండములు.")

ఈఫాల్గునమాసమునందు రాత్రితొలిజామున నగపడునక్షత్రాదులను గమనింతము :

## పాలవెల్లి (The Milky Way)

దక్షిణసమీపపు ఆగ్నేయమునుండి ఆరంభమై, తనుమాత్రము వంగిన ధనురాకారముతో పాలవెల్లి ఆకాశమధ్యముమీదుగా ఉత్తరసమీపవాయువ్యమునకు వ్యాపించియున్నది. ఆరంభమునందు దక్షిణదిశను మిక్కిలిసన్నముగా నగపడు నీక్షీరవాహిని, ఉత్తరదిశకు పోనుపోను మొత్తముమీద క్రమముగా విస్తరించుచున్నది. బ్రహ్మహృదయప్రాంతమున కొంతసన్నగిల్లి నను వాయువ్యభాగపు చేరుసరికి నాలుగైదురెట్లు విస్తరించినట్లు కనబడుచున్నది. దక్షిణమునుండి వరుసగా, నౌకా, వాసుకి మండలములను గడిచి, శ్వానపూర్వశ్వానముల మధ్యపడి, ఆర్ద్ర, బ్రహ్మహృదయముల మీదుగా భృగుపరశుమండలమును గడిచి, అప్పగసమండలముకడను క్షితిజమును చేరుకొనునట్లు కన్పట్టుచున్నది,

## First Magnitude Stars

తేజోవిషయమున నగ్రగణ్యములైన ఇరువది నక్షత్రములలో ఇపుడు మనకు పదునొకండు కనుపడుచున్నవి. అవేవియనగా,

(1) చిత్ర (Spica Virgo)
(2) స్వాతి (Arcturus)
(8) మఘ (Regulus)
(4) మృగవ్యాధరుద్ర (Sirius)
(5) అగస్త్య (Canopus)
(6) ఆర్ద్ర (Betelgeaux)
(7) రోహిణి (Aldebaran)
(8) రిగల్ (Rigel)
(9) బ్రహ్మహృదయము (Capella Auriga)
(10) సాంబ (Pollux)
(11) పూర్వశ్వాన (Procyon)

### తూర్పున

ఎఱ్ఱగా పగడమువలె మెఱయును స్వాతినక్షత్రమును, తెల్లగా ముత్యమువలె మెఱయుచు చిత్రయు తోరణస్తంభములలాగున నిపుడే తూర్పున నుదయించినవి. కన్యారాశియందు వక్రగతుడైయున్న అంగారకుడు స్వాతికంటెను ఎఱ్ఱగా మెఱయుచు చిత్రసమీపమున కానవచ్చుచున్నాడు, గురుగ్రహము వక్రగతి

పొంది విశాఖసమీపమున త్వరలో నుదయించును. అప్పుడు కుజ, గుగ, చిత్ర, స్వాతులతోడ తూర్పున చూచి ఆనందింపవలయును.

## ఈశాన్యము - ఉత్తరము

స్వాతికి ఉత్తరముగా ఈశాన్యదిశను భూతేశ మండలములోని కొన్ని చుక్కలు ఉదయించినవి. సప్తఋషులు బాసుగా ఉదయమైనారు. సప్తఋషులలో పులహక్రతురేఖ ధ్రువసూచకము. లఘుఋక్షము ఇప్పుడు తూర్పుపడమరలకు మధ్య (Horizontal) అడ్డుగా కనబడుచున్నది. ఊర్వశీమండలము వాయవ్యదిక్కునకు ఒరిగినట్లు కనబడుచున్నది. లఘుఋక్షములో ధాత, విధాత నక్షత్రములు బృహదృక్షములోని అత్రి, వసిష్ఠులకు సరిగా ఎదురుగానున్నవి. నరకుడు డీరెండుఋక్షములమధ్యను కానవచ్చుచున్నాడు.

## వాయవ్యమున

'కనకనగసీమను, కల్పవృక్షములనీడ' నున్న రంభాదులగు అప్సరసలు ఇక త్వరలో నస్తమింతురు. ఇంద్రనమున అప్పుడే సగమస్తమించినది. చ్యవను డామె ప్రక్కనే ఉన్నాడు. వీరిప్రక్కనే పులోమరక్కసుడు ప్రస్ఫుటముగా కానవచ్చుచున్నాడు.

## పడమట

అశ్వినులు త్వరలో అస్తమింపనైయున్నారు. వారిదిగువను శింశుమారము కొంతఅస్తమించినది. ధుంధుడును అస్తమించుచున్నాడు. శుక్రుడు మీనమేషములలో సంచరించుచు ఈమాసములో పశ్చిమమున వక్రకముగా మెఱయుచున్నాడు.

## నైరృతి - దక్షిణము

Orion యోధుడు పడమటకు వ్రాలుచున్నాడు వానిపాదమువద్ద నున్న రిగెల్ సమీపమునుండి యమునానది ఎన్నోమెలికలు తిరిగితిరిగి నైరృతిభాగమున నదృశ్యమగుచున్నది. యమునప్రక్కనే ఉపరిచరవసువున్నాడు. Orion యోధునిదిగువనే దక్షిణముగా శశకము, దానిదిగువ కపోతమును ఉన్నవి. క్షీరవాహినిలో వాసుకిసర్పమును, అదిచుట్టుకొనిన మందరగిరియును హాలాహలమును భక్షించిన మృగవ్యాధుని ప్రక్కను ఉన్నవి. వాటికి దక్షిణముగా Argo Navis "దైవీమ్‌నావామ్" అనునావ పృష్ఠభాగము, చాపలు, స్తంభము నవుభాగములలోను, మకాకొనికశ అగస్త్యునితోను చుక్కగా మెఱయుచున్నది.

## మధ్యను

ప్రాయ్యపాక్కల్లవలె భరణిచుక్కలు మూడును మిణుకుమనుచున్నవి. మాసాంతమున శుక్రుడు భరణిలో చేరుసరికి ఇవి స్పష్టముగా కానరావు. భరణికి ఆవల మిణుగురుపురుగులులాగున పిల్లలకోడిచుక్కలును, వాటికావల ఎద్దుకన్నువలె ఎఱ్ఱగా రోహిణియు మెఱయుచున్నవి. ఆర్ద్ర పగడమువంటి ఎఱ్ఱకాంతితో పాలవెల్లి ప్రక్కనే తేజరిల్లుచున్నది. ఆక్షీరవాహినికి తూర్పుగా సారథిమండలములోని బ్రహ్మహృదయమును ఇంచుమించుగా గగనమధ్యరేఖపై ముత్యాలహారమువలె పునర్వసుచుక్కలును పునర్వసుమీద ఒకింతతూర్పున మూషకవాహనుడైన విఘ్నేశ్వరుడును కానవచ్చుచున్నారు. పునర్వసునకు తూర్పుగా పొట్లపువ్వువంటి చుక్కమబ్బుతో పుష్యమి కానవచ్చుచున్నది. పుష్యమికి దక్షిణముగా సర్పాకారములో ఆశ్లేషయు, ఆశ్లేషయొక్క వృద్ధి (Extension) అయిన (Hydra) అహిమండలమును బహుదూరము వ్యాపించియున్నవి. ఈయాశ్లేషాహిమండలములకు ఉత్తరముగా, ఎగువను ఋగ్వేదమునందు ప్రశంసింపబడిన చషక (Crater) గ్రావ (Sextant) మండలములును, దిగువ వమ్రీమండలమును గమనింపదగియున్నవి ఆశ్లేషకు ఎగువగా పల్లకిబొంగువంటిచుక్కలమధ్య మఘనక్షత్రము తేజరిల్లుచున్నది. సప్తఋషులు ఇంచుమించుగా మఘతోనే ఉదయింతురు. మఘకు తూర్పుగా రెండురెండుకనులవలె అర్జునీనక్షత్రము — పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీనక్షత్రము—లున్నవి. ఉత్తరఫల్గునిలోని Denebola చుక్క పూర్వము అఖండతేజముతో మెఱసెడిది. ఇప్పుడా తేజమును గోల్పోయినది.

ఉత్తరఫల్గునీనక్షత్రమున మహాభారత ప్రసిద్ధుడైన అర్జునుడని చెప్పుదుము. మహాభారతకథ ఆకాశమున రమ్యముగా చిత్రింపబడి యిప్పుడే కానవచ్చుచున్నది. ఇంద్రాగ్ని దేవతాకమై సుందరమైన విశాఖయనునగ్నికుండముండి, అయోనిజయై కన్య (ద్రౌపది) ప్రభవించినది. ఆకాశమున గిరగిరతిరుగు మత్స్యయంత్రము — మీనరాశి — అర్జునుడు రాగానే నేలగూలి అస్తమించినది. ఫాల్గునమునందు అష్టమి-రోహిణినాడు ద్రౌపదీవివాహమహోత్సవమని భారతమువలన తెలిసికొనుచున్నాము.

## విశేష విషయములు

దివారాత్రములు సమముగా గల విషువత్పుణ్యకాలము (Vernal Equinox) ఈమాసమునందే మార్చి ౨౧-వ తేదీని సంభవించును.

సూర్యాస్తమయము కాగానే పడమట దివ్యమైన తేజస్సుతో శుక్రుడును, తూర్పున చిత్ర, స్వాతుల తేజోవైభవమును వృద్ధిచేయుచు బుధ, గురుగ్రహములును చూపరులకు అనిర్వచనీయమైన ఆనందము కలిగించుచున్నారు.

---



కొలను, దేవాలయము-తిరువల్లూరు P. R. R.



కృష్ణ పంచమి

(శ్రీ కాశీనాథరావుగారి తంజావుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

చెన్నరాజధానియందు 1933 సంవత్సరము ఏప్రిల్ ప్రారంభము మొదలు
జూన్ తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

### ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్యమార్గము, ఫారం ౧, ౨—టి. నారాయణ స్వామిఅయ్యర్

### ఇతిహాసము

శ్రీమదాంధ్రమహాభారతము, భా. ౨, ౪—(ప్ర) సి. పార్థసారథి, గుంటూరు

### కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

ఆర్యకథాలహరి, భా.. 3, ౭—టి. వి. నరసింగరావు

నలమహారాజుకథ (ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మద్రాసు

భాగవతకథలు—యం. సుబ్బారావు

భారతకథామృతము—కె. విశాలక్ష్మమ్మ

మహాభారతచరిత్రము—పి. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

రుక్మిణీకల్యాణము—డి. కామయ్యభక్త

శ్రీకృష్ణుడు—జి. నరసింగరావు

శ్రీరామనవమి సీతాకల్యాణము—వి. పరబ్రహ్మం.

శ్రీ విఘ్నేశ్వరకల్యాణము—పి. సుబ్బయశర్మ

### కల్పితములు

కల్లుసారాయికథలు—కె. జె. సి. సుందరం

నిద్రించిన అందకత్తె మొదలగుకథలు—(ప్ర) క్రిశ్చ యన్ లిటరేచరుసొసైటి, మదరాసు

బాలకథావళి—డి. పిచ్చయ్యశాస్త్రి

[illegible]కథలు—సి. శేషగిరిరావు

[illegible]—ఎ. సీతారామశాస్త్రి

### చారిత్రకము

రామదాసు చరిత్రము—(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు.

### కల్పము

ఆకాశదీప వ్రతకల్పము—(ప్ర) సి. లక్ష్మీనరసింహ శాస్త్రి, మచిలీపట్టణము

### కావ్యములు

త్రిప్రాసకంద రామాయణము—కె. వెంకటరామయ్య

శ్రీ మదాంధ్రవాల్మీకిరామాయణము, భా. 3, ౪, ౫—(అను) వి. సుబ్బరావు

### గణితశాస్త్రము

పసిపికాలపుగణితము బుక్, ౧, ౨—టి. రాఘవ అయ్యర్.

సూక్ష్మగణితబోధిని—(ప్ర) లక్ష్మీనరసింహం అండ్ సన్స్, అమలాపురము

### గేయములు

ఆరోగ్యకీర్తనలు—మల్లెలడేవిడ్

కాంభోజరాజుకథ—(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మద్రాసు.

కీర్తనలు—వి. సుబ్బారెడ్డి

జ్ఞానకుంజరకైవల్యము, భా. 3—వెంకటలక్ష్మమ్మ

త్యాగయ్యగారి కీర్తనలు, గ్రామఫోన్ తిరుప్పుగళ్, కావడిచిందు—(ప్ర) పి. సంజీవి, చిత్తూరు

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము : అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు, [illegible]. ప—ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

దసరాపద్యము—వి. సుబ్బారెడ్డి
నామకీర్తనలు—(ప్ర) శ్రీరామకృష్ణపూజామందిరము, గుంటూరు
బుధజనకల్పము—కె. ఆదినారాయణ
భక్తసుజ్ఞానహరినామకీర్తనలు—యం. నారాయణదాస్
రామకీర్తనామృతము—సి. అన్నపూర్ణమ్మ
విఠల్ సంకీర్తనలు—పి. వీరయ్య
వీరాంజనేయకీర్తనలు—పి. వెంకటరత్నం
శశిరేఖాపరిణయము—(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో: మదరాస్
శ్రీఅలమేలుమంగమ్మసరసపాటలు—(ప్ర) యం. వి. రుద్రయ్యనాయుడు, తిరుపతి
శ్రీపండరీనాథునిభజనకీర్తనలు—(ప్ర) టి. రామకృష్ణయ్య, మచిలీపట్టణము
శ్రీపద్మావతీదేవిశృంగారదరువులు—(ప్ర) యం. రుద్రయ్యనాయుడు. తిరుపతి
శ్రీవేంకటేశ్వర పద్మావతి మంగళహారతులు—(ప్ర) యం. వి రుద్రయ్యనాయుడు, తిరుపతి
శ్రీవెంకటేశ్వరమేలుకొలుపులు—కె. చంగయ్య
సక్కుబాయిపాటలు—(ప) యస్ బాలారావు, బరంపురము

చరిత్ర (దేశ)

ఆంగ్ల చరిత్ర—పి. సత్యనారాయణ
ఆంగ్ల దేశచరిత్ర—సి. నరసింహారావు
ఆంధ్రదేశపుచరిత్రము—సి. శ్రీనివాసరావు
హంపి-విజయనగరము—వి. శ్రీనివాసరావు
హిందూదేశచరిత్రలోని సులభమైన పాఠములు—(ప్ర) మాక్మిలన్ అండుకో, మదరాసు
హిందూదేశచరిత్ర—టి. యస్. ప్రకాశరావు

చట్టము

పోలీసుప్రథమబోధిని—టి. వి. శ్రీనివాసరాఘవాచారి

జీవితములు

విక్టోరియా—(ప్ర) క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ మదరాసు
శ్రీకృష్ణశపిజీవితము—టి. రామలింగస్వామి
శ్రీ వీరబ్రహ్మము గారిచరిత్రము—సి. సుబ్బయ్య
హనుమంతుని జీవితము—భ. నారాయణమూర్తి

దండకము

పాండురంగదండకము—పి వీరయ్య

నవలలు

కనకవల్లి—టి. రాజగోపాలరావు
పాతాళద్వీపము—యల్. టి. కృష్ణయ్యశాస్త్రి
పిచ్చిపిల్ల—పి వెంకటశ్రీరామమూర్తి
బాలాదిత్య—(అను) వి. సత్యనారాయణ
మాధవాశ్రమము, భా. ౧—జి. సుబ్రహ్మణ్యశర్మ
మోహపిశాచము భా. ౧, ౨—వి. మల్లికార్జున
హోరావతివీరులు—ఎ. గంగరాజు

నాటకములు

అంబ—సి. నారాయణరావు
అహల్య—యస్. లక్ష్మీనరసింహం
క్రొత్తనమూనా—ఆర్. శేషగిరిరావు
జయంతజయపాలము—యం. శ్రీరామమూర్తి
దుర్వాసగర్వభంగము—బి. భీమరావు
ధనంజయవిజయము—వి. సుందరరామశర్మ
ప్రబోధ చంద్రోదయము—(ప్ర) ఓంకారాశ్రమము, తెనాలి
భక్తమోహోను—సై. జాన్ఎలీషా
భిల్లాణనాటకము—యన్. వెంకటరామయ్య
రంతిదేవోపాఖ్యానము—తత్త్వానందస్వామి
శ్రీరామపాదుకలు—కే. సీతాపతిరావు
సముద్రమథనము—సి. సీతాంబ
సరిపడనిసంగతులు—టి. రాఘవ
సుభద్రార్జునీయము—డి. గోపాలాచార్యులు

నిఘంటువు

శ్రీ వేంకటేశాంధ్రము—వేంకటకవి

## పరిశిష్టము

అస్వస్థతోపన్యాసము—(ప్ర) కె. మహాలక్ష్మమ్మ, బెజవాడ
అర్ధశతాబ్ద వృత్తాంతనివేదిక—(ప్ర) బ్రహ్మసమాజము, మచిలీపట్టణము
ఆత్మోపదేశము—సి. సరస్వతీదేవి
ఋషి—(ప్ర) సాహితీనికేతనము, నర్సాపూరు
కంఠమాల—జే. గంగన్న
కళత్రవియోగనిషాదము—వి. లక్ష్మీనరసింహశాస్త్రి
కావ్యమణిమంజరి, భా. ౧—ఏ. ని. రాం అండ్ కో., పాలకొల్
గారడీవిద్య—యం. లక్ష్మీనృసింహశాస్త్రి
గుట్టుబైటబడ్డది—పి. పరబ్రహ్మము
గోత్రకాండము—(ప్ర) వి. రామయ్యరాజు, రొంపిచర్ల
గ్రంథాలయములచరిత్ర—కె. నరసింహరాజు
చారుచర్య—(అను) యం. వెంకటరత్నం
జమీందారీ రైతుసమస్య—ఆర్. మంజులేశ్వరశర్మ
త్యాగమహిమ—శి. సీతారామశాస్త్రి
దీనపరిపాలనము—పి. పెరుమాళ్లదాస్
నవ్యసూక్తిముక్తావళి, భా. ౧, ౨—(ప్ర) విద్యావినోదిని గ్రంథమాల, చిత్తూరు
నాలుగవతరగతి క్రొత్త తెలుగువాచక పుస్తకము, తరగతులు, ౪—యస్. భూషణం
పంచపక్షి అను ప్రశ్నశాస్త్రము—(ప్ర) యస్. రంగయ్యనాయుడు అండ్ సన్స్, హైదరాబాదు
పొగచుట్టవలని ప్రమాదములు. వి. వెంకటసూర్యప్రకాశరావు
ప్రబుద్ధభారతము—(ప్ర) శ్రీరామకృష్ణపూజామందిరము, గుంటూరు
ప్రశంసాపద్యరత్నములు—ఏ. సూర్యనారాయణరాజు
ప్రారంభోపన్యాసము—(ప్ర) కె. కనకవల్లి, తెనాలి
బాటసారి—ఏ. నారాయణదాసు
భారవి, భా. ౧—వి. విజయరామయ్య
మనదేశపువాచకము, నెం. ౩—(ప్ర) సి. కుమారస్వామినాయుడు అండ్ సన్స్, మద్రాసు
మనస్వాతంత్ర్యము, భా. ౧—వి. సూర్యనారాయణరావు
మన్వంతరములు—డి. హనుమాయమ్మ
మార్గోపదేశిక, భా. ౧—వి. చినసీతారామశాస్త్రి
వాణివాచకము, తరగతి సర్వభద్రం, యం. వెంకటశాస్త్రి, సి. దీక్షితులు
విజ్ఞానవాచకము, తరగతులు, ౨, ౩, ౪—ఏ. శంకరరావు, డి. సోమయాజులు, బి. సుబ్బరాయుడు.
విద్యవలన కలుగులాభములు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి, మదరాసు
విద్యావిహారము—కె. వెంకటరామయ్య
వేమనపద్యములు—(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో., మదరాస్.
వైజయంతి—(ప్ర) సి. సరస్వతి నూజివీడు
శుక్లపక్షము—ఏ. రామలింగస్వామి
శ్రీ ప్రార్థనరామాయణము—కె. వెంకటరత్నం
శ్రీమచ్ఛంకరవిజయ విశేషాంశసూచిక—స్వామి నిత్యభూమానంద
శ్రీరామకృష్ణనామామృత ప్రబోధము—యం. శేషాచలపతి
శ్రీరామమూర్తి—శి. సత్యగోదావరిశర్మ
శ్రీ సూర్యగ్రహణవిమర్శ ఖండనము—పి. గురురాజాచార్యులు
సత్య—వై. శ్రీరాములు
సత్యనారాయణ—(ప్ర) కె. పి. పిళ్లై అండ్ కో., మదరాసు.
సన్మార్గదర్శిని—శి. సీతారామశాస్త్రి
సరస్వతీరామాయణప్రశంస—సి. సరస్వతీదేవి, నూజివీడు
స్త్రీజనసుబోధకపద్యముక్తావళి—(ప్ర) జె. సుబ్బరావు కొల్లూరు
సుభాషితము—లక్ష్మి
సూటుకేసు—(ప్ర) శ్రీనివాస గ్రంథమాల, కార్వేటినగరము
స్వాగతోపన్యాసము—(ప్ర) ఏ. యల్. నారాయణ, గూడూరు

హిందూస్థానీసంభాషణ—కె. యస్. ఆచార్యులు

## పురాణము

మార్తికపురాణము—వి. జానకిరామమూర్తి.

## ప్రబంధము

అచ్చతెనుగు కుబ్జాకృష్ణవిలాసము—యస్. సి. టి. లక్ష్మీనృసింహాచార్యులు

## భూగోళశాస్త్రము

భూగోళశాస్త్రము—పి. సూర్యనారాయణ
హిందూదేశభూగోళశాస్త్రము—కె. జగన్నాథం

## మతము—హిందు

ఏకాదశీమహాత్మ్యము—పి. కామయ్యభుక్త
కర్మతత్త్వము—అభేదానందస్వామి
గృహస్థాశ్రమతత్త్వము—శ్రీ రామతీర్థస్వామి
నీతిధర్మము—(అను) వి పార్థసారథిరావు
భక్తలక్షణము—శ్రీ కుసుమహర్ నాథ్
శ్రీరామావతారతత్త్వము భా. ౨—జె. శేషాద్రిశర్మ
సప్తాహోద్యక్షప్రశంస—(ప్ర) డి. యస్. నారాయణ; బెజవాడ
స్త్రీపురుష ప్రాయశ్చిత్తప్రయోగః (ప్ర) సి. ల సింహశాస్త్రి, మచిలీపట్టణము
హిందూజీవనపథము—యస్. రాధాకృష్ణన్

## —ఇతరములు

క్రైస్తవమత పకాశిక—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
పద్యగుచ్ఛము—(ప్ర) జె. వి. ఆలన్, నెల్లూరు
మనకీర్తనలు—పి. స్కుల్ స్
యేసుసిలువపై పలికిన ఏడుమాటలయొక్క సంక్షేపవర్ణన—(ప్ర) కె జమారియా, గూడూరు
సత్యాయుసత్య పకాశిక—చ. జాన్
సత్యవేదసంగీతరత్నావళి—(ప్ర) రెవరెండ్, చ ఆలన్, నెల్లూరు

సువార్తపాట—పి. శామ్యూలు

## మాహాత్మ్యములు

మంగళమహానందిమహాత్మ్యము—యం. నందిపతి
సత్యనారాయణవ్రతమహాత్మ్యము — సుబ్బరాయకవి సోదరులు
సంపూర్ణభద్రాద్రిమాహాత్మ్యము — జే. సూర్యనారాయణశాస్త్రి
శ్రీమహానందీశ్వర మాహాత్మ్యం — రామకృష్ణ సీతారామ సోదరకవులు
శ్రీమహానంది క్షేత్రమహిమ — రామకృష్ణ సీతారామ సోదరకవులు

## యక్షగానము

గరుడాచలనాటకము — (ప్ర) యస్. వి. గోపాల్ అండుకో, మద్రాసు
సీతాకల్యాణము — (ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు

## రాజకీయము

రైతు-రాజ్యాంగనిర్మాణసంఘము—(అను) కె. చంద్రమౌళి

## వేదవాఙ్మయము

కఠోపనిషత్తు—(ప్ర) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు

## వేదాంతము

అచలగ్రంథము—కె. ఆదినారాయణ
అద్వైతచంద్రిక—సి. కృష్ణస్వామయ్య
అద్వైతానందబోధిని—(ప్ర) టి. బి. మెహత అండ్ సన్స్, మద్రాసు
ఆత్మధ్యానమచలమైయున్నది—ప్రణవానంద
గీతామృతము—సం. వెంకటరత్నము
తత్త్వజ్ఞానతారావళి—యస్. శేషారెడ్డి
దుఃఖనివారణోపాయము—రామతీర్థస్వామి

భగవద్గీతామృతసారము—యం. తిమ్మయ్యశెట్టి
మానవధర్మము—జి. నరసింహశాస్త్రి
ముముక్షుతారకము—(ప్ర) వి. వెంకటరాజానరమ్మ, మచిలీపట్టణము
విజయనగర ద్వైతాద్వైత సభా వివాదవిమర్శన విమర్శనము—కె. వ్యాసమూర్తిశాస్త్రి
విశ్వమతదర్పణము—(ప్ర) శ్రీ రామకృష్ణపూజామందిరము, గుంటూరు
శ్రీ పరిపూర్ణాచలభాగవతము—సి. వెంకటనృసింహపతిభువనాయక్ రావు
శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారితత్త్వములు—(ప్ర) సుబ్బయ్య, కందిమల్లయ్యపల్లెగ్రామము
శ్రీ భగవద్గీతారత్నములు—(ప్ర) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు
శ్రీమదాంధ్రవివేకచూడామణి—(అను) యం. చినసోమయ్యచౌదరి

## వైద్యశాస్త్రము

ఆంగ్లేయౌషధగుణదీపిక—సి. శేషగిరిరావు
ఆయుర్వేదౌషధములు—(ప్ర) పి. బాపిరాజు, చోడవరము
జీవరసాయనశాస్త్రము—శి. రామరావు
పశుశాస్త్రము—యం. రామచంద్రమొదలియార్
భస్మప్రదీపిక—(ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము

## వ్యాకరణశాస్త్రము

ఆంధ్రభాషాస్వరూపబోధిని—పి. వెంకటాచార్యులు
వ్యాకరణబోధిని, ఫారం ౧, ౨, ౩ — పి. రామకోటయ్య

## శతకములు

కుమారశతకము — (ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మద్రాసు
కుమారీశతకము—(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు
కృష్ణశతకము—(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు
నృసింహశతకము — (ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు
బాలశతకము—(ప్ర) చోడవరి రామకృష్ణ మిత్రమండలి, కాచిపూడి
భక్తవత్సలశతకము—శి. కామేశ్వరమ్మ
మల్లికార్జున శతకము—(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు
రామరామ శతకము —(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు
శ్రీ కంచివరదరాజశతకము—ఎ. రాజేశ్వరకవి
శ్రీ కోదండరామశతకము—గి. చినవెంకటస్వామి
శ్రీ చందలూరి మహాలక్ష్మి శతకము—యస్. హనుమయ్య
శ్రీ భక్తచింతామణిశతకము—యస్. కృష్ణమూర్తి
శ్రీ రామశతకము—శి. వెంకటసుబ్బారావు
శ్రీ వేంకటేశ్వరశతకము—హెచ్. వెంకటరావు
సుగుణశతకము—పి. శ్రీ రామమూర్తి
సుమతిశతకము —(ప్ర) యస్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు

## సంగీతశాస్త్రము

గానకళాచంద్రిక—ఏ. సత్యనారాయణమూర్తి

## సారస్వతము

వసుచరిత్రవిమర్శనము — వి. చినసీతారామశాస్త్రి
సంస్కృతవాఙ్మయచరిత్ర—మల్లాది సూర్యనారాయణశాస్త్రి

## స్తోత్రము

శ్రీ రామనామస్తవము—వి. జానకిరామమూర్తి

## హరికథ

ఆదిత్యచరిత్ర—జి. కోటయాచార్యులు

# సాక్షాత్కారము

జి. జాషువ

చిగురుబట్టిన పశ్చిమ గగనభూమి-నంబుదంబుల దోబూచు లాడుకొనుచు
ముద్దులొలికించు లేనెల పోరగాని-నొక్క సాయాహ్నమునఁ జూచుచుంటి నేను.
అరయుచున్నంతలోన బ్రహ్మాండమందు-దాండవశివుండు ప్రోల బ్రత్యక్షమయ్యె
జాబిలికుమారు డరనిముసంబునంద-ఈశ్వరునిజటాజూటాన నిమిడిపోయె.

ఏనుగుతోలుతో, బడగ లెత్తినపాములకందువాలతో
మేనివిభూతిపుప్పొడులు, మేదిని జిందఁ నటింపఁ జొచ్చె నీ
శాను డజాండగోళమును, తన్మవలయంబును, సంచలింప సం
ధ్యానవపల్లవారుణవిహాయసదీర్ఘజటాప్రచండుడై.

భవునివికృతాట్టహాసధావళ్యగరిమ-గగనజాహ్నవి నుఱువులు గ్రక్కుకొనియె
కరతలంబున నున్న బంగారులేడి-మిన్నరయుచుండె, మున్గాళ్లమీద నిలిచి.

మలచినమంచుగడ్డవలె మైపులకింపులు నిల్చియున్న, యొ
ద్దులదొర నాని, భూతపతితొయ్యాలి, పర్వతరాజపుత్రి, యొ
ప్పులపరసీమ జేపకడ బూచినయెఱ్ఱగులాబితోట చ
క్కులు చెమరింప నాట్యమునకుం దలయూచుచునుండె జెంగటన్.

అంగాంగకముల నొక్కొక - శృంగారరసప్రబంధ మిమిడినభవురా
ణిం గాంచి, మధువు నానెడు - భృంగీగణమయ్యె నానిరీక్షణపంక్తుల్.

భవునికపాలమాలికలు పండ్లిగిలించుచునుండె బ్రాణము
న్నవియనుబోలె, నావెడగుటాశయము న్గమనించెనేమొ, భా
ర్గవి, యొకయస్థిపంజరము గా నిలిచెం గనుమూసినంతలో
నవల నభస్సు గన్పడియె నాట ముగించినశూన్యరంగమై.

పత్రికాముఖంబున నచ్చుపడిన బొమ్మ-కరయుగంబున మరల సాక్షాత్కరించె
చిత్రకారుని నేర్పు వైశిత్యమందు-నెంతకథయున్నదని నుతియించుచుంటి.



# కలగూరగంప



## మైసూరుసంస్థానము - తెలుగువారు

మైసూరుసంస్థానమునందలి తెలుగువారి పరిస్థితులను తలచుకొన్నప్పుడు ప్రతి ఆంధ్రునిమనస్సు కలవరపడుట సహజము. కాని తెలుగువారికి పరాజయము మెల్లమెల్లగ నలవాటగుచున్నది. బరంపురము, జయపురము, పర్లాకిమిడి మొదలైన ప్రాంతములను ఓఢ్రులు లాగికొనిపోవుచుండగా చూచి సహించుచున్న ఆంధ్రుడు మైసూరుసంస్థానమునందలి తెలుగువారి హీనస్థితిని గూర్చి తెలిసికొనినమాత్రము చేయునదేమి? కాని ఏమూలనుండియో 'ఆశ' నన్ను పురికొల్పుచున్నది. ఆంధ్రుడు ఈ విషయములోనైనను కొంత నడుముకట్టగలడనియు ఆందోళన విజయవంతముగ సాగించగలడనియు ధైర్యము తోచుచున్నది. అందుచేత రెండు మూడు సంగతులను పాఠకులకు నివేదించుటకు ఉత్సాహము గలిగినది.

మైసూరు సంస్థానమునందలి ఆంధ్రులసంఖ్య సుమారు పదిలక్షలున్నది. సంస్థానమునందలి భాషలలో జనసంఖ్యనుబట్టి ఆంధ్రము ద్వితీయస్థానము నాక్రమించుచున్నది. (కన్నడులసంఖ్య సుమారు నలుబదియారు లక్షలు)

కోలారుజిల్లా యందంతటను తెలుగువారే అధికసంఖ్యాకులు. బెంగుళూరు నగరమునందును, బెంగుళూరుజిల్లాయందలి సుమారు అయిదారు తాలూకాలయందును తెలుగువారే అధికసంఖ్యాకులు. ఇట్లే చిత్రదుర్గముజిల్లాయందలి సగము తాలూకాలలోను, తుమకూరు జిల్లాయందలి సగము తాలూకాలయందును తెలుగువారిసంఖ్యయే అత్యధికము. సంస్థానమునందలి పదిలక్షలన్నరమంది ఆంధ్రులలో సుమారు తొమ్మిదిలక్షలమంది పైనచెప్పిన ప్రాంతములలోనున్నారు. ఈ ప్రాంతము చిత్తూరు, అనంతపురము, ఉత్తరార్కాటు, సేలం జిల్లాల నానుకొనియున్నది.

మైసూరు సంస్థానమునందలి పదిలక్షల పైచిలుకు తెలుగువారిలో తెలుగుభాష చదువను వ్రాయను వచ్చినవారు అరుదు. వారికి తెలుగు ఉపయోగము లేదు. తెలుగుతో వారికి అవసరములేదు. అన్ని వ్యవహారములు సంస్థానభాషయైన కన్నడములో జరుగవలసినదే.

మీదుమిక్కిలి తెలుగుభాషను నేర్చుకొనుటకైనను వారికి అవకాశము కలిగింపబడుటలేదు.

మచ్చునకు తెలుగువారధికసంఖ్యాకులుగ నున్న కోలారుజిల్లాలోని పరిస్థితులను గమనింతము. ఈ జిల్లాలో తెలుగువారి సంఖ్య నాలుగులక్షలున్నర. ఉర్దూ మాతృభాషగ గలవారి సంఖ్య ౫౯ వేలు మాత్రమే. కాని ప్రారంభవిద్య నేర్పు పాఠశాలల సంఖ్య ఉర్దూ భాషకు సంబంధించినవి ౧౪౦. తెలుగుభాషకు— ఒక్క పాఠశాలయైనను లేదు. సంస్థానమంతటిలోను ప్రారంభవిద్య నేర్పు పాఠశాలలు ౫,౭౦౬. తెలుగునేర్పునది ఒక్కటియైనను లేదు.

మాధ్యమిక (మిడిల్ స్కూలు) పాఠశాలలు ౨౯౩. వీనిలో ౨౫౭ పాఠశాలలలో కన్నడము, ౩౦ పాఠశాలలలో ఉర్దూ, ౪ పాఠశాలలలో అరవము, ౧ పాఠశాలలో ఇంగ్లీషు నేర్పబడుచున్నవి. తెలుగున కెక్కడను తావు లభించలేదు.

మైసూరు సంస్థానములో నలుబది హైస్కూళ్లు గలవు. వీనిలో మూడు హైస్కూళ్లలో మాత్రమే తెలుగునకు స్థానము కలదు. కళాశాలలన్నిటిలోను తెలుగు నేర్పబడుచున్నది కాని మొదటినుండియు నితరభాషలలో తప్ప విద్యనేర్చుకొనుట కవకాశములేని సందర్భ

మున హైస్కూళ్లలోను, కళాశాలలలోను తెనుగున కొంత స్థానమిచ్చుటవలన మేలుకలుగుట అసంభవము.

సంస్థాన వ్యవహారములందును, విద్యావిధానము నందును మిక్కిలి హీనస్థితిలో నుంచబడిన ఆంధ్రభాష నానాటికి నశించుచుండుటలో నాశ్చర్యము లేదు. బొంబాయి రాజధానియందు నలుబది యేండ్లక్రిందటగల తెలుగువారిసంఖ్య పదేండ్లక్రిందట లేదు. కొన్ని కులములవారు పూర్తిగ అన్యభాషావలంబన మొనర్చినట్లు బుఖ్లార్ మొదలగు గ్రంథకారులు వ్రాసియున్నారు. మైసూరుసంస్థానమున ఒగి తెలుగువారికి కూడ ఈగతియే దాపురించనున్నది.

మైసూరుసంస్థానము పెదసరపు పద్ధతుల నవలంబించుటలేదు. కాబట్టి సక్రమాందోళనవలన మన యభీష్టము సిద్ధించగలదని నే నూహించుచున్నాను. ఆందోళన జరుపుటలో మన ఆశయములను నిర్ధారణచేసికొని కార్యసాధనకు బయలుదేరవలసియుండును.

హైదరాబాదు సంస్థానమును తెలింగానా మరాఠ్వాడా, కర్నాటక అని విభాగములు చేసినట్లే కోలారుజిల్లాను మరియు బెంగుళూరు, చిత్రదుర్గము తుంకూరుజిల్లాలందలి యాంధ్రభాగములను కన్నడభాగములనుండి ముందు ప్రత్యేకించవలెను ఈభాగమునకు బెంగుళూరునగరము కేంద్రస్థానముగ నిర్ణయించవలెను. ఈ ప్రత్యేకభాగమునందలి యావద్వ్యవహారములును ఆంధ్రభాషలో జరుగునట్లు సంస్థానమువారు ఉత్తరువు లీయవలెను. వ్యవహారములందు తెలుగుభాషకు అర్హస్థానమును సంపాదించనిచో భాష నేర్చుకొనియు ప్రయోజన ముండదు. తెలుగు నేర్చుకొనుటకన్న మాను కొని మరొక భాష నేర్చుకొనుటయే లాభదాయకముగ కనుపడగలదు.

పైన పేర్కొనబడిన భాగమునందు విరివిగ తెలుగు భాషాజ్ఞానమును వ్యాపింప జేయుటకు విద్యాలయములను నెలకొల్పవలెను.

మైసూరు సంస్థానమునందేయుండి, ఆంధ్రులు తమ వ్యక్తిత్వమును గోలుపోకుండ నుండుటకును, ఆంధ్ర ప్రాంతములు తమ ప్రత్యేకతను నిలుపుకొనుటకును, ఆంధ్రభాష కాలప్రవాహమునబడి కొట్టుకొని పోకుండుటకును అనువగు నవకాశమును గల్పించుకొనుట గత్యంతరము.

మైసూరు సంస్థానమునందలి యాంధ్రులను 'నిద్ర' నుండి మేలుకొలిపి, పైయాశయములను వారికి బోధించి వారి కుత్తేజము గలిగించుటకు ప్రయత్నము లిప్పుడే యారంభమైనవి. హిందూపురవాస్తవ్యులును, ఉన్నత రాజవంశసంజాతులు, కీర్తిశేషులగు హనుమంతయ్యగారి ప్రథమపుత్రులును నగు పి హెచ్. జగదీశచంద్రరాయల వారు ఈయుద్యమమును జయప్రదముగ సాగించుటకు ప్రయత్నములు చేయుచున్నారు. వీరికి యావదాంధ్ర లోకమును తనుతోడ్పాటును ప్రోత్సాహమును గావించ వలసియున్నది.

వీలైనకొలదల రాబోవు ఆంధ్రమహాసభలో ఈ విషయమై యొకతీర్మానమును ప్రతిపాదించి కార్యరంగమున ప్రవేశమొనర్చుటకు తెలుగువారెల్లరును సంసిద్ధులు కావలెను.

టేకుమళ్ళ రామచంద్రరావుగారు
ఎం. ఏ., బి. యల్.

(కృష్ణాపత్రిక ఫిబ్రవరి ౨౩-వ తేది.)

# భారతీయ మహిళామండలి



శ్రీమతి శ్రీరంజని

ఈమె నాటకాభినయమునను, 'సినిమా' అభినయమునను మంచినేర్పు గడించుకొన్నది. 'లవకుశ' తెలుగు 'టాకీ'యందు సీతపాత్రను కడు మెలకువతో నిర్వహించి మెప్పుదలను పొందినది. ఈమె యభినయ కౌశలమునకు మెచ్చి శ్రీ జయపురము మహారాజాగారీమధ్య చెన్నపురియందు ఈమెను సత్కరించి, గారవించిరి.




## సుభాషితరత్నమాల

గ్రంథకర్త: విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మ, ప్రధానాంధ్రోపాధ్యాయుడు, సెంట్‌పాల్సు హైస్కూలు, వేపేరి, మద్రాసు.

ఇందు నూటనాలుగు నీతిపద్యము లున్నవి. ఇవి సంస్కృతమూలశ్లోకముల కనువాదములు. కాని రచన స్వతంత్రములవలె కనుపట్టును. మీన ధారాశుద్ధియు కలదు. చివర పదునైదుపుటల మేర "లఘుటిప్పణము" కూర్పబడెను. లోకప్రవృత్తియుం బిండలినీకుల యుపయోగము బహుళము. వెల నాల్గు అణాలు.

---

## విశ్వేశ్వర సంప్రార్థనము

డెమ్మీ ౧౬ పుటలసైజు, పు. ౫౬. వెల ౦-౧-౦.

గ్రంథకర్త: డాక్టర్ జటావల్లభుల వెంకటేశ్వరులు, అచ్చంపేట, కాకినాడతాలూకా. విశ్వేశ్వర స్తుత్యాత్మకములగు ముప్పదిపద్యము లిందు గలవు.

---

## హా రి జ ను డు

౨౮ పుటల డెమ్మీ ౧/౧౬ సైజు, పుస్తకము వెల ౦-౧-౦. రు. ౦-౧-౮. పోస్టుబిళ్లలనుపంపిన పుస్తకము బుక్కుపోస్టున పంపబడును.

గ్రంథకర్త: తాళ్లూరి జియ్యరుదాసు, శ్రీరామాశ్రమము, తాళ్లపాలెము, పొన్నూరుపోస్టు.

గ్రంథమున గీతపద్యములలో హరిజనప్రబోధము కావింపబడినది. గ్రంథకర్త 'హరిజను' డట. ఇది విశేషము. సులువుగ అర్థమగునట్లు కూర్పబడినవి పద్యములు.

## గ్రిసెల్డా

పదునాలుగుపుటల క్రౌను ౧/౮ సైజు గ్రంథము. వెల రు. ౦-౧-౦. ఇది వచనరచనము. మూలము (ఆంగ్లము:) శ్రీరామతీర్థస్వామిది. అనువాదము సూరి నరసింహముపంతులుది. కథ చాలమందికి తెలిసినదే. గ్రిసెల్డా హృదయమును గ్రిసెల్డాపతి పరీక్షించుట కొరకు పుట్టినది. అనువాదకులు 'జగమెఱింగినవారు' కావున రచనమునుగూర్చి చెప్పబనిలేదు.

ప్రకాశకులు: వ్యాసకుబేరమువారు, మేలుపాక, ఎలమంచిలి, విశాఖపట్టణముజిల్లా.

---

## నీతికథలు (భాగములు ౧, ౨, 3)

౧/౮ క్రౌనుసైజున పు. 30, ౫౬, ౭౧. వెల రు. ౦-౨-౬; రు. ౦-౪-౦; రు. ౦-౫-౦.

గ్రంథకర్త: గొల్లపూడి శ్రీరామశాస్త్రిలు, ప్రధానాంధ్రోపాధ్యాయులు, హైస్కూలు, చిత్తూరు.

ఒక్కొక్కపుస్తకమున చక్కనిచిన్నకథలు గలవు పుస్తకముల చివర పద్యములును కొన్నిగలవు. రచనము మృదువు, ఋజువు నయినది. చిన్నతరగతుల బడిపిల్లలు చదువదగినపుస్తకము లివి

గ్రంథకర్త: పిల్లలకొఱకు పుస్తకముల ననేకముల రచియించి పేర్పవడసినవారు.

---

## నలకీర్తికౌముదీ - సంస్కృతకావ్యము

### ౨, ౪ సర్గలు మాత్రము

౧/౮ రాయలు సైజున పు ౧౪.

కావ్యకర్త: అగస్త్యమహాకవి. ఇతడు ప్రతాపరుద్రీయకర్త యగువిద్యానాథుడట. సంస్కృతగ్రంథసప్తతిని రచియించినాడట. ఇందలిశ్లోకములను గొన్నిటిని వసుచరిత్రకారు డనువదించెనట, 'నానాసూనవితానవాసనల'......ననుపద్యమునకు సరియగు మూలశ్లోకమం దిట్లుకలదు:

'భృంగానవాప్తిప్రతిపన్నఖేదా,
కృత్వా వనే గంధఫలీ తపోఽలమ్,
తస్యాః శిఖాభూ దనుధూతగంధా,
స్వపార్శ్వసేవీకృత భృంగసేవ్యా.' ౨-౪౩.

రచనము రసవంతము, ప్రౌఢము. ఇందలి '౨, ౪ శిథిలసర్గలు' మాత్రము లభింప వానిని శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి ముద్రించి గీర్వాణవాణికి 'పత్రి' ప్రాయముగ సమర్పించినాడు.

---

## వివేకానంద

తొమ్మిదిరంగముల వచనరూపకము. 'సాహిత్యలతి' ప్రథమకుసుమము. క్రౌను ఎనిమిదిపుటలసైజు. పు. ౫౫. 'సాహిత్యలతి' చందాదారులకు రు. ౦-౮-౦. ఇతరులకు వెల రు. ౦-౧౨-౦.

గ్రంథకర్త: కర్లపాలెం కృష్ణరావు, ప్రొప్రైటర్, 'సాహిత్యలతి', చీరాల.

## సౌందరనందము

క్రి రాయల్ సైజు పు ౧౦౦, వెల రు. ౧-౦-౦.

కాగితము, అచ్చు, కట్టు, ముద్దులుమూటగట్టుచున్నది.

గ్రంథకర్తలు: పింగళి లక్ష్మీకాంతం (ఆంధ్ర విశ్వకళాపరిషత్తు), కాటూరి వేంకటేశ్వరరావు, (ఆంధ్ర జాతీయకళాశాల).

ప్రకాశకులు: ప్రభాకర్ అండ్ కో, రాబర్ట్సన్ పేట, బందరు.

## ౧. సరస్వతీరామాయణం (పద్యకావ్యము)

౧/౮ క్రౌనుసైజున గ్రంథము పు. ౨౬౨, పీఠికాదులు: పు. ౩౨. వెల రు. ౧-౦-౦.

## ౨. శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము (పద్యకావ్యము)

౧/౮ క్రౌనుసైజున పుటలు ౨౪, వెల రు. ౦-౪-౦. ఈరెండుగ్రంథములు శ్రీ చేబ్రోలు సరస్వతీదేవి (యం. ఏ) విరచితములు.

ప్రకాశనస్థానము: స్నేహలతాకవితాసంఘము, కొల్లాపురము, మురవకొండపోస్టు, కర్నూలుజిల్లా.

---

## ౧. పాలతరగలు, ౨. తేనెచినుకులు: (ఖండకావ్యసంపుటులు)

క్రౌను ౮ పుటల సైజు.

౧. పు. ౬౬, వెల రు. ౦-౮-౦.

౨. పు. ౬౪, వెల రు. ౦-౮-౦.

గ్రంథకర్త: మధురకవి నాళము కృష్ణరావు, రాజమహేంద్రవరము.

---

## సాహిత్యతత్త్వవిమర్శనము

౧/౮ డెమ్మీసైజున ౨౦౬ పుటలు, వెల రు. ౧-౪-౦.

కర్త: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఏం. ఏ., బి. ఎల్., "మాధవభాగ్" ౨, లజ్ చర్చి రోడ్, మైలాపూరు, మద్రాస్.

---

## కామకవిలాసము (అద్వైతసిద్ధాంతము)

౧/౮ డెమ్మీసైజు, పు. ౩౦౦.

సంస్కృతమూల గ్రంథకర్త: శ్రీపుణ్యానంద ముని, ఆంధ్రభాషావ్యాఖ్యానకర్త సింహంభట్ల రామమూర్తిశాస్త్రి.

ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, ౨౯౬, ఎస్ప్లనేడ్, మదరాసు.

## మందలింపు

౧/౮ క్రౌనుసైజున ౨౨ పుటలు.

గ్రంథకర్త: పూతలపట్టు శ్రీరాములురెడ్డి, ప్రధానాంధ్రోపాధ్యాయుడు, బోర్డుహైస్కూలు, చిత్తూరు.

### యువనామసంవత్సర పంచాంగము

నల్లాన్ చక్రవర్తుల వేంకటరాఘవాచార్యులుగుణించినది. ఏలూరు.

---

### లక్ష్మీ, సరస్వతీ సంవాదము

౧/౮ డెమ్మీసైజున ౮ పుటలు, వెల రు. ౦-౨-౦.

లక్ష్మీ, సరస్వతులరచన మిది.

ప్రకాశకులు; ప్రెసిడెంటు, స్నేహలతా కవితాసంఘము, కొల్లాపురము, మురవకొండపోస్టు, కర్నూలుజిల్లా.

---

### వినోదశిల్పము (ప్రథమభాగము)

౧/౮ క్రౌనుసైజు, పు. ౧౩౨, వెల రు. ౧-౪-౦.

సంపాదకురాలు: కొ. స్వర్ణవల్లి.

ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల, ౬, ౩ తంబు శెట్టివీధి, మద్రాసు.

### ఆంధ్రవాఙ్మయసంగ్రహము (ప్రథమభాగము)

౧/౮ డెమ్మీసైజు పద్యభాగము, పు. ౩౮. గద్యభాగము, పు. ౭౮, వెల రు. ౦-౧౦-౦.

సంధాతలు: విద్వాన్, టి. ఆర్ముగంపిళ్లె, ప్రధానాంధ్రోపాధ్యాయుడు, ముత్యాలపేట హైస్కూలు చెన్నపురి; గన్నవరపు సుబ్బరామయ్య, సంపాదకుడు భారతి, చెన్నపురి.

ప్రకాశకులు: కే. పళనియాండిపిళ్లె కంపెని తంబుదాసువీధి, జి. టి. మదరాసు.

---

### కళానిధి (కథలమాసపత్రిక)

సంపాదకుడు, ప్రకాశకుడు: కొండవటిగంటి కృష్ణమూర్తిగారు, తెనాలి. సంవత్సరచందా రు. 3 లు. విడిసంచిక నాలుగణాలు.

---



'లాల' M. V. R.

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras, Editor: G. Subbaramayya.



# సాభిప్రాయ విశేషములు



గాంధీ మహాత్ముడు గ్రామోద్యోగోద్యమము నుపక్రమణము చేసినాడు. భారత శాసనసభయందు కాంగ్రెసు పక్షము, జాతీయపక్షము, స్వతంత్రపక్షము నిరంకుశ విధానములకు ప్రతిఘటనమును జూపుచున్నవి. ప్రభుత్వపక్షమునకు పరాజయములు సహజము లయినవి. రాష్ట్రీయ శాసనసభలందు బడ్జెటుచర్చలు జరుగుచున్నవి. ఢిల్లీయందు హిందూ మహమ్మదీయ సమస్య విషయమై సంప్రతింపులు జరిగినవి; సాంఘిక ప్రాతినిధ్య మహాసభ హిందూపక్షమునను గూడినది. బొంబాయిఢిల్లీలయందు సంస్థానాధీశులు, మంత్రులు సమావేశమై ఇండియా బిల్లును ఖండించిరి. హిందూమహమ్మదీయ రాయబారములు లండనుయాత్ర కేర్పాటులు చేయుచున్నవి. పార్లమెంటునందు ఇండియాబిల్లు కమిటిదశయందు చర్చలువర్గప్రతిఘటనమును బడయుచున్నను పురోభివృద్ధిని బొందుచున్నది. జులైమాసాంతమునకు ఇండియా బిల్లు శాసనరూపమును దాల్చునని యూహింపబడుచున్నది. నూతన రాజ్యాంగము లందు భిన్నపక్షములు, మతములు, సంఘములు, వర్గములు, ప్రయోజనములు స్వీయ సత్వపంరక్షణములకు విశ్వప్రయత్నములను చేయుచున్నవి. సర్ సామ్యుయల్ హోరుగారి రాజ్యాంగ మహేంద్రజాలవిద్యయందన్ని ప్రయత్నములును అంతరించుచున్నవి. ఇండియాబిల్లు స్వపరిపాలనమును గలుగజేయక పోయినను చిరకాలము రాజ్యాంగ కోలాహలమునకు మూల మగుట సహజము. స్వపరిపాలన నామమునను సంస్థానాధీశులు, జమీందారులు, వర్తకులు, సంఘాభిమానులు, సైనికులు, పరసేవోద్యోగులు వారివారి ఇండ్లను రక్షించుకొనుట కిప్పటినుండియును కోలాహలము చేయుచున్నారు. ఈ కోలాహలము రాజ్యాంగసంస్కరణము లారంభమయినతరువాతన దేశమునందును, ప్రజలయందును మూలలను వ్యాపించి గలుగజేయనున్న సంక్షోభము వర్ణనాతీతము. బ్రిటీషు రాజ్యాంగవేత్తల తంత్రప్రభావ మంతయును ప్రత్యక్షము కాగలదు. నిస్సహాయస్థితియందున్న భారతీయులకు దైవకటాక్షమును నమ్ముటకన్నను శరణ్యము గనుపడకున్నది.

* * *

భారతశాసనసభ

పరాధీనదేశములందు రాజ్యాంగ వ్యవహారములు సారహీనము లను విషయమును జనవరి, ఫిబ్రవరి మాసములందు నడిచిన భారతశాసనసభోదంతము విశదము చేసినది. ప్రభుత్వపరిపాలనమునకు అభిశంసన తీర్మాన

ములు, పరాజయములు, నిందలు ప్రతిబంధకములు కావు. ఎవరేమన్నను ప్రభుత్వము మాత్ర మాటంకములేకను నడుచుచుండును. ప్రతికూలపక్షమునను శ్రీ బూలాభాయి దేశాయిగారి ప్రసంగములు వారిప్రతిష్ఠను పెంపొందించినవి. బూలాభాయిగారి నిగ్రహము, మితభాషణము, పాండిత్యము, స్వాతంత్ర్యప్రియత్వము శాసనసభయం దగ్రస్థానమును సమకూర్చినవి. అస్సెంబ్లిమందిరమునందు వారి గంభీరప్రసంగములు మారుమ్రోగుచు కాంగ్రెసుప్రతిష్ఠనేకాకను శాసనసభాప్రతిష్ఠను సయితము కాపాడుటకు వినియోగపడుచున్నవి. ఉపనాయకుడు గోవిందవల్లభపంతుగారు నిర్భయముగను స్వధర్మనిర్వహణమును జేయుచున్నారు. సత్యమూర్తి, రంగ, గిరి, దాసుగార లప్రమత్తులయి పక్షవాదములను రక్షించుటకును, ప్రభుత్వవాదములను ఖండించుటకును ప్రయత్నించుచుందురు. ఆరితేరిన దేశభక్తులైన కాంగ్రెసుపక్షప్రతినిధులందరును స్వధర్మనిర్వహణమును జేయుచున్న విధము ప్రశంసాపాత్ర మయినది. దేశభక్తిపూరితులైన యువజనప్రతినిధుల రోషావేశములు ప్రభుత్వసభ్యుల హృదయములను వేధించుటకు చాలియున్నను పాషాణతుల్యములయిన హృదయములను వేధించుట యసాధ్యము. సూచిపోటిమాటలు దుస్సహములయినను భరించుట యధికారులకు సామాన్యమయినది.

మితవాదపక్ష నాయకుడు జిన్నాగారు సమర్థులు. వారేమిచెప్పుదురో, ఏమార్గము నవలంబించెదరో దురూహ్యముగ నుండును. వారిప్రసంగములు సహేతుకములయి, ఆకర్షణీయములయి విచారయోగ్యములుగ నుండును. వారు నొక్కినొక్కి గట్టిగా జెప్పినను వారిప్రసంగము లందరకును వినిపించుట దుర్లభము. జిన్నాగారి లక్ష్యమునందు మొదటను మహమ్మదీయ ప్రయోజనములు తదనంతరము దేశ ప్రయోజనములుగను పడుచుండును. స్వతంత్రపక్ష నాయకుడైన జిన్నాగారి పట్లను స్వతంత్ర శబ్దార్థము సకలవిధములను సార్థకముగ నున్నది. వారి యనుచరులును నిజముగను స్వతంత్రులే. ఎవరియిష్టానుసారము వారు ప్రవర్తించు చుందురు. మౌలానాషౌకతాలిగారు మందస్మితవదనముతో సంభ్రమానందములను కలుగజేయుచుందురు. వారేమిచెప్పినను సభ్యుల కాహ్లాదముగనుండును. జాతీయపక్ష నాయకుడు ఆనెగా రారితేరిన శాసనసభా సభ్యుడు. వారిప్రసంగములుశాస్త్రోక్తములయి సభాదరణమును బడయుచుండును. ఆనెగారి యనుచరులును జిన్నాగారియనుచరులవలెను వారియిష్టానుసారము ప్రవర్తించుట పరిపాటియైనది. యూరపియనుపక్షమునను జేమ్సుగారు మొదలగు ప్రముఖులున్నను వారు సామాన్యముగను ప్రభుత్వలక్ష్యమునె యవలంబించుదురు. ఆంగ్లోయిండియనుల ప్రతినిధి నిరంతరము తన సాంఘికులసత్త్వములకై వా

క్కలహమును జేయుచు సామాన్యముగను ప్రభుత్వపక్షముననే వోటు చేయుచుండును. ప్రభుత్వనియమిత సభ్యులందు జోషిగారు కార్మికపక్షప్రయోజనములను సమర్థించుచు ప్రభుత్వమును ప్రతిఘటించుచుండును. సిక్కులప్రతినిధిసర్దారు సంతుసింగు, సింధుప్రతినిధి జియాయుద్దీను, ఘజులుహక్కుగారులు ప్రశ్నోపప్రశ్నలను వేసి ప్రభుత్వాధికారులను వేధించుటయం దనుభవజ్ఞులయిన మహాయోధులు, ప్రభుత్వ నియమితసభ్యులు ప్రజ్ఞావంతులైనను స్వాతంత్ర్యరహితులై ప్రభుత్వపక్ష సమర్థనమునందు పరిహాసపాత్రు లగుచుందురు.

ప్రభుత్వాధికారసభ్యులు వ్యవహారజ్ఞులును, సమర్థులును నైనను పరావలంబనులు. సర్ జోసెఫుభోరు, సర్ ఫ్రాంకు నోయిస్, సర్ నృపేంద్రసర్కార్, సర్ పర్సిజేమ్సుగ్రిగు, సర్ హెన్రిక్రెయికు, సర్ లాన్సిలాటుగ్రాహాము, రావు, బాజపాయి, క్లవుగారులు మొదలగువా రందరును వ్యవహారజ్ఞులైనను పరావలంబనమువలన నాత్మవిశ్వాసము దుర్లభము. సర్కారుగారి నాయకత్వము ప్రభుత్వపక్షమునకు దుర్బలమును గలుగజేయునట్లు బలమును గలుగజేయుటలేదు. వ్యాపారాంగమంత్రి భోరుగారనుభవజ్ఞులు, సౌమ్యస్వభావులు. వారి సమర్థనము యుక్తియుక్తమైనను నిరుపయోగము. స్వదేశాంగమంత్రి క్రెయికుగారి సమర్థనములును నిరర్థకములుగ నుండును. రావుగారి జవాబులు సమాధానములు సరళములైనను సంతృప్తికరములు గావు. ఆర్థికశాఖాంగమంత్రి గ్రిగ్గుగారు మంత్రులందుత్సాహవంతుడు, పూర్వవయస్కుడు. అధికారావరణమునందు గ్రిగ్గుగారి యుత్సాహము చల్లబడుచున్నది. వాజపాయిగారును భోరుగారివలెనే సౌమ్యస్వభావు లయినను ప్రయోజనము గలుగక అధికారయోధుల బలము కాంగ్రెసు పక్షబలమున కన్నివిధములను తీసిపోవుచున్నది. ప్రభుత్వ పక్ష బలమును, కాంగ్రెసు పక్షబలమును పరిశీలించునపుడు కాంగ్రెసుపక్షబలమే విశేషమయినదని శాసనసభావ్యవహారములు సువ్యక్తము చేసినవి. కాంగ్రెసు పక్షమునకును స్వతంత్ర జాతీయపక్షములకును గలిగిన సంయోగమువలనను కాంగ్రెసుపక్షబలము సామాన్యముగను విజయము పొందుచున్నది. అయినను కాంగ్రెసువిజయములును, ప్రభుత్వ పరాజయములును ప్రభుత్వ హృదయమునందు గలుగజేయగల పరివర్తనమును కాలము వ్యక్తముచేయవలసియున్నది.

* * * *

### బడ్జెటుచర్చలు—కోతలు

రైల్వే బడ్జెటునందు ప్రభుత్వమునకు పరాజయ మారుసారులు కలిగినది. ప్రజాద్రవ్యముతో నిర్మింపబడి ప్రజాసౌకర్యమునకై పరిపాలింపబడెడి రైళ్లపరిపాలనమునందు

ప్రజాసౌకర్యములును, దేశ క్షేమమును, స్వదేశవ్యాపార ప్రయోజనములును, పనివాండ్రసౌకర్యములును, హైందవుల యుద్యోగములును దుర్లభము లయినపుడు రైల్వే బడ్జెటును సభ్యులు నిరాకరించుట ధర్మముగ నున్నది. రైళ్ల ప్రయాణికుల సౌకర్యపు కోతయందు యూరపియనులును భారతీయులతో చేయుటవలనను ప్రజాపక్షమునకు ౮౦ సమ్మతులును, ప్రభుత్వపక్షమునకు ४౦ సమ్మతులును లభించినవి. రైళ్ల నిర్మాణమునకు ౭౨౨ కోట్ల రూప్యముల అప్పు ఏర్పడినది. రైళ్లఆదాయము దేశమునందు వ్యాప్తమైన ఆర్థికదుస్థితివలనను క్రమముగను తగ్గిపోవుచు గత సంవత్సరమునందు ४४ లక్షలు నష్టము వచ్చినది. రాగలసంవత్సరమునందు నష్టము ౧౨ లక్షలకు తగ్గునని అంచనావేయబడినది. రైళ్లవలనను నష్టము గలుగుచున్నను తగ్గించిన జీతములు హెచ్చించబడినవి. బొంబయిసమీపమునను విద్యుత్తు రైలునకు మార్చుట విశేష వ్యయము నిర్ణయింపబడినది. నష్టములకు మూలములైన వ్యయమును తగ్గించి ప్రజాసౌకర్యములను దేశక్షేమమును పెంపొందించుటకుబదులు వ్యయ మధికము చేయబడుట గర్హ్యమనుట నిర్వివాదాంశము. శాసనసభాభిప్రాయమును నీవిషయమునె పరిస్ఫుటము చేసినది. కాని ప్రయోజనము మాత్రము సంశయాస్పదము. రైల్వేబడ్జెటు వలెను సామాన్య బడ్జెటును కొంతవరకు నిరాకరింపబడుట సంభవమైనను ప్రయోజనమున్మాత్రము దుర్లభ్యము.

* * *

ప్రభుత్వబడ్జెటు

బడ్జెటులను ప్రవేశపెట్టెడి సమయము లందుపన్నులనుసమర్థించుటకు ఆదాయమును తక్కువయును, వ్యయ మధికమును చూపుట ఆర్థికమంత్రులకు సహజపాండిత్యము. హిందూస్థానాదాయవ్యయములు ౧౯౩४-౩౫ లందు ౯౦౦౦ లక్షలును, వ్యయము ౮౭౭౩ పోను నికరాదాయము ౩౨౭ లక్షలు; ౧౯౩౫-౩౬ సంవత్సరమునందు ౯౦౧౯ లక్ష లాదాయము నుండి ౮౮౭౬ లక్షలు వ్యయముపోను నికరాదాయము ౧౫౦ లక్షలు. ఈ నికరాదాయము రాగల సంవత్సరాంతమునందు ४౦౦ లక్షలకుపైగా పెరుగుట సంభవము. రాగల సంవత్సరపుసంగతి యెటులున్నను గత సంవత్సరపునిలువ మొత్తమును ఖర్చుపెట్టుటయందు ప్రభుత్వ మవలంబించినవిధానము గర్హ్యము గ నున్నది. గతించిన అయిదేండ్లయందును దేశము నావరించిన ఆర్థికప్రళయమునందు వ్యవసాయదారుల జీవయాత్రదుర్భరమును ఉద్యోగస్థులజీవయాత్ర సుఖతరమును నైనవి. రయితులు వారివస్తువులను తక్కువధరల కమ్ముకొనుటయును, నెలనెలకును జీతములను, సంపాదించెడువారలు తక్కువధరలకు వస్తువులను కొనుటయును సంభవించినది. ప్రభుత్వము కష్టపడుచున్న రయితులకు

పన్నులభారమును తగ్గించుటకుబదులు సుఖపడుచున్న ఉద్యోగస్థుల జీతములను పునరుద్ధరించుట సకలవిధములను నిరాదరణీయము. ఆదాయమునుండి బ్రాడ్‌కాస్టింగునకు జేసెడి వ్యయమునకుబదులు రయితులకు భారమును తగ్గించుట న్యాయమయి యుండును. గ్రామసౌకర్యములకై వినియోగింపదలచిన ౧౦౦ లక్షలును కొంత ఆశాజనకముగ నున్నను వేలగ్రామముల కీమొత్తము నిరుపయోగము. ఆదాయపు పన్నును ౧౦౦౦ నుంచి ౨౦౦౦ వేలకుగల ఆదాయముల పన్నును మూడవవంతును తగ్గించుటకు బదులు తీసివేయుట న్యాయమై యుండును. వెండిసుంకములను తగ్గించుటయు, తోళ్ల మెగుమతి పన్నును తీసివేయుటయును విశేష విషయములు కావు. సైన్యవ్యయభారమును ప్రారసేవోద్యోగుల ఖర్చులును ౫౯-౨౯ లక్షలెప్పటికి మార్పును పొందజాలవు. ఈస్థితియంతయును గ్రామవాసుల కేవిధమైన సౌకర్యములను గలుగజేయలేదని విశదమగుచున్నది.

*  *  *

## గ్రామవాసుల దుర్దశ

భారతప్రభుత్వ మవలంబించెడి ఆర్థిక విధానమంతయును బ్రిటీషువ్యాపార వాణిజ్య సైనికోద్యోగుల సౌకర్యముల కేర్పడినటులు స్పష్టమగుచున్నది. సైన్య వ్యయమును తగ్గించుట కెన్నికమిషను లేర్పడినను ప్రయోజనము గలుగలేదు. పన్నుల విధానమంతయును మారుట న్యాయమని యంగీకరించియును క్రియయందు మామూలుమార్గమునే యవలంబించుట ప్రభుత్వ నిర్లక్ష్యమునకు ప్రమాణము. గ్రామముల కవసరమైన పోస్టుసౌకర్యములు గతవత్సరమునందుతగ్గింపబడినవి. సకలానర్థములకును మూలమైన ౧౮ పెన్నీల మారకము రేటునందు మార్పుగలుగకున్నది. హిందూస్థానశుభస్థితికి మూలకందములయిన గ్రామసీమల శుభస్థితికిరాష్ట్రీయ ప్రభుత్వములు కాని, కేంద్రప్రభుత్వము కాని పూనుకొనకుండుట సంతాపకరము. రయితులు పన్నులబరువుక్రిందను క్రుంగిపోవుచు నగలనమ్ముకొని జీవయాత్రను గడుపుచు దాచిపెట్టుకొనిన కోట్లబంగారమును విదేశములపాలు చేయుచున్నను విదేశ ప్రభుత్వమునందుసంచలనము గలుగలేదు. గాంధి మహాత్ము డుపక్రమించిన గ్రామోద్యోగోద్యమము ప్రభుత్వహృదయమునందు భయమును గలుగజేసినవిధము ౧౦౦ లక్షల గ్రాంటును విశదము చేయుచున్నది. కోట్లరూప్యముల గ్రాంటులకన్నను గాంధిమహాత్మునితోను, ప్రజానాయకులతోను కలిసి గ్రామోద్యోగోద్యమమును నిర్వహింపబూనుట ప్రభుత్వమునకును, ప్రజలకును సకలవిధములను క్షేమకరము.

Pri ted and Published by K Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras,
Editor: G. Subbaramayya.

THE OFFICE OF

Telephone No.
2544.
Telegrams
"ANDHRAPATRIKA"

# The Andhra Patrika

POST BOX 212.

7. THAMBU CHETTY ST.,
**MADRAS,**

*Dated, 8th March 1935.*

## To businessmen.

Dear Sirs,

Re: Our Annual Supplement for 1935.

It is a matter of great pleasure to us to inform you that 50% of our usuol as well as new clients have been kind enough to respond to our previous circulur and send their orders with necessary matters and blocks for the advertisements in our Annual Supplement.

There is hardly an interval of 25 days for completing the Special Supplement and so you are also requested to send in your order too with advertisement matter and necessary blocks etc. at an early date and oblige.

CURRENT NET RATES

| | | | | | |
|---|---|---|---|---|---|
| Ordinary full page | Rs. | 35 | Special full page | Rs. | 45 |
| ,, Half page | ,, | 20 | Imitation art page | ,, | 55 |
| ,, Quarter page | ,, | 11 | With double colour per page | ,, | 65 |

ప్రథమ, ద్వితీయ సంపుటములు అమ్మకమునకు సిద్ధముగా నున్నవి

# ఆంధ్రవిజ్ఞానసర్వస్వము

## ద్వితీయ సంపుటము

ఇందు 'అన్' నుండి "అశ్విని" వఱకును గల విషయము గలదు

ప్రతి సంపుటము ౧-కి వెల రూ. ౧౦-౦-౦

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెం. ౭, తంబుశెట్టివీధి, మదరాసు.

